ఓమ్

శ్రీగురుభ్యోనమః.

శ్రీమద్వేదవ్యాస మహర్షి ప్రణీతాష్టాదశ మహాపురాణ రత్నభూత

శ్రీస్కాంద పురాణాంతర్గత

# కార్తిక పురాణము.

నిఖిలమనీషి జనోపకారాయ

మఛిలీపట్టణ వాస్తవ్యేన చెల్లా నాగలింగశాస్త్రి పుత్రేణ

లక్ష్మీనృసింహశాస్త్రిణా

సాంధ్రతాత్పర్యం విరచితం,

బ్రహ్మశ్రీ ఇంగువ వేంకటకృష్ణశాస్త్రిభిస్సమ్యక్శోధయిత్వా

బందరుపుర్యా భరణాయమానాయాం

ఆర్యానంద ముద్రాక్షరశాలాయాం

ముద్రయిత్వా ప్రకాశితం

తృతీయ ముద్రణము

సహస్ర ప్రతులు (500)

దీని వెల రు 1—8—0

1946 సం॥

 (పోస్టుఖర్చులు ప్రత్యేకము.

గ్రంథారంభము చేయునప్పుడు పఠించునది.

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ॥

శ్లో॥ యచ్ఛివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా।
తయోస్సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళమ్॥

శ్లో॥ లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
యేషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః॥

శ్లో॥ అగ్రతః పృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ ।
ఆకర్ణ పూర్ణ ధన్వానౌ రక్షతాం రామలక్ష్మణౌ॥

శ్లో॥ సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా ।
గచ్ఛన్మమాగ్రతో నిత్యం రామః పాతు సలక్ష్మణః॥

---

పురాణము దర్శించునప్పుడు పఠించునది.

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం।
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥

---

పురాణములో పంక్తిచూచునప్పుడు పఠించునది.

శ్లో॥ వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం।
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిం॥
వందే సూర్యశశాంకవహ్ని నయనం వందే ముకుందప్రియం।
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్॥

---

పురాణము ప్రారంభించునప్పుడు పఠించునది.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥

---

అక్షరపంక్తులను చూచునప్పుడు పఠించునది.

శ్లో॥ అగజాననపద్మార్కం గజాననమహర్నిశం ।
అనేకదంతం భక్తానా మేకదంతముపాస్మహే॥

నూతనకథా ప్రారంభించునప్పుడు పఠించునది.

శ్లో॥ ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ
నిర్వాహకోరకితనేమకటాక్షలీలామ్ ।
శ్రీరంగహర్మ్యతలమంగళదీపరేఖాం ।
శ్రీరంగరాజమహిషీం శ్రియమాశ్రయామః॥
వందేలక్ష్మీం పరశివమయీం శుద్ధజాంబూనదాభాం ।
తేజోరూపాం కనకవసనాం స్వర్ణభూషోజ్జ్వలాంగీం ।
బీజాపూరం కనకకలశం హేమపద్మం దధానా।
మాద్యాంశక్తిం సకలజననీం విష్ణువామాంకసంస్థామ్॥

---

తుమ్ము సంభవించునప్పుడు పఠించునది.

శ్లో॥ ఓంకారపంజరశుకీ ముపనిషదుద్యాన కేళికలకంఠీం ।
ఆగమవిపినమయూరీ మార్యామంతర్విభావయే గౌరీమ్॥

---

పురాణశ్రవణంబున రోదనము వినునప్పుడు పఠించునది.

శ్లో॥ కుఙ్కుమాంకితవర్ణాయ కుందేందుధవళాయచ।
విష్ణువాహనమస్తుభ్యం పక్షిరాజాయ తేనమః॥

---

పిడుగు పడునప్పుడు పఠించునది.

శ్లో॥ అర్జునః ఫల్గునః పార్థః కిరీటీ శ్వేతవాహనః ।
బీభత్సుర్విజయః కృష్ణస్సవ్యసాచీ ధనంజయః॥

సూర్యదర్శనము లేనప్పుడు పఠించునది.

శ్లో॥ బ్రహ్మస్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరమ్।
సాయంధ్యాయేత్సదావిష్ణుం త్రిమూర్తించ దివాకరః॥

రాత్రిపూట పురాణము ప్రారంభించునప్పుడు పఠించునది.

శ్లో॥ దీపంజ్యోతిఃపరబ్రహ్మ దీపస్సర్వతమోపహః।
దీపేనసాధ్యతేసర్వం సంధ్యాదీపంనమోఽస్తుతే॥

ప్రత్యహం గ్రంథము ముగించునప్పుడు పఠించునది.

శ్లో॥ రామస్కంధం హనూమంతం వైనతేయం వృకోదరం।
శయనేయస్స్మరేన్నిత్యం దుస్స్వప్నస్తస్య నశ్యతి॥

పురాణకోశము దాచునప్పుడు పఠించునది

శ్లో॥ మూలతోబ్రహ్మరూపాయ మధ్యతోవిష్ణురూపిణే।
అగ్రతశ్శివరూపాయ వృక్షరాజాయతేనమః॥

పురాణమునందుంచు తులసిమాలను గ్రహించునప్పుడు పఠించునది.

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః।
యదగ్రే సర్వవేదాశ్చ తులసీంత్వాం నమామ్యహమ్॥

ప్రసాదం స్వీకరించునప్పుడు పఠించునది.

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణంచ శమ్యంచ బడబానలం।
ఆహారపరిణామార్థం స్మరామిచవృకోదరమ్॥

నివేదన తాంబూలము భక్షించునప్పుడు పఠించునది.

శ్లో॥ ధన్వంత్రిణం గరుత్మంతం పణిరాజంచ కౌస్తుభం।
అచ్యుతం చామృతం చంద్రం స్మరేదౌషధకర్మణి॥

తీర్థము స్వీకరించునప్పుడు పఠించునది.

శ్లో॥ శరీరేజర్ఝరీభూతే వ్యాధిగ్రస్తేకళేబరే।
ఔషధం జాహ్నవీతోయం వైద్యోనారాయణోహరిః॥

ఓం పరబ్రహ్మణేనమః.

# స్కాంద పురాణాంతర్గత కార్తికపురాణము.



## ఆంధ్రతాత్పర్య సహితము.

శ్లో॥ వాగీశాద్యాస్సుమనస స్సర్వార్థానాముపక్రమే।
యన్నత్వాకృతకృత్యాస్స్యు స్తంనమామిగజాననమ్॥

ఋషయఊచుః॥ శ్లో॥ వసిష్ఠేనవిదేహాయ కథితంబ్రూహినోమునే।
శ్రోతుకామావయంత్వత్తః కార్తికోత్తమముత్తమమ్॥

తా॥ నైమిశారణ్యమందు సత్రయాగ దీక్షితులైన శౌనకాది మహామునీశ్వరు లొకప్పుడు నిఖిలపురాణవక్తయైన సూతమహర్షి నిగురించి ఓసూతమహర్షీ! జనకమహారాజును గురించి వసిష్ఠ మహామునిచేత చెప్పఁబడిన కార్తీకమాహాత్మ్యమును సవిస్తరముగా మేము మీవలన వినగోరితిమి కనుక తెలవివ్వవలయునని అడిగిరి.

సూతఉవాచ॥ శ్లో॥ వసిష్ఠేనవిదేహాయ కథితంకీర్తివర్ధనం। బ్రహ్మణా కథితంతద్వన్నారదాయమహాత్మనే॥ మహాదేవేనపార్వత్యై రమాయైచక్రిణాతథా। తదహంసంప్రవక్ష్యామి శ్రోణ్వంతుమునయోఽఖిలాః। యచ్ఛ్రుత్వాముచ్యతేజంతుర్జన్మసంసార బంధనాత్॥

తా॥ సూతుఁడు పలుకుచున్నాఁడు శౌనకాది సమస్త మునీశ్వరులారా వినుడు, యీకార్తీక మాహాత్మ్యమును వసిష్ఠ మహాముని జనక మహారాజుగారికి చెప్పెను. అట్లు గానె నారదునకు బ్రహ్మయు పార్వతికి శివుడును లక్ష్మీదేవికివిష్ణువుచెప్పెను. దీని వలన సమస్త సంపత్తులు ప్రాప్తించును. దీనిని విన్నవాఁడు జనన మరణ రూప సంసార బంధనమును తెగ్రించుకొని మోక్షము నొందును.

శ్లో॥ అగాత్కదాచిద్దైవేదేహం వసిష్ఠోబ్రహ్మనందనః।
దిష్ట్యాసిద్ధాశ్రమంగంతుం విదేహగృహమావిశత్॥

తా॥ ఒకానొకప్పుడు దైవవశముచేత సిద్ధాశ్రమమునకు బోవుచున్న వసిష్ఠ మహాముని జనకమహారాజు గృహమునకు జేరెను.

శ్లో॥ దృష్ట్వావిదేహ స్తంవిప్ర మాసనాదవరుహ్యచ। ననామదండవద్భూమౌసంతోషపులకాంకితః। అర్ఘ్యపాద్యాదిభిస్సమ్యగభ్యర్చ్యవిధివత్తదా। పాదప్రక్షాళనస్యాపః స్వయంధృత్వాతుమస్తకే। తస్యాదివ్యాసనందత్వా భక్తిభావేనతంమునిం। ఉత్ఫుల్లవదనాంభోజం సర్వభూతదయాపరం। శాంతందాంతంసదాచారం బాలసూర్యసమప్రభం। సమస్తగుణసంపన్నముపాచ నృపతిస్తదా॥

తా॥ అంత జనక మహారాజు, వచ్చిన వసిష్ఠునిజూచి సింహాసనమునుండి త్వరగాదిగి దండప్రణామముజేసి సంతోషముచేత పులకాంకితుడై అర్ఘ్యపాద్యములచేత పూజించి ముని పాదోదకమును తన శిరస్సునందుంచుకొని బంగారు పుటాసనమునుయిచ్చి వికసించిన తామర పుష్పములవంటి కన్నులుగలవాడును, సమస్త జంతువులందును దయగలవాడును అంతరింద్రియనిగ్రహ బహిరింద్రియనిగ్రహములు గలవాడును సదాచారవంతుడును బాలసూర్యసమానకాంతి గలవాడును సమస్త సుగుణ సంపన్నుడును అగు మునితో భక్తిభావముతో నిట్లని విన్నవించెను.

రాజోవాచ॥ శ్లో॥ ధన్యోస్మికృతకృత్యోస్మి దర్శనాత్తవభూసుర। అస్మాకంపితరస్సర్వే తృప్తిమాయాంతిసాంప్రతం॥ మహాతాందర్శనంశ్రేష్ఠం దుర్లభంగృహమేధినాం। భవేదాగమనంమహ్యాం హేతుఃకళ్యాణసిద్ధయే॥

తా॥ రాజు పలుకుచున్నాడు. బ్రాహ్మణోత్తమా మీదర్శనమువల్ల నేను ధన్యుడనైతిని నేను చేయదగిన పుణ్యమింకేమియులేదు. యిప్పుడు మాపితరులందఱు తృప్తినొందినారు. మహాత్ములయొక్క దర్శనము సంసారులకు దుర్లభము, గనుక యిప్పుడు మీరు మాయింటికి రావడమువల్ల నాకు శుభములు చేకూడును.

శ్రీసూతః॥ శ్లో॥ ఏవంవదంతంరాజానం వీక్ష్యేందకిస్ఫుల్లలోచనః। కృపాభావేనసంతుష్టః ప్రాహేదంప్రహసన్నృపం॥

తా॥ సూతుడు చెప్పుచున్నాడు. జనక రాజిట్లు పలికిన తరువాత వసిష్ఠమహర్షి వికసించిన ముఖముగలవాడై దయతోగూడినవాడై సంతోషించి చిరునవ్వు నవ్వుచు రాజుతో నిట్లని పలికెను.

శ్లో॥ స్వస్తితేఽస్తునృపశ్రేష్ఠ యాస్యామ్యాశ్రమమండలం। శ్వోయజ్ఞోభవితాస్మాకం ద్రవ్యంత్వాందాతుమర్హసి॥

తా॥ రాజోత్తమా నీకు క్షేమమగుగాక నేను మాయాశ్రమమునకు బోవుచున్నాను, రేపు మాయింటివద్ద యజ్ఞము జరుగవలెను, దానికి యిప్పుడు ద్రవ్యమును నీవు యిచ్చుటకు తగియున్నావు.

రాజోవాచ॥ శ్లో॥ దాస్యామిద్రవిణంభూరి ధర్మంగోప్యంమహామునే।
త్వత్తోహంజ్ఞాతుమిచ్ఛామి శ్రోతౄణామఘనాశనం॥

తా॥ రాజు అడుగుచున్నాడు. మునీశ్వరా, యజ్ఞమునకుచాలాద్రవ్యమునుయిచ్చెదనుగాని వినువారి పాపములను బోగొట్టు ధర్మరహస్యమును నీవలన వినగోరినాడ.

శ్లో॥ జానాసిసర్వధర్మాణాం సూక్ష్మంభూరిఫలప్రదం।
జ్ఞాతుమిచ్ఛామివిప్రేంద్ర ధర్మంవక్తుమిహార్హసి॥

తా॥ నీకు తెలియని ధర్మరహస్యములు లేవు కాబట్టి అధిక ఫలము నిచ్చెడి సూక్ష్మధర్మమును నాకు చెప్పవలెను.

శ్లో॥ కార్తికస్సర్వమాసేభ్యో ధర్మేభ్యోప్యాధికఃకథం।
శ్రోతుకామాయమే బ్రూహిధర్మజ్ఞోసిమహామతే॥

తా॥ మునీశ్వరా! కార్తికమాసము సమస్త మాసములకంటెను సమస్త ధర్మములకంటెను యెట్లధికమైనదో దానిని వినగోరినాను నాకు చెప్పుము నీకంటె ధర్మము చెప్పువారులేరు.

వసిష్ఠః॥ శ్లో॥ శృణురాజన్ప్రవక్ష్యామి శ్రోతౄణామఘనాశనం।
సాధుత్వయోదితావాణీ లోకోద్ధరణహేతవే॥
పూర్వకర్మవిపాకేన సత్వశుద్ధిఃప్రజాయతే॥

తా॥ వసిష్ఠుడు పలుకుచున్నాడు. రాజాపూర్వమందు పుణ్యమాచరించినయడల సత్వశుద్ధిగలుగును. సత్వశుద్ధి గలిగిన పుణ్యమార్గమందభిలాష గలుగును, గనుక లోకోపకారార్థమై యిప్పుడు నీవడిగిన మాట చాలా బాగున్నదో యీ చెప్పెదను వినుము. విన్నంతనే పాపములు నశించును.

శ్లో॥ తులాసంస్థేదినకరే కార్తికేమాసియోనరః।
స్నానందానంపితృశ్రాద్ధం అర్చనంశుద్ధమానసః।
తదక్షయ్యఫలంప్రాహు ర్యత్కరోతినరేశ్వర॥

తా॥ రాజా సూర్యుడు తులాసంక్రమణ మందుండగా కార్తికమాసములో చేసిన స్నానము దానము అర్చనము మొదలైనవి మంచి మనస్సులో యేవి చేసినను అవి అక్షయ్యము లగునని మునీశ్వరులు చెప్పిరి.

శ్లో॥ సంక్రమంవాసమారభ్య మాసమేకంనిరంతరం ।
మాసస్యప్రతిపద్యాంవా ప్రారభేత్కార్తికవ్రతమ్॥

తా॥ కార్తీకవ్రతమును తులాసంక్రమణము మొదలుకొనిగాని కార్తీక శుక్ల పాడ్యమి మొదలుకొని గాని ఆరంభించవలెను.

శ్లో॥ నిర్విఘ్నంకురు మే దేవ దామోదరనమోస్తుతే ।
ఇతిసంకల్ప్యవిధివత్ప్రాచ్యాత్స్నానంసమాచరేత్ ॥

తా॥ ఆరంభమందు ఓ దామోదరా నేను కార్తీకవ్రత మారంభించుచున్నాను దానిని నిర్విఘ్నముగా పూర్తిజేయుము అని సంకల్పముచేసి కార్తీకస్నాన మారంభించవలెను.

శ్లో॥ మార్తాండోదయవేళాయాం కార్తిక్యాంకారయేన్నృప ।
కావేర్యాంకార్తీకేమాసి నదీస్నానంవిశిష్యతే॥

తా॥ కార్తీకమాసమందు సూర్యోదయ సమయమున కావేరీనదియందు స్నానమాచరించిన వారికి మహాఫలము కలుగ గలదు.

శ్లో॥ తులారాశింగతేసూర్యే గంగాత్రైలోక్యపావనీ ।
సర్వత్రద్రవరూపేణ సాసంపూర్ణాభవేత్తదా॥

తా॥ సూర్యుడు తులారాశిని ప్రవేశించిన తోడనే మూడు లోకములను పవిత్రము జేయుచు గంగానది ద్రవరూపమును ధరించి సమస్త నదీజలముల యందును ప్రవేశించునని తా॥

శ్లో॥ యస్మిన్స్నాతేహృషీకేశ స్తులాయాంగోష్పదోదకే ।
తటాకకూపకుల్యాసు నిత్యంసన్నిహితోహరిః॥

తా॥ తులారాశియందు కార్తీకమందు చెరువులందును దిగుడు భావులందును నూతులందును పిల్లకాలువలందును హరి నివసించియుండును.

శ్లో॥ నృపైషాంచసదాచారో వర్ణినాంకార్తికేతథా । గంగాం గత్వాశనైర్విప్రోనమస్కృత్యహరింస్మరన్ । ప్రక్షాళ్యపాదౌ హస్తౌచ ఆచమ్యప్రయతశ్శుచిః । అతిశుద్ధేనమంత్రేణచాను జ్ఞాప్యాథభైరవాన్ । కటిప్రమాణముదకంగత్వా స్నానం సమాచరేత్॥

తా॥ రాజా వర్ణులు కార్తికమందీ యాచారమును చేయవలెను. యిచ్చట వర్ణులనగా బ్రహ్మచారులని అర్థము రావచ్చునుగాని ముందు స్థితినిబట్టి చూచిన దానికి సరిపోదు సర్వవర్ణులు అని చెప్పిన యడల ముందు బ్రాహ్మణ కృత్యము మాత్రమె వచ్చుచున్నది. అయినను వర్ణాచారమునుబట్టి జరుపుకొన వచ్చునని తోచుచున్నది బ్రాహ్మణుడు కార్తికమాసమందు గంగకు బోయి నమస్కరించి హరిని ధ్యానించి కాళ్లుచేతులు కడుగుకొన్ని ఆచమనముచేసి శుద్ధుడై మంత్రములచేత భైరవానుజ్ఞను పొంది మొలలోతు జలమందు స్నానము చేయవలెను.

శ్లో॥ దేవాన్ ఋషీన్ పితౄన్ భక్త్యా తర్పయిత్వా యథావిధి। తత్రాఘమర్షణం కుర్యాద్భక్తిభావేన కేశవే। జపన్ ఆలోడ్య తత్తోయమంగుష్ఠాగ్రేణ భూమిప। పశ్చాత్తీరముపాగమ్య కుర్యాత్తత్రోదకాంజలిం నిష్పీడ్య ధృతవస్త్రం తద్వి రాచమ్య తతో నృప। నకుర్యాదార్ద్రవస్త్రేణ శిరసోద్వర్తనం తదా। ధారయేద్ధౌతవస్త్రంతు నారాయణమనుస్మరన్॥

తా॥ తరువాత దేవర్షి పితృతర్పణ మాచరించి హరిభక్తితో అఘమర్షణమంత్రమును పఠింపుచు బొటనవ్రేలికొనతో ఉదకమును ఆలోడనముచేసి తీరమునకు వచ్చి అచ్చట యక్ష్మతర్పణమును చేసి మొలవస్త్రమును విడిచి ఉదకమును వదలి ఆచమనము చేసి శిరస్సును వదలి మిగిలిన శరీరమంతయు తడివస్త్రముతో తుడుచుకొని నారాయణ ధ్యాన మాచరింపుచు ధౌతవస్త్రమును ధరించవలెను.

శ్లో॥ తతోర్ధ్వపుండ్రాన్ ధృత్వా గోపీచందనతో ద్విజః। సంధ్యాముపాస్య విధివద్గాయత్రీ జపమాచరేత్॥

తా॥ తరువాత బ్రాహ్మణుడు గోపీచందనముతో ౧౨ మారులు ఊర్ధ్వపుండ్రములను ధరించి సంధ్యావందనముచేసి గాయత్రీ జపము జేయవలెను.

శ్లో॥ తతశ్చాగ్నిమనుక్రమ్య హుత్వౌపాసనం శుభం। బ్రహ్మయజ్ఞం తతః కృత్వా దేవపూజాం సమాచరేత్। ఆహృత్య పూజాపుష్పాణి స్వారామోద్భవానిచ షోడశైరుపచారైశ్చ సాలగ్రామనివాసినం। శంఖచక్రధరం దేవం భక్తిభావేన చార్చయేత్॥

తా॥ తరువాత ఔపాసనము గావించి బ్రహ్మయజ్ఞముచేసి తనతోటలోనుంచి పుష్పములు తెచ్చి శంఖచక్రములను ధరించిన హరిని భక్తితో సాలగ్రామమందు షోడశోపచారములతో పూజించవలెను.

శ్లో॥ తతః పురాణపఠనంకృత్వా భక్తిసమన్వితః । గృహంగత్వా హరింపూజ్య వైశ్వదేవమతఃపరం॥ భుక్త్వాచాంతె ద్విరాచమ్య పురాణశ్రవణంపునః॥

తా॥ తరువాత కార్తీక పురాణమును పఠించి (లేక) విని యింటికి వెళ్ళి భక్తితో దేవతార్చన చేసి వైశ్వదేవమును నెరవేర్చి భోజనముచేసి ఆచమనము గావించి తరువాత పురాణకాలక్షేపమును చేయవలయును.

శ్లో॥ దినాంతేసర్వకర్మాణి సమాప్యవిధివన్నృప ప్రదోషసమయె రాజన్ విష్ణోర్వాశంకరస్యచ । యథాశక్త్యనుసారేణ దీపప్రజ్వాలనం శుభం। భక్ష్యభోజ్యాదిభిస్సమ్య గర్చయేద్భక్తవత్సలం ॥ వాచాస్తోత్రంచ తద్విష్ణోః॥ శైవంవావాగ్యతస్సుధీః । జప్త్వాతద్ధ్యాననిరతః నమస్కారం తతఃక్రమాత్ ॥

తా॥ సాయంకాలముకాగానె ఇతరవ్యాపారముల నన్నిటిని ఆపివేసి విష్ణ్వాలయమందుగాని శివాలయమందుగాని తనశక్తికొలది దీపములను బెట్టి భక్ష్యభోజ్యాదులతో స్వామిని పూజించి వాక్శుద్ధితో విష్ణుస్తోత్రమునుగాని శివస్తోత్రమునుగాని పఠించి నమస్కారము లాచరించవలయును.

శ్లో॥ ఏవంయః కార్తికేమాసి కురుతేభక్తినమ్రధీః ।
సయాతివైష్ణవంధామ పునరావృత్తివర్జితం॥

తా॥ ఈప్రకారము యెవడు కార్తీకమాసమందు భక్తితో చేయుచున్నాడో వాడు పునరావృత్తి వర్జితమైన వైకుంఠమును బొందుచున్నాడు.

శ్లో॥ ఇహజన్మనియత్పాపం యత్పాపంపూర్వజన్మని ।
తత్పాపంవిలయంయాతి కార్తికవ్రతముత్తమం॥

తా॥ పూర్వ జన్మార్జితములున్ను యీ జన్మార్జితములున్ను అయిన సమస్త పాపములు కార్తీక వ్రతమాచరించిన యడల నశించును.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియోవైశ్యః శూద్రశ్చైవతపోధనః ।
స్త్రియోవాభక్తిభావేన కార్తికోక్తంచరేద్యది ।
తేయాంతివైష్ణవంలోకం పునరావృత్తివర్జితం॥

తా॥ బ్రాహ్మణుడుగాని క్షత్రియుడుగాని వైశ్యుడుగాని శూద్రుడుగాని ఋషీశ్వరుడుగాని స్త్రీలుగాని భక్తిశ్రద్ధలతో కార్తీకవ్రతమును చేసినయడల వానికి పునరావృత్తిలేదు.

శ్లో॥ కార్తికేధర్మనిరతం దృష్ట్వామోదతియఃపుమాన్ ।
తద్దినాఘనివృత్తిస్స్యాన్నాత్రకార్యావిచారణా॥

తా॥ ఎవ్వఁడు కార్తీక వ్రతివంతుని జూచి సంతోషించునో వానియొక్క ఆదినమంబాచరించిన పాతకము నశించును. ఇందుకు సందేహములేదు.

ఇతి స్కాందపురాణె కార్తికమాహాత్మ్యే ప్రథమాధ్యాయస్సమాప్తః.

---

## అథ ద్వితీయోధ్యాయ ప్రారంభః.

వసిష్ఠః॥ శ్లో॥ శ్రుణురాజన్ప్రవక్ష్యామి మాహాత్మ్యంకార్తికస్యచ।
కర్మత్రయకృతాత్పాపా న్ముచ్యతేశ్రవణాదపి॥

తా॥ వసిష్ఠ మహాముని చెప్పుచున్నాఁడు రాజా కార్తీక మాహాత్మ్యమును వినుము. విన్నంతనే మనోవాక్కాయములవల్ల చేయఁబడ్డిన పాపమంతయు నశించును.

శ్లో॥ యఃకార్తికేమాసినృప సోమవారవ్రతంచరేత్ ।
సోమశేఖరతుష్ట్యర్థం సయాతిశివమందిరం॥

తా॥ కార్తీక మాసమందు శివప్రీతిగా సోమవార వ్రత మాచరించువాఁడు కైలాస నివాసియగును.

శ్లో॥ కార్తిక్యామిందువారేతు స్నానదానజపాదికం ।
అశ్వమేధసహస్రాణాం ఫలంప్రాప్నోత్యసంశయః॥

తా॥ కార్తీక మాసమందు సోమవారమందు స్నానమునుగాని దానమునుగాని జపమునుగాని చేసిన యడల ౧౦౦౦ అశ్వమేధయాగ ఫలమును, బొందును. యిందుకు సందేహము లేదు.

శ్లో॥ ఉపవాసంచైకభక్తం నక్తంచాయాచితవ్రతం।
స్నానంచతిలదానంచ షడ్విధంకవయోవిదుః॥

తా॥ కార్తీక మాసమందు ౧ ఉపవాసము ౨ ఏకభక్తము ౩ రాత్రిభోజనము ౪ అయాచిత భోజనము ౫ స్నానము ౬ తిలదానము యీ ౬ ను ఉపవాస సమానములగునని చెప్పిరి.

శ్లో॥ ఉపవాససమర్థానా ముపవాసోవిధీయతే। అసమర్థానాంత్వేప వాసే నక్తభోజనమాచరేత్ ॥ తదశక్తస్యతుచ్ఛాయా నక్తభోజన మిష్యతే। తదభావేద్విజైస్సార్థం దివాభోజనమేవవా॥

తా॥ శక్తిగలవాడు కేవల ఉపవాసము చేయవలెను అందుకు శక్తిలేనివాడు రాత్రిభోజన నియమమును చేయవలెను అందుకు శక్తిలేనివాడు ఛాయానక్తమును చేయవలెను అందుకు శక్తిలేనివాడు బ్రాహ్మణులను భోజనమునకు పిలుచుకొని వారితోసహా పగలే భోజనము చేయవలెను. ఛాయానక్తమనగా సూర్యకాంతి కొంచెము తగ్గిన తరువాత తనకాలకు రెట్టింపు కాలకు తననీడ రాగానే పగలే భుజించుట యిది గృహస్థులకు అశక్తియందును యతివిధవలకు శక్తియందును గూడ విధించబడినది.

శ్లో॥ యంధర్మంకార్తికేమాసి నాచరేద్యదియేనరాః।
కుంభీపాకేతుపచ్యంతే రౌరవేతుయుగాష్టకం॥

తా॥ మానవులు కార్తీకమాసమందు కార్తీక వ్రతములలో దేనినైనను ఆచరించని యెడల యెనిమిది యుగములు నరకమందు కుంభీపాకములోను రౌరవములోను బాధల నొందుచుందురు.

శ్లో॥ కార్తికేసోమవారేతు ఉపోష్యగతభర్తృకా।
సమభ్యర్చ్యవిధానేన విందేల్లోకంశివస్యతు॥

తా॥ కార్తీక సోమవారమందు విధవ యథావిధిగా యుపవాసముచేసి శివుని పూజించినట్లయిన శివలోకమును బొందును.

శ్లో॥ స్త్రీయోవాపురుషోవాపి కార్తికేచేందువాసరే।
నక్షత్రమండలంద్రుష్ట్వా యఃకుర్యాన్నక్తభోజనం।
తేషాంపాపానినశ్యంతి వహ్నౌప్రక్షిప్తతూలవత్॥

తా॥ స్త్రీలుగాని పురుషులుగాని యెవరు కార్తీక సోమవారమందు నక్షత్రములనుజూచి రాత్రి భోజనము చేయుదురో వారి పాతకములు అగ్నియందుంచబడిన దూదివలె నశించును.

శ్లో॥ సోమవారేతు కార్తిక్యాం శివలింగాభిషేచనం।
పూజాంచైవతునక్తంచ యఃకుర్యాత్సశివప్రియః॥

తా॥ కార్తీక సోమవారమందు శివలింగమునకు అభిషేకమును పూజయును చేసి రాత్రి భుజించువాడు శివునకు ప్రియుడగును.

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనం।
శ్రుణ్వతాంసర్వపాపఘ్నం వక్తౄణామఘనాశనం॥

తా॥ ఈవిషయమందొక కథ గలదు చెప్పెద వినుము యిది వినువారికిని చెప్పు వారికిని పాప నాశన కారియగును.

శ్లో॥ కాచిత్కాశ్మీర దేశేతు నామ్నాస్వాతంత్ర్యనిష్ఠురీ।
రూపయౌవనసంపన్నా సుకేశీసుష్ఠుమంగళా।
యాజకస్యసుతాతన్వీ పుంశ్చలీబహుభాషిణీ॥

తా॥ కాశ్మీర దేశమందొక పురోహితుని కూతురు స్వాతంత్ర్య నిష్ఠురియను నొక స్త్రీ గలదు అది చక్కని రూపముతోనున్న మంచి యౌవనముతో గూడియుండి తలదువ్వుకొని అలంకరించుకొని బహుగా మాట్లాడుచు జారత్వమును (లంజెతనమును) అవలంబించి యుండెను.

శ్లో॥ మాతాపితృపరిత్యక్తా శ్వశురాభ్యాంనరేశ్వర॥

తా॥ దీని దుర్గుణములను చూచి తల్లిదండ్రులును అత్తమామలును దీనినివిడిచిరి.

శ్లో॥ పతిస్తాంకర్కశాందృష్ట్వా ద్విజస్సౌరాష్ట్రసంభవః। మిత్రశర్మఇతిఖ్యాతో వేదవేదాంగపారగః। సదాచారసమాపన్నస్సర్వభూతదయాపరః। తీర్థయాత్రారతస్సమ్యక్సత్యవాదీ సదాశుచిః। ఏవంసర్వోత్తమోవిప్రో తర్జితస్తాడితోభృశం। సగార్హస్థ్యాభిలాషేణ చేతసానౌనచాత్యజత్॥

తా॥ దీనిభర్త సౌరాష్ట్రదేశస్థుండు అతనిపేరుమిత్రశర్మ అతఁడువేదవేదాంగ పారంగతుడును సదాచారవంతుడును. సమస్తభూతములందు దయగలవాఁడును అనేక తీర్థముల సేవించిన వాఁడును అబద్ధమాడనివాఁడును నిరంతరము శుచిగానుండు వాడును, యిట్టియుత్తమగుణములు గలవాఁడైనప్పటికి భర్త ఆయుర్మార్గపు భార్య యితనిని నిత్యము కొట్టుచుండేది అట్లు నిత్యము దానిచేత దెబ్బలు తినుచును గృహస్థ ధర్మమం దుండు కోరికచేత భార్యను విడువలేక దానితో కష్టపడుచున్నాడు వేదములనగా ౧ ఋగ్వేదము, ౨ యజుర్వేదము, ౩ సామవేదము, ౪ అథర్వణవేదము, అంగము లనఁగా ౧ శిక్ష ౨ వ్యాకరణము, ౩ ఛందస్సు, ౪ నిరుక్తము, ౫ జ్యోతిషము, ౬ కల్పము వీటిని సంపూర్ణముగా చదివినవాడు వేదవేదాంగ పారగుడనఁబడును.

శ్లో॥ కదాచిత్కర్కశా సుప్తా పరేషాంగా సతోషిణీ । దుర్జనైః
ప్రీతిసంయుక్తా యౌవనోద్బోధితా నృప ॥ ద్రవ్యైరాభరణై
స్సమ్యక్ సంతుష్టా దుష్టచారిణీ । పతినాప్రీతియుక్తేన రాత్రౌ
శయ్యాంసమాగతా ॥ పతింనిద్రాంసమాజ్ఞాయ శనైరుత్థాయ
సాతథా । శిలామాదాయ మహతీం మస్తకే ప్రాక్షిపద్రుషా ।
తేనసోపిమమారాథ కర్కశాసంగలాలసః ॥

తా॥ యీమిత్రశర్మ భార్యయగు కర్కశయనియెడు నామముగలది భర్తయైన మిత్రశర్మయు సంభోగవాంఛచేత దీని యందనురాగముతో నుండెను అంతనొకనాడు దీని రంకు మొగులు ద్రవ్యములను నగలను వస్త్రములను తృప్తిగా యిచ్చి నీసంతోషము సంభోగమునకు నీభర్తవల్ల భంగము గలుగుచున్నది గాన భర్తను చంపుమని చెప్పగా అది సమ్మతించి రాత్రి భర్త తనతో సంభోగించి పిమ్మట భర్త నిద్రించగా తాను లేచి పెద్దరాతిని తెచ్చి భర్తశిరస్సున కొట్టెను ఆదెబ్బతో అతను మృతినొందెను.

శ్లో॥ స్వయమాదాయతంపృష్ఠే కూపేవ్యసర్జయత్ ॥

తా॥ తరువాత కర్కశ స్వయముగా తనభర్త శవమును వీపుమీద వేసుకొని తీసుకొనిపోయి పాడునూతిలో పడవేసెను.

శ్లో॥ బహుభిర్యౌవనస్థైస్తైః పరస్త్రీసంగలాలసైః । కామశాస్త్ర
కలాప్తైశ్చ పరిరంభణచుంబనైః ॥ నానాజాతిధరైః పుంభిఃవర్ణ
సంకరకారకైః । కరోతిసంగమం నిత్యం సారతింపతిఘాతకీ ।

తా॥ ఇట్లు భర్తనుచంపి తరుణులును పరస్త్రీసంగమాపేక్షులును కామశాస్త్రప్రవీణులును వర్ణసంకర కారకులును అయిన అనేకజాతి పురుషులతో ఆలింగన చుంబనాదులతో నిత్యము సంభోగము చేయుచుండెను.

శ్లో॥ పతిభక్తిరతస్త్రీణాం కుంఠినీపరయోజనీ ।
ఏకపత్నీరతానాంచ తేషాంరతిపరాశుచిః ॥
పరనిందాపర ద్వేషీ సర్వదేవపరాఙ్ముఖీ ॥

తా॥ ఇంతేగాక భర్తయందనురాగముతో గూడి యున్న భార్యలను దుర్బుద్ధులచేత యితరులతో సంభోగము చేయించుచు ఏకపత్నీవ్రతులైన పురుషులను భంగపరచి వారితో సంభోగించుచు నిత్యము పరనింద చేయుచు సర్వదేవతా ద్వేషియు అయియుండెను.

శ్లో॥ దంభేనవాదయూహీనా పరిహాసేనమాయయా ।
నధ్యాతంవిష్ణుపాదాబ్జం నశ్రుతాహరిసత్కథా॥

తా॥ అగ నిరంతరము వయోమాన్యలైయున్నది యిదిగాక దంభముచేతగాని నవ్వులచేతగాని కపటముచేతగాని విష్ణుపాదారవిందమును ధ్యానించలేదు హరికథను వినలేదు.

శ్లో॥ యౌవనాతిక్రమంచాసీజ్జరాచాస్యాఉపాగతా ।
వ్రణవ్యాధిరభూద్రాజన్ క్రిమిభిఃపూర్ణశోణితా॥

తా॥ ఇట్లుండగానే దీనికి యౌవనముపోయినది ముదిమివచ్చినది తరువాత వ్రణ (కురుపు) వ్యాధికలిగినది ఆపుసుపుసు పురుగులు జనించినవి తరువాత దుర్గంధముగలిగినది.

శ్లో॥ సర్వేభుజంగాస్తాంభూప రూపవంతోమదాన్వితాః।
దృష్ట్వా౽౽శావిఫలా రాజన్ వేశ్మనాయాంతిదుఃఖితాః॥

తా॥ తరువాత జారులందఱు రూపవంతులు మదయుక్తులైవచ్చి చూచి విఫలాశులై దుఃఖించి పోయిరి.

శ్లో॥ మహారవ్యాధినాదుష్టా పాపాధిక్యాన్నరేశ్వర।
యమదూతాస్తదాజగ్ము శ్చండపాశభయంకరాః॥
యమస్యాంతికమానీయ తాం యమాయార్పయన్ భటాః॥

తా॥ తరువాత పాపాధిక్యముచేత చాలా బాధనొంది ఆవ్రణవ్యాధితోనే మృతినొందెను. తిరువాత భయంకరులైన యమదూతలువచ్చి ఆకర్కశను పాశములచేత కట్టి యమునివద్దకు తీసికొనిపోయి యమునికి వప్పగింత చేసిరి.

శ్లో॥ యమస్తాంకోపతామ్రాక్షో శిక్షామతిభయంకరీం।
అయసానిర్మితంస్తంభం తప్తంచాతిభయంకరం।
సకంటకంస్వజ్వలితం పరిరంభణకారణం॥

తా॥ యముఁడు దానిని చూచి కోపముచేత కన్నెఱ్ఱచేసి దీనిని భయంకరమును ముళ్ళతో గూడినదియు అయిన యినుముతో చేయఁబడిన స్తంభమును కాల్చి మండుచుండగా ఆలింగనము చేయించుమని కఠినమైన శిక్షను విధించెను.

శ్లో॥ తాంవైతదాయమభటా యమేనాజ్ఞప్తచేతసః।
ఆలింగయామాసురతః పాపంప్రతివదన్నృపః॥

తా॥ అంత యమాజ్ఞమీద భటులు ఆకర్కశను చేసిన పాపములను చెప్పుచు ఆఉడుకు స్తంభమును సంభోగించమనిరి.

శ్లో॥ తత స్తస్మాన్మూర్ధ్ని పాతంచ యమదండైర్భయంకరైః ।
కుంభీపాకేసపశ్చాత్తాం బాధంతే యమకింకరాః॥

తా॥ తరువాత యమకింకరులు యముని దండములచేత కర్కశముగ శిరస్సుమీదకొట్టి తరువాత కుంభీపాకనరకమందు బాధింపుచుండిరి.

శ్లో॥ శిలోపరిపునస్తాంచ పాదౌసంగృహ్య తాడయన్ ।
తత స్తేతప్తరక్తంచ తస్యాః పానమచీకరన్ ।
త్రపుంతప్తం సమాదాయ ద్వ్యశ్రోత్రే ప్రక్షిపంతిచ॥

తా॥ తరువాత దాని పాదములు రెండు పట్టుకొని రాతిమీద పెట్టికొట్టిరి తరువాత రక్తమును కాచి త్రాగించిరి. సీసమును కాచి రెండు చెవులలోను పోసిరి.

శ్లో॥ ఇత్యాదిభిర్మహాఘోరైః రాజన్ తాం యమకింకరాః ।
చిత్రగుప్తేనబహుశః ప్రేరితాస్తేయమేనచ॥

తా॥ యమకింకరులు యమాజ్ఞమీదను చిత్రగుప్తాజ్ఞమీదను అనేక నరకబాధలను పెట్టుచుండిరి.

శ్లో॥ సామహాఘోరనరకం పితృభిశ్చపితామహైః ।
స్వబాంధవైరన్యైశ్చ దశపూర్వైర్దశాపరైః ।
నారకీంయాతనాంభుక్త్వా పునర్భూమిముపాగతా॥

తా॥ ఆకన్యక యిట్లు తన పితృపితామహులతోను తనబాంధవులతోను గూడను పూర్వము పదిమంది పరము పదిమంది మొత్తము ఇరువదితరములు తనతోగూడ ఇరువదియొక్కటి వారితో ఘోరములైననరకములందుమహాబాధలుపొందితరువాతభూమియందుజన్మించెను

శ్లో॥ శ్వానయోనౌసముత్పన్నా దశజన్మనిపంచచ ।
తతఃపంచదశేరాజన్ కలింగేబ్రాహ్మణాలయే॥
శ్వానదేహమనుప్రాప్య చోదితాచగృహేగృహే॥

తా॥ భూమియందు పదిహేను మాఱులు కుక్కగా జన్మించినది అందులో పదిహేనవ జన్మ కలింగదేశమందు బ్రాహ్మణుని యింట్లో కుక్కగా పుట్టి యింటింటికి తిరుగుచుండెను.

శ్లో॥ కదాచిద్బ్రాహ్మణగృహే కార్తికేచేందువాసరే ।
శివపూజాంచ విధివత్కృత్వా నక్షత్రమండలం ।
దృష్ట్వాసమాగాద్రాజేంద్ర బలిమాదాయపాణినా ।

నివేదనాం తేచబలిం త్యక్త్వాబ్రాహ్మణపుంగవః।
పాదౌప్రక్షాళ్యచాచమ్య ప్రావిశద్గృహమంజసా॥

తా॥ ఓజనక మహారాజా! వినుము యిట్లుండగా నొకానొకప్పుడు ఆబ్రాహ్మణుడు కార్తీక మాసమందు సోమవారము దినంబున పగలంతయుపవాసముచేసిగృహమందు శివలింగాభిషేక పూజాదులనుజేసి నక్షత్రమండలమునుజూచి గృహముకుబోయి దేవనివేదనచేసి పిమ్మట బలిగానము కొనుకు బయటకు వచ్చి భూమిమీద బలినివుంచి కాళ్లుకడుక్కొని ఆచమనముచేసి తిరిగి యింట్లోకి వెళ్లెను.

శ్లో॥ దివానలబ్ధ్వావేశంవా సాశునీబలిభోజనం।
కార్తీక్యామిందువారేతు అకరోద్బలిభక్షణమ్॥

తా॥ ఆకుక్క ఆనాడు పగలంతయు ఆహారము దొరకనందున కృశించినదై కార్తీక సోమవారము కాలమున ప్రదోషదినంబున ఆబలిని భక్షించెను.

శ్లో॥ తేనజాతిస్మృతిరభూత్స్వాహీ త్యాహముహుర్ముహుః।
సవిప్రోనిస్మితోభూత్వా గృహంగత్వాబ్రవీద్వచః।
కింకింకరోషిచాస్మాకం గృహేతత్కారణంవద॥

తా॥ ఆబలి భోజనముచేత కుక్కకు పూర్వజాతిస్మృతిగలిగి బ్రాహ్మణోత్తమా రక్షింపు రక్షింపుమని పలికెను ఆమాటవిని బ్రాహ్మణుడు బయటకువచ్చిఆశ్చర్యముతో కూడినవాడైయోకుక్కా మాయింట్లోయేమేమి చేసినావురక్షింపమనుచున్నావుఅనిఅడిగెను

శన్యువాచ॥ శ్లో॥ భోబ్రహ్మన్ శృణుమేవాక్యం నారీచాహం
పురాద్విజ। కులటాపాపనిరతా జాతిసంకరకారిణీ॥
పరేషాంసంగతిరతా పుంశ్చలీపతిఘాతకీ।

తా॥ కుక్క చెప్పుచున్నది ఓబ్రాహ్మణోత్తమా వినుము నేను పూర్వజన్మమందు బ్రాహ్మణ స్త్రీని పాపములను చేయుదానను లంజను వర్ణసంకరమును చేసినదానను అన్యపురుషులను మరిగి నిజభర్తను చంపినాను.

శ్లో॥ ఏవమాదీనిపాపాని కృత్వాచయమమందిరే।
తత్రభుక్త్వాయాతనాంచ పునర్భూమింగతాస్మ్యహం॥
జన్మేదమంతిమంవిప్ర జాతిస్మరణకారణం।
తద్వదస్వద్విజశ్రేష్ఠః శ్రుత్వాచాహంపునామివై॥

తా॥ ఇట్టి మొదలైన పాపములు అనేకములు చేసి చచ్చి యమలోకమునకు బోయి అచ్చట అనేక బాధలననుభవించి తిరిగి భూమిపై పుట్టి గ్రామసూకరముగాను, కుక్కగాను జన్మించినాను చివరకు యిప్పుడు నాకు జాతిస్మరణ మెట్లుగలిగినదో చెప్పుము వినిదలంచినాను.

శ్లో॥ ఏవం శునీత్యాస విప్రేంద్రో జ్ఞానచక్షురదర్శయత్।
కార్తిక్యామిందువారేతు బల్యన్నం సక్తభోజనాత్॥
జాతిస్మరణహేతుర్వై సాధుజ్ఞాత్వేతి సోవదత్॥

తా॥ ఆబ్రాహ్మణోత్తము డామాటవిని జ్ఞానదృష్టితో చూచి తెలుసుకొని యిట్లనియె ఓశునకమా యీ కార్తీక సోమవారమునాడు పగలు ఉపవసముండి సాయంకాలము భుజించక యిప్పుడు నేను వుంచిన బలిని భక్షించినావు గనుక నీకు జాతిస్మృతి గలిగినది.

శ్లో॥ సాశునీతుపునః ప్రాహ బ్రాహ్మణం వేదపారగం।
మాంపాహికృపయాబ్రహ్మన్ శ్వానయోనిధరాంద్విజ॥

తా॥ ఆమాటను విని కుక్క వేదవేదాంగపారగుడైన యాబ్రాహ్మణోత్తమా యీకుక్కజాతినుంచి నాకెట్లు మోక్షము గలుగునో చెప్పుమా యని అడిగెను.

శ్లో॥ ఏవం సంప్రార్థితో విప్రో దదౌధర్మమనుత్తమం।
కార్తిక్యామిందువారేషు ఏకవారేణయత్ఫలం॥
తత్ఫలంప్రదదౌసద్య ఉపకారాయభూపతే॥

తా॥ కుక్క యిట్లు ప్రార్థించగా ఆబ్రాహ్మణుడు పరోపకార బుద్ధితో కార్తీక సోమవారములందు తానుచేసిన పుణ్యములలో ఒకసోమవారపుణ్యము కుక్కకు ధారపోసెను.

శ్లో॥ దేదీప్యమానదేహాథ్య దివ్యస్రగ్వస్త్రభూషణా।
పితృభిస్సహరాజేంద్ర కైలాసంప్రతిసాయయౌ॥
శివేనమోదతేతత్ర శివాయుద్వన్మహీపతే॥

తా॥ బ్రాహ్మణుడు సోమవార పుణ్యమును యివ్వగానే కుక్కదేహమును విడిచి ప్రకాశించుచున్న శరీరము గలదై ప్రకాశించెడు వస్త్రములను మాల్యములను ధరించి ఆభరణాలంకృతయై తన పితరులతో గూడ కైలాసమునకు బోయి అచ్చట పార్వతీదేవివలె శివునితో గూడ ఆనందించుచుండెను.

శ్లో॥ తస్మాత్కార్తికమాసేతు సోమవారవ్రతంచరేత్॥

తా॥ కాబట్టి కార్తీకమాసమందు సోమవారవ్రత మాచరించతగినది.

శ్లో॥ యఃకరోతివ్రతంభక్త్యా కైవల్యంకరసంస్థితం॥

తా॥ ఎవ్వడు కార్తీక సోమవార వ్రతమును చేయునో వానికి మోక్షము హస్త మందుండును.

శ్లో॥ తస్మాత్త్వమపిరాజేంద్ర కార్తిక్యాంధర్మమాచర॥

తా॥ జనక మహారాజా పుణ్యప్రదమైన కార్తీక వ్రతంబును నీవు చేయుము.

ఇతి శ్రీ స్కాందపురాణె కార్తీకమహాత్మ్యే
ద్వితీయోధ్యాయ స్సమాప్తః.

---

## ౩. అథ తృతీయోధ్యాయ ప్రారంభః.

శ్రీవసిష్ఠఉవాచ॥ శ్లో॥ కార్తికెమాసిరాజేంద్ర స్నానదానజపాదికం।
లేశంవాకురుతెమర్త్యా స్తదక్షయ్యఫలంస్మృతం॥

తా॥ ఓజనక మహారాజా వినుము కార్తీక మాసమందు స్నానదాన జపము మొదలైన పుణ్యములలో యేదైనను స్వల్పమైనను చేసిన యెడల అస్వల్పమె అనంత ఫల ప్రదమగును.

శ్లో॥ అనిత్యందేహమాశ్రిత్య కార్తికోక్తంచరేన్నహి।
స్త్రీయోవాపురుషోవాపి శ్వానయోనిశతంవ్రజేత్॥

తా॥ స్త్రీలుగాని పురుషులుగాని అస్థిరమైన శరీరమును నమ్మకుని శరీరకష్టమునకు భయపడి కార్తికవ్రతమును చేయనియెడలనూరుమారులుకుక్కగాజన్మించవలసివచ్చును.

శ్లో॥ పౌర్ణమాస్యాంకార్తికెమాసి స్నానదానాంతునాచరేత్।
కోటిజన్మసుచండాల యోనౌసంజాయతెనృప॥

తా॥ కార్తీక పూర్ణిమ రోజున స్నానదానములు ఉపవాసము చేయని మనుష్యుడు కోటిమారులు చండాలుడై జన్మించును.

శ్లో॥ క్రమాద్యోనౌసముత్పన్నో భవతిబ్రహ్మరాక్షసః।
అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనం॥

తా॥ అట్లు చండాలుడై పుట్టి చివరకు బ్రహ్మరాక్షసుడై యుండును, యీవిషయమందొక పూర్వకథ కలదు చెప్పెదను వినుము.

శ్లో॥ తత్వనిష్ఠస్యచరితం తత్సమాసేన మేశ్రుణు।
ఆంధ్రదేశేద్విజఃకశ్చి త్తత్వనిష్ఠ ఇతిశ్రుతః॥

సర్వశాస్త్రార్థకుశల స్సత్యవాదీ జితేంద్రియః।
తీర్థయాత్రా సునిరత స్సర్వభూతదయాపరః॥

తా॥ ఆఇతిహాసము తత్వనిష్ఠునిదై యున్నది గనుక దానినివినుము, రాజా ఆంధ్ర దేశమందు తత్వనిష్ఠుడను నొక బ్రాహ్మణుడు గలడు, అతడు సమస్త శాస్త్రములను చదివినవాడు, అబద్ధమాడనివాడు, ఇంద్రియములను జయించినవాడు, సమస్తప్రాణు లందు దయగలవాడు, తీర్థయాత్రలందాసక్తి గలవాడు.

శ్లో॥ కదాచి త్తీర్థయాత్రార్థ మటమానోన రేశ్వర। గోదావరీతటె రాజ న్వటె చాంబరచుంబిని॥ తస్మిం స్త్రయః పిశాచాశ్చ బ్రహ్మ రాక్షససంజ్ఞికాః। ఊర్ధ్వకేశాః కరాళాస్యాః కృష్ణదేహాః కృశో దరాః। రక్తనేత్రా శ్మశ్రుముఖా దీర్ఘదంతాసిపాణయః। కపాలా వరణా రాజ న్సర్వభూతభయంకరాః॥

తా॥ రాజా ఆబ్రాహ్మణుడు ఒకప్పుడు తీర్థయాత్రకు బోవుచు గోదావరి తీర మందు ఆకాశమునంటియున్నట్లుండు మఱ్ఱిచెట్టుమీద మూడుబ్రహ్మరాక్షసులనుచూచె ను. ఆబ్రహ్మరాక్షసులకు తలవెంట్రుకలు పైకి నిక్కియున్నవి, నోరు వికటముగా నున్నది, శరీరము నల్లగానున్నది, ఉదరము కృశించియున్నది, నేత్రములు గడ్డము ముఖము యెఱ్ఱగానున్నవి, దంతములు పొడుగుగానున్నవి, చేతిలో కత్తియున్నది, కపా లములు పైనవున్నవి యిట్లుండి సర్వజంతువులను భయపెట్టుచుండెను.

శ్లో॥ వటస్య పరితో రాజ న్త్రిగవ్యూతి ర్నిరంతరం।
మనుష్యాః పశవ స్తద్వ త్పక్షిణశ్చ మృగా స్తథా॥
నకదాచిచ్చరంతిస్మ రాక్షసానాం మహాభయాత్॥

తా॥ ఆరాక్షసుల భయముచేత ఆవటవృక్షమునకు ఆరుక్రోశముల దూరము లోపల మనుష్యులు పక్షులు మృగములు సంచరించుటయేలేదు.

శ్లో॥ మహాపర్వతసంకాశైః పశుపక్షిమృగాదిభిః।
వటవృక్షసమీపేతు బహుభిర్భీమదారుణైః॥
ముచ్యంతె బహవోన్యోన్యం శబ్దాః ప్రాణభయప్రదాః॥

తా॥ ఆవట సమీపమందు నిత్యము పర్వత సమాన శరీరులు భయంకరములు అగు పశువులు పక్షులు మృగములు అన్యోన్యమును గూర్చి ప్రాణములకు భయంకర ములగు శబ్దములను చేయుచుండెను.

శ్లో॥ దిష్ట్యాద్విజవరోరాజన్ కార్తికస్నానతత్పరః।
గచ్ఛన్ దదర్శతన్మార్గే రాక్షసాన్ వృక్షమాశ్రితాన్॥

తా॥ అనేక కార్తిక వ్రతము లాచరించిన ఆతత్త్వనిష్ఠుడు దైవవశముచేత ఆమార్గమున పోవుచు మఱ్ఱిచెట్టుమీదనున్న ముగ్గురు బ్రహ్మరాక్షసులను జూచెను.

శ్లో॥ సంత్రస్తహృదయస్తత్ర రుదన్ భీత్యాచవిహ్వలః। స్మరన్ విష్ణుపదద్వంద్వం తత్త్వనిష్ఠోవనీపతే। త్రాహిదేవేశలోకేశ త్రాహి నారాయణావ్యయ। సమస్తభయవిధ్వంసిన్ త్రాహిమాం శరణాగతం। నాన్యంపశ్యామి దేవేశ త్వత్తోహంజగదీశ్వర॥

తా॥ తత్త్వనిష్ఠుడు బ్రహ్మరాక్షసులను జూచి భయపడి హృదయము చలించిపోయి శోకించుచు చీకాకునొంది శ్రీహరిపాదారవిందములను స్మరించుచు దేవేశ నన్ను రక్షించుము లోకేశా నన్ను కాపాడుము, నారాయణా నన్ను పాలించుము, అవ్యయా నామొరాలకించుము, సమస్త భయముల నశింపజేయు దేవా నాభయమునుతీసివేయుము నాకు నీవేదిక్కు, నన్ను కాపాడుము, నీవు తప్ప నన్ను రక్షించ సమర్థులెవ్వరును లేరు.

శ్లో॥ ఏవంపలాయమానంతం రాక్షసానుగతాస్తదా।
భయాత్కంపాన్వితం విప్రేంద్రదృష్ట్వాతేజసాహతాః॥
దర్శనాత్తస్యవిప్రస్య సంజ్ఞానంజాయతేఽమలా॥

తా॥ ఈప్రకారము గజేంద్రుడు వలె హరిని గూర్చి మొరబెట్టుచు వాతిభయమున పరుగెత్తుచున్న బ్రాహ్మణునిచూచి బ్రహ్మరాక్షసులు వానిని భక్షించవలెను తలంపుతో అతని వెంబడి పరుగెత్తసాగిరి, ఇట్లు కొంతదూరము పోగానే బ్రాహ్మణుని సమీపస్థితి దర్శనములవల్ల బ్రహ్మరాక్షసులకు జాతిస్మృతి గలిగినది.

శ్లో॥ చక్రుఃప్రణామంతేభూమౌ బ్రాహ్మణాయమహాత్మనే।
తేరాక్షసాఃప్రాంజలయస్తదగ్రేనృపపుంగవ॥
తుష్టువుర్వివిధైర్వాక్యైర్విప్రంభూతదయాపరమ్॥

తా॥ తరువాత బ్రహ్మరాక్షసులు ఆబ్రాహ్మణునిముందఱ భూమియందుదండప్రణామము లాచరించి అంజలిపట్టి నమస్కరించి అనేకవాక్యములతో నిట్లనిస్తుతించిరి.

శ్లో॥ బ్రహ్మన్ తెదర్శనాత్సద్యో వయంనిష్కల్మషాలయాః।
భవదాగమసంబ్రహ్మన్ లోకోపకరణాయవై।

మహాత్మాంజీవనంలోకే ప్రాణినాముపకారకం॥
మహద్విచలనంవిప్ర తేచపాపహర్మహీపతే॥

తా॥ బ్రాహ్మణోత్తమా మీదర్శనము వలన మేము పాపహీనులమైతిమి, మీరు రావడము మాకు ఉపకారము కొరకైనది, అది న్యాయమే, మహాత్ములు జీవించుట జంతువుల కుపకారము కొరకేగదా! మహాత్ములు యాత్రచేయుట లోకమునుద్ధరించుటకేగదా! ఇట్లని రాక్షసులు పలికిరి.

శ్లో॥ ఏవంప్రత్యుదితంశ్రుత్వా బ్రాహ్మణోభయవర్జితః।
కేయూయమితితానాహ ప్రసన్నేనాంతరాత్మనా।
కిమిదంకర్మణాకేన వికారంరూపమీదృశం।
భవద్భిఃకింకృతంపూర్వం విద్వద్భిరతినిందితం।
వదధ్వంనాత్రసందేహో యుష్మాకంమాభయంయుతః॥

తా॥ బ్రాహ్మణుడీ మాటలను విని భయమును వదలి మంచిమనస్సుతో నిట్లనియె, మీరెవ్వరు యేకర్మచేత మీకిట్టి వికృత రూపములు గలిగినవి లోకనిందితమైన యేకర్మను మీరు పూర్వమందు చేసినారు? మీకు భయము పోదగు కాలము వచ్చినది గనుక భయమును వదలి సర్వమును నాకు చెప్పుడి.

శ్లో॥ తేనస్మరంతితేసర్వం పృథక్తత్కర్మనిందితం।
విప్రాగ్ర్యమూచుస్తత్రైత్థం తద్వాదామస్రుమాగతాః॥

తా॥ తరువాత రాక్షసులు తమరు చేసిన నింద్యకర్మలను వేరు వేరుగా తలచుకొని ఆబ్రాహ్మణునితో యిట్లని విన్నవించిరి.

ప్రథమ ఉవాచ.

శ్లో॥ అహంపురాద్రావిడేషు గ్రామణీర్బ్రాహ్మణాధమః॥ నిష్ఠురోవాక్యచతురః గ్రామేమందరసంజ్ఞకే॥ బ్రహ్మస్వంచమయాభుక్తం కుటుంబాసక్తబుద్ధినా। బంధుభ్యోబ్రాహ్మణేభ్యశ్చ నాన్నందత్తంమయాపురా ॥ బ్రహ్మస్వంప్రణయాద్భుక్తం దహత్యాసప్తమంకులం। తదేవచౌర్యరూపేణ దహత్యాచంద్రతారకం। ఘోరవైయాతనాంభుక్త్వా సభూమాబ్రహ్మరాక్షసః। దోషస్యాఽస్యప్రశమనే ఉపాయంకురుభూసుర ॥

ప్రథముడు పలుకుచున్నాడు.

తా॥ అయ్యా వినుము నేను పూర్వజన్మమందు ద్రావిడ దేశములో ముందరమను గ్రామమున గ్రామాధికారిని, (మునసబును) బ్రాహ్మణులతో నీచుడను, కఠినమాట లాడువాడను యితరులను వంచించు మాటలను మాట్లాడుటలో ప్రవీణుడను, నాకుటుంబ లాభము కొరకు బ్రాహ్మణుల ధనమును నానా ఉపహరించితిని, బంధువులకుగాని బ్రాహ్మణులకుగాని ఒకనాడైనను అన్నమును పెట్టి యెరుగను, బ్రాహ్మణులసొమ్ము న్నే నాము చేత హరించియుండుటచే యేడుతరములలో నాకుటుంబము నాశనము తట స్థించెను. దొంగతనముగా బ్రాహ్మణుల ధనమపహరించినయెడల సూర్యచంద్రనక్షత్ర ములుండు పర్యంతముగల కోటుంబీకులు నశించును, తరువాత మృతినొంది యమబాధల ననేకమునొంది ఆదోషము చేతనే భూమియందు బ్రహ్మరాక్షసుడనై జన్మించితిని, గనుక బ్రాహ్మణోత్తమా యీదోషము నశించు యుపాయమును విచారించి చెప్పుము.

శ్లో॥ ద్వితీయోవాచతంవిప్రం వినయావనతోనృప॥

తా॥ అందులో రెండవవాడు చెప్పుచున్నాడు.

శ్లో॥ మాతాపిత్రోరహం ద్వేష్యో నిత్యంనిష్ఠురభాషణః। దారాపత్య సమాయుక్తో మృష్టాన్నంభక్షయామ్యహం ॥ పితోర్మమో భయోశ్చాపి పర్యూషాన్నే నభోజనం । బంధుభ్యో బ్రాహ్మ ణేభ్యశ్చ ద్రవ్యాసక్తేనయన్మయా । నాద త్తంచాణుమాత్రం వా తస్మాద్దుర్బుద్ధినామయా । ఆంధ్రదేశనివాసేన చాజ్ఞానే నాల్పమేధినా । తేనకర్మవిపాకేన యాతనాంచయుగాష్టకం। భుక్త్వాపశ్చాద్భువంప్రాప్య బ్రహ్మరాక్షసరూపధృత్ । పాప పంకేనిమగ్నంమా ముద్ధరేహామహీసుర॥

తా॥ అయ్యా! నేను ఆంధ్రదేశమందుందువాడను, నేను నిత్యము తల్లిదండ్రు లతో కలహించుచుండి వారందఱిని దూషించుచుండువాడను, యిదిగాక నేనును నాభా ర్యపిల్లలును పడక్రిపోపేతమైన అన్నమును భుజించుచు నాతల్లిదండ్రులకు మాత్రము చద్ది అన్నమును పెట్టుచుండేవాడను, బంధువులకుగాని బ్రాహ్మణులకుగాని ఒకనాడై నను అన్నమును పెట్టినవాడనుకాను. మఱియుధనమును విస్తారముగా నార్జించియుంటిని, తల్లిదండ్రులకు చద్దిఅన్నము పెట్టు దుర్బుద్ధివిస్తరించెను. పిమ్మట నేను చనిపోయి యమలోకమందు యెనిమిది యుగములవఱకుయమ బాధలను పొంది పిమ్మట బ్రహ్మ రాక్షసుడనై భూమియందు జన్మించితిని, ఓబ్రాహ్మణోత్తమా! నాకీ పాపములో లి గే ఉపాయము చెప్పి నన్ను మీరే కడతేర్చవలెను.

శ్లో॥ ఏవముక్తే తృతీయస్తు ప్రాహేదం ప్రణతో నృప।

తా॥ ఇట్లు రెండవవాడు చెప్పినతోడనే మూడవవాడుగూడ నమస్కరించి తన స్థితిని చెప్పదొడగెను.

శ్లో॥ ఆంధ్రదేశేఽర్చకో విప్ర విష్ణోరాయతనే శుభే। స్నానసంధ్యాపరిత్యక్తః పరనిందాపరాయణః॥ బహుభాషీ సునిష్ఠురో హ్యహం దయాహీనోఽశుచిర్ద్విజ। తైలం విష్ణోర్దీపసంగస్థం మయాచాపహృతం పురా। వేశ్యాగారే తు తత్తైలం తద్వృత్తిం దీప్య తేనుయా। తస్మాత్తద్దివ్యమాదాయ తయారంత్యాఖిలాలసః। తేనకర్మవిపాకేన నరకే భుక్తయాతనః। పశ్చాద్భూమిమనుప్రాప్య నానాయోనిషు వై క్రమాత్। బ్రహ్మరాక్షసయోనౌ తు సంజాతోఽస్మ్యత్ర పాదపే। రక్షమాం కృపయా బ్రహ్మన్ సర్వభూతదయానిధే।

తా॥ అయ్యా! నేను ఆంధ్రదేశ నివాసిని, బ్రాహ్మణుడను, విష్ణ్వాలయమందు స్వామికి అర్చకుడను, స్నానసంధ్యావందనములను విడచి స్వామిపూజనువదలి పరనిందలనుచేయుచు విశేషముగా మాట్లాడుచు కఠినుడనై దయాశూన్యుడనై తిరుగుచు దేవాలయమందు భక్తులు వెలిగించు దీపములలోని నెయ్యి నూనెను అపహరించి వేశ్యాగృహమందు దీపములను బెట్టించి ఆ నేతిని వేశ్యకు అనుభవమునకు యిచ్చి దేవతానివేదితాన్నమును అపహరించి వేశ్యకు భుజింపచేసి దానితో సంభోగించుచుండువాడను, ఆదోషములచేత నరకములందు అనేక యాతనలను అనుభవించి తరువాత భూమికివచ్చి నానాయోనులందు అనేక మారులు జన్మించి, చివరకు బ్రహ్మరాక్షసుడనైపుట్టి యీ మఱ్ఱిచెట్టుమీదనుంటిని, గనుక సమస్త భూతములందు అకారణ కరుణాపూర్ణుడవైన బ్రాహ్మణోత్తమా నన్ను రక్షించుము, నాకు యీయోని సంకటమును నశింపజేయుము.

శ్లో॥ తైరేవముదితం శ్రుత్వా విప్రో విస్మితమానసః। మాభయం భవతామల్ప ముద్ధరిష్యే మహాసంకటాత్। కార్తికస్నానకామేన అగచ్ఛధ్వం మయాసహ। ఇత్యుక్త్వా తైస్తతో విప్రః కావేర్యాం కార్తికే నృప। స్వయం కృత్వా తతస్స్నానం తేషాం ముక్తిమకారయత్॥

తా॥ తత్వనిష్ఠుడను బ్రాహ్మణుడిట్లు బ్రహ్మరాక్షసుల మాటలను విని ఆశ్చర్యమునొంది మీకు కొంచమైనను భయము లేదు, మీదుఃఖము పోగొట్టెదను. నేను

కార్తీక స్నానార్థము పోవుచున్నాను నాతో మీరు కూడారండి, అని వారిని తీసు కొనిపోయి కావేరీనదిలో బ్రహ్మరాక్షసుల నిమిత్తము సంకల్పముచేసి తానుస్వయము గా ముందు స్నానముచేసి పిమ్మట రాక్షసులచేగూడ స్నానముచేయించి తరువాత వారికి బ్రహ్మరాక్షసత్వమును నశింపచేసెను.

శ్లో॥ తత్క్షణాదేవముక్తాస్సుర్దివ్యరూపధరాశ్చతే।
యయుర్విష్ణుపదంరాజన్ కార్తీకస్నానమాత్రతః॥

తా॥ అముకానాం బ్రహ్మరాక్షసత్వ నివారణార్థం అస్యాం కావేర్యాంప్రాతఃస్నానమహంకరిష్యే" యీలాగున సంకల్పముచేసి ఆబ్రాహ్మణుడు విధిగా స్నానముచేసి ఆరాక్షసులకొఱకు ఆఫలమిచ్చెను, అందువలన ఆముగ్గురు దోషముక్తులై దివ్యరూపములను ధరించి వైకుంఠలోకముకు బోయిరి.

శ్లో॥ మోహాన్వైవాధవాఽజ్ఞానాత్కావేర్యాంచభృగూదయే।
యోనిమజ్జతిరాజేంద్ర విష్ణోఃపూజాంవిధాయచ।
వాజపేయాయుతానాంచ ఫలంయాతినసంశయః॥

తా॥ ఓజనక మహారాజా! వినుము మోహముచేతగాని అజ్ఞానము చేతగాని కార్తీకమాసంబున సూర్యోదయ కాలమందు కావేరినదియందు స్నానముచేసిపిమ్మట శ్రీవిష్ణుపూజను చేసిన వానికి పదివేల యజ్ఞములు చేసిన ఫలము కలుగును. యిందుకు సందేహములేదు.

శ్లో॥ యేనకేనాప్యుపాయేన కావేర్యాంకార్తికేనృప।
ఆవశ్యకమిదంమిదంస్నానం కుర్యాద్విష్ణుపరాయణః॥

తా॥ కార్తీక మాసమందు యేదో ఒక ఉపాయముచేత కావేరీ స్నానమును తప్పక చేయవలెను.

శ్లో॥ నకుర్యాద్యదికార్తిక్యాం స్నానంభక్త్యానరాధమః।
దశజన్మనిచండాలః పశ్చాత్సూకరతాంవ్రజేత్॥

తా॥ కార్తీకమాసమందు దామోదరప్రీతిగా ప్రాతస్స్నానము చేయనివాడు పదిజన్మలందు చండాలుడై జన్మించి తరువాత పూరపందిగా జన్మించును.

శ్లో॥ తస్మాత్కార్తికమాసేతు స్త్రియోవాపురుషస్యచ
స్నానమావశ్యకంరాజన్ నాత్రకార్యావిచారణా॥

తా॥ కాఁబట్టి స్త్రీగాని పురుషుఁడుగాని కార్తికమాసమందు ప్రాతఃస్నానమును తప్పక చేయవలెను. యీవిషయమై మీమాంసతో పనిలేదు.

ఇతి స్కాందపురాణె కార్తికమాహాత్మ్యే తృతీయోధ్యాయ స్సమాప్తః.

---

అథ చతుర్థోఽధ్యాయః.

రాజోవాచ॥ శ్లో॥ తవవాగమృతంపీత్వా తృప్తిర్నాస్తిమహామతే।
కిందానంకార్తికేమాసి కిముద్దిశ్యవ్రతంచరేత్॥
భూయాహంశ్రోతుమిచ్ఛామి ధర్మంకార్తికసంభవం॥

తా॥ జనకుఁడడుగుచున్నాఁడు. వసిష్ఠమునీంద్రా నీయొక్క వాక్సుధారసమును పానముచేయుచున్న నాకుతృప్తితీరలేదు, గానతిరిగి కార్తికవ్రతపుణ్యమును తెలుపుము అందుకార్తికమందుయే స్నానముచేయవలెనా దేనినిగోరి వ్రతమాచరించవలయునో చెప్పుము

వసిష్ఠఉవాచ॥ శ్లో॥ భూయశ్శృణుష్వాఘహరం సర్వపుణ్యవివర్ధనం।
ప్రవక్ష్యామిమహారాజ ధర్మంకార్తికసంభవం॥

తా॥ వసిష్ఠుఁడు చెప్పుచున్నాఁడు. పాపములను నశింపచేయునదియు పుణ్యమును వృద్ధిబొందించునదియు అయిన కార్తికవ్రతమును యింకా చెప్పెదను వినుము.

శ్లో॥ కార్తికేమాసిసాయాహ్నే శివాగారేశుభప్రదే।
యోదీపమర్పయేద్భక్త్యా తదనంతఫలప్రదం॥

తా॥ కార్తికమాసమందు సాయంకాలమందు శివాలయమందు దీపారాధన చేసినయడల అనంతఫలమిచ్చును.

శ్లో॥ గోపురద్వారశిఖరే లింగాగ్రేన్నృపపుంగవ।
కార్తిక్యామర్పయేద్దీపం సర్వపాపైఃప్రముచ్యతే॥

తా॥ కార్తికమాసమందు శివాలయములో గోపురద్వారమందును శిఖరమందును లింగసన్నిధియందును దీపారాధన చేసినయడల సమస్తపాపములు నశించును.

శ్లో॥ యఃకుర్యాద్భక్తిభావేన కార్తిక్యామీశ్వరాలయే।
గవ్యేనచఘృతేనాపి తైలాద్వామధుతైలతః॥
నారంగతైలాద్రాజేంద్ర దీపంయశ్శంభవేర్పయేత్।
సభవత్సర్వధర్మజ్ఞో సధర్మాత్మానసంశయః॥

తా॥ ఎవ్వఁడు కార్తీకమాసమందు శివాలయములో ఆవునేతితోగాని నేతితో గాని నువ్వులనూనెతోగాని యిప్పనూనెతోగాని నారింజనూనెతోగాని భక్తితో దీప సమర్పణము చేయునో వాఁడే ధన్యుఁడు, వాఁడు సమస్తధర్మవేత్త, వాఁడు ధర్మాత్ముఁడును అగును యిందుకు సంశయము లేదు.

శ్లో॥ యదిత త్తదభావేతు కార్తికేమాసి భూమిప।
దీపమేరండతైలాద్యా ర్యోర్పయేత్సతుపుణ్యభాక్॥

తా॥ పూర్వోక్తములైన నూనెలు సంభవించనంతలో ఆముదముతోనైనా దీపమును సమర్పించిన యెడల పుణ్యవంతుఁడగును.

శ్లో॥ మోహేనైవాథవాదంభా ద్భక్త్యావాపార్వతీపతేః।
కార్తికేచార్పయేద్దీపం సశివప్రియభాఙ్నరః॥

తా॥ కార్తికమాసమందు శివాలయములో మోహముచేతగాని బడాయికిగాని భక్తితోగాని దీపమిచ్చువాఁడు శివప్రియుఁడగును సందేహము లేదు.

శ్లో॥ పురాపాంచాలదేశేతు రాజాఽభూద్ధనదోపమః।
పుత్రహీనస్తపస్తేపె గోదావర్యాస్తటెశుభే॥

తా॥ పూర్వకాలమందు పాంచాలదేశమందు కుబేరునితో సమానమైన యొకరాజు గలఁడు. సంతానములేక గోదావరీతీరమందు తపస్సు చేయుచుండెను.

శ్లో॥ స్నాతుకామస్సమాయాతః పైప్పలోమునిసత్తమః।
రాజానమబ్రవీత్తత్ర కిమర్థంక్రియతేతపః॥

తా॥ గోదావరీ స్నానార్థమై పైప్పలమహాముని వచ్చి చూచి రాజా యెందుకు తపస్సు చేయుచున్నావని యడిగెను.

శ్లో॥ తతోవాచమహీపాలో మునింసత్యపచాన్వితం।
మునెపుత్రవిహీనోస్మి తదర్థంతప్యతేతపః॥

తా॥ ఆమాటవిని రాజు మునీశ్వరా నాకు సంతానములేదు, కాన సంతానము కొఱకు తపస్సు చేయుచున్నానని చెప్పెను.

బ్రాహ్మణోవాచ ॥ శ్లో॥ కురుష్వభక్త్యావిప్రేభ్యో తుష్టింవాపార్వతీపతేః। తేనతేపుత్రసంతానో భవిష్యతినసంశయః॥

తా॥ బ్రాహ్మణుఁడు రాజుతో చెప్పుచున్నాఁడు. రాజా భక్తితో బ్రాహ్మణులను శివుని సంతోషపెట్టుము, అట్లయిన యెడల నీకు పుత్రసంతానము కలుగును.

శ్లో॥ ఇతి తేనోదితం శ్రుత్వా ప్రహర్షమతులం లభేత్।
సమస్కృత్య గృహం గత్వా సుస్నాతః సమలంకృతః॥
చకార దీపదానం తు విధినేశ్వరతుష్టయే॥

తా॥ ఇట్లు పైప్పిలిముని చెప్పగా ఆ రాజు విని ఆనంద సాగర మగ్నుడై నమస్కరించి యింటికి వెళ్లి స్నానము చేసి అలంకృతుడై శివప్రీతిగా దీపదానములను చేసెను.

శ్లో॥ తతస్తేనైవ పుణ్యేన సాధ్వీ గర్భమధత్తసా।
ప్రాసూత కాలే సా పుత్రం ద్వితీయమివ భాస్కరం॥

తా॥ పిమ్మట ఆ పుణ్యము చేతనే రాజు భార్య గర్భవతియై పదియవ మాసమున రెండవ సూర్యుడువలె ప్రకాశించెడి పుత్రుని గనెను.

శ్లో॥ రాజా ప్రహర్షమతులం సంప్రాప్యైవ మువాచహ।
సత్యం కార్తీకమాసస్య మాహాత్మ్యం పురుషార్థదం॥
సర్వేషామేవ భూతానాం సుఖహేతుర్న సంశయః॥

తా॥ ఆ రాజు విని అధికానందమును బొంది కార్తీక మాహాత్మ్యము సత్యమైనదే యగును, యీ కార్తీక వ్రతము ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థముల నిచ్చును, సమస్త భూతములకు సుఖము కలుగునది కార్తీకమాసము అని వచించెను.

శ్లో॥ తస్యాభిధానం చక్రే సా బాలస్య పృథివీపతేః।
శత్రుజిన్నామ పుత్రస్య విప్రాన్సంపూజ్య భక్తితః॥

తా॥ తరువాత రాజు కుమారునకు "శత్రుజిత్" అను నామకరణము చేసి బ్రాహ్మణులకు గోభూదానాదుల చేత తృప్తిని జేసెను.

శ్లో॥ తతో వృద్ధిం గతో బాలో రాజపుత్రో వనీపతే। శూరస్సురూపోన్నవతే స్తనయః ప్రాప్తయౌవనః॥ వారాంగనాసు నిరతో పరస్త్రీరతిలాలసః। గురువిప్రజనద్వేషీ జాతిసంకరకారకః॥ నిందకో నిష్ఠురః పాపః ఖడ్గపాణిర్దురాగ్రహః। రూపయౌవన సంపన్నో నానాలంకారభూషితః॥

తా॥ తరువాత బాలుడు క్రమముగా వృద్ధినొంది యౌవనవంతుడై శూరుడై సుందరుడై వేశ్యాసంగలోలుడై అంతట తృప్తిలేక పరస్త్రీలయందు ఆసక్తిగలిగి ధనాదికము నిచ్చి వారిని లోబరుచుకుని సంభోగించుచు, యిది తగదని చెప్పిన గురువులను

బ్రాహ్మణులను ధిక్కరించి జాతిని విడిచి సంగసకారకుడై ప్రతిమనుజుని నిందించుచు కఠినముగా మాట్లాడుచు కత్తిని నిరంతరము చేత ధరించుచు అడ్డము వచ్చినవారిని హింసించుచు యిట్లు అన్యాయమార్గవర్తనుడై యుండెను.

శ్లో॥ కస్యచిద్ద్విజముఖ్యస్య భార్యాపరమశోభనా।
హరిమధ్యావిశాలాక్షీ బృహచ్ఛ్రోణిపయోధరా॥
రంభోరుశ్శుకవాణీచ సౌందర్యాస్మరవిభ్రమా॥

తా॥ ఒక బ్రాహ్మణోత్తముని భార్య బహుచక్కనిది, సింహముయొక్క నడుమువంటి నడుముగలది, పెద్దకన్నులుగలది, పెద్దవైన పిరుదులును కుచములును గలదియు అరటిస్తంభములవంటి తొడలు గలదియు, చిలుకవలె సుస్వరమైన వాక్కుగలదియు మన్మథోద్రేకము గలదై యుండెను.

శ్లో॥ సరాజతనయస్తాంతు దృష్ట్వాసౌందర్యతోషితః।
తంద్రుష్ట్వాసాతథారాజకా సత్యరూపేణభామినీ॥

తా॥ ఆరాజకుమారుడు ఆవిప్రభార్యనుచూచి దానిసౌందర్యమునకుసంతోషించిదానియందాసక్తిగలవాడాయెను బ్రాహ్మణునిభార్యయు రాజకుమారునందాసక్తిగలదాయెను

శ్లో॥ సాగత్వారాజతనయం ద్విజంత్యక్త్వామహానిశి।
తేనసారమతేనిత్యం సంతుష్టారాజమందిరే।
రాత్రిశేషంతథానీత్వా పునఃపతిముపాగతా॥

తా॥ తరువాత బ్రాహ్మణునిభార్య అర్ధరాత్రియందు భర్తను విడిచి రాజకుమారుని వద్దకు పోయి అతనితో రాత్రిశేషమంతయు సంభోగించి ఉదయానకు పూర్వమే తిరిగి యింటికివచ్చెను. యీప్రకారముగా అనేక దినములు జరిగినవి.

శ్లో॥ తత్ జ్ఞాత్వాసద్విజఃకోపాద్భార్యాందృష్ట్వాతినిందితాం।
ఖడ్గపాణిస్సరోషేణ తస్యాశ్చోపపతేర్నృప।
వధోపాయంస్మరన్నిత్యం యేనకేనాప్యుపాయతః॥

తా॥ ఆసంగతిని బ్రాహ్మణుడు తెలిసికొని నిందితమైన నడతగల భార్యను దానిని మరగిన. రాజకుమారునిన్ని చంపుటకుగాను కత్తినిచేతధరించి యెప్పుడు చంపుటకు వీలుదొరకునా యని కాలమును ప్రతీక్షించుచుండెను.

శ్లో॥ కదాచిత్కార్తికేమాసి పౌర్ణమాస్యామిందువాసరే । దృష్ట్వా
శివాలయంగత్వా రాజపుత్రస్తయాసహ । సాకరోద్వ్రతిక

కాంసుభూ్రి శైలాం తేనైవభూమిప। సరాజపుత్రో మోహా న తైలమేరండకంస్వయం। దీపంసాదీపపాత్రె తేతు ప్రజ్వాల్యాతి ప్రియత్నతః । సంస్థాప్య వేదికాయాంచ శివాగ్రివ్యభిచారిణీ తత్రతత్తేజసారాజన్ సురతోత్సాహనిర్భరైః। కామశాస్త్ర కలాపైశ్చ క్రీడాంచక్రతురాదరాత్ ॥

తా॥ ఇట్లు కొంతకాలము గడచిన తరువాత యొకప్పుడు కార్తిక పూర్ణిమా సోమవారమునాడు ఆరాజకుమారుఁడు బ్రాహ్మణ భార్యయు తమకుసంభోగస్థానము దొరకక దైవవశముచేత శివాలయములోకిపోయి చీకట్లో రతికి అనుకూలముగానందున బ్రాహ్మణితన చీరలంచును చింపి వత్తిచేసెను, రాజకుమారుఁడు ఆముదము తెచ్చెను ఆవత్తితో ఆచిన్నగి దీపమును వెలిగించి అరుగుమీద పెట్టెను, తరువాత వారిద్దఱు కామశాస్త్రప్రకారము సంభోగమును అత్యుత్సాహముతో సలిపి సుఖించిరి.

శ్లో॥ ఆత్మానంగోపయిత్వాతు శనైర్గత్వాతదాలయం । కవాటం సుస్థిరంబధ్వా ఖడ్గమాదాయకోపతః । చిచ్ఛేదరాజతనయం తతో.భార్యాంనరాధిప । రాజసూనుశ్శనైస్సిత్వా జఘ్నివా నసినాచతం॥ జీర్ణదేవాలయేదైవా దన్యోన్యాఘాతయోగతః। త్రయోపిమరణంజగ్ముః కార్తిక్యామీశ్వరాలయె। మోహాత్కార్తికపౌర్ణమ్యా మిందువారేశివాలయె । పౌర్ణమ్యా మిందువారేతు సర్వపుణ్యఫలప్రదె॥

తా॥ అంత ఆబ్రాహ్మణుఁడు కత్తిని గరించి వెళ్లి మాఱువేషముతో జీర్ణ శివాలయమందు దూరి తలుపులు గట్టిగా బిగించి కత్తితో ముందుగా రాజకుమారుని నరికి తరువాత భార్యను నరికెను. అంతలో రాజకుమారుడు కొంచము జ్ఞప్తితెచ్చుకొని కత్తితో బ్రాహ్మణుని నరికెను. యిట్లు పరస్పర వ్యాఘాతముచేత ఆజీర్ణదేవాలయమందు ముగ్గురుమృతినొందిరి: ఆదినము కార్తికపూర్ణిమసోమవారము దైవవశముచేత అట్టిపర్వమందు వారి ముగ్గురికి శివాలయములో శివుని సన్నిధియందు మరణముగలిగినది.

శ్లో॥ తదాగతాయమభటాః పాశహస్తాభయంకరాః।
శివదూతా స్తదాజగ్ముః రుద్రలోచనభీతిదాః॥

తా॥ అంతలో పాశహస్తులై యమకింకరులు వచ్చిరి. అంతలోనే శివసేత్రి భయంకరులైన శివకింకరులును వచ్చిరి.

శ్లో॥ అథ తాం రాజపుత్రంచ విమానే సన్నివేశ్య చ।
పాదౌ చాబధ్య తం విప్రం యమదూతా స్సుదారుణాః॥

తా॥ తరువాత శివదూతలు రాజకుమారుని బ్రాహ్మణభార్యను విమానముమీద యెక్కించిరి. యమదూతలు బ్రాహ్మణుని కాళ్లుగట్టి తీసుకొనిపోవ ప్రయత్నించిరి.

శ్లో॥ ఏవంభిన్నాం గతిం దృష్ట్వా తానాహ ద్విజసత్తమః।
తావుభౌ తుల్యపాప్మానౌ కులటానృపపుత్రకౌ॥
అహం ద్విజవరః పుణ్యః గతిభేదో హ్యభూదిహ॥

తా॥ ఇట్లు భార్యకు రాజకుమారునకు కైలాసగమనము తనకు యమలోకగమనమును చూచి బ్రాహ్మణుడు శివదూతలారా! యీ నాభార్య జారిణీ యీ రాజకుమారుడును జారుడుగదా నేను బ్రాహ్మణుడను, సదాచారవంతుడనుగదా యిట్లుండ నాకీ గతియేమి? వారి కాగతియేమి? అని అడిగెను.

శ్లో॥ శివదూతా స్తతః ప్రోచు ర్బ్రాహ్మణం దీనమానసం। మోహాత్కార్తీకపౌర్ణమ్యా మిందువారే శివాలయే। ఏషాచాతి దురాచారా వస్త్రఖండేన వర్తికాం। చకార తేనపుణ్యేన సర్వపాపక్షయోఽభవేత॥ అనేనదీపపాత్రంచ తైలమేరండసంభవం। సర్వపాపక్షయమభూత్పుణ్యాం తత్తైలపాత్రయోః। దానేనైవాథవా మోహాత్కార్తీక్యాం శంకరాలయే। యోర్పయేద్దీపమేకంవా సధన్యస్సర్వయోగినామ్॥

తా॥ అనంతర మతిదైన్యముతోనున్న బ్రాహ్మణునితో శివదూత లిట్లనిరి. బ్రాహ్మణోత్తమా నీవన్నమాట సత్యమేగాని యొక విశేషమున్నది చెప్పెదము వినుము యీ నీభార్యను పాపాత్మురాలును జారిణి, అయినప్పటికీ కామమోహముచేత కార్తిక పూర్ణిమా సోమవారమునాడు శివాలయమందు దీపారాధనకుగాను తనచీరెను చించి వత్తిచేసి యిచ్చినదిగాన దీని పాపములన్నియు భస్మములైనవి. యీ రాజకుమారుడును దీపార్థమై ఆముదమును తెచ్చి పాత్రలోవుంచి యిచ్చినందున క్షీణపాపుడాయెను. కార్తీకమాసమందు కామమోహముచేతనైనా శివాలయమందుదీపదానము చేసినవాడు ధన్యుడును సర్వమహాయోగులందు అధికుడగును. గనుక దీపార్పణము చేత నీభార్యకు రాజకుమారునకు కైలాసము దీపదానము చేయనందుకు నీకు నరకము సిద్ధించినది. యిది వరకు నీవెంత శుద్ధముగానున్నను దీపదాననాశిత పాపులైనవారితో సమానుడవుగాలేదు యెందుకు ఖేదించెదవు పరమార్థ సూక్ష్మమిదియని చెప్పిరి.

### ౫. అథ పంచమోఽధ్యాయ ప్రారంభః.

వసిష్ఠ ఉవాచ॥ శ్లో॥ ఆచరేత్కార్తికేమాసి నారీవాపురుషోపివా।
పాపక్షయార్థం రాజేంద్ర కార్తికేయత్రిభాజనం।
యద్యాచరతిరాజేంద్ర ఫలమక్షయమశ్నుతే॥

తా॥ వసిష్ఠుడు తిరిగి చెప్పుచున్నాడు. ఓజనకమహారాజా వినుము కార్తిక మాసమందు పాపక్షయముకొరకు పుణ్యమును చేయవలయును. పుణ్యముచేత పాపము నశించుటయేగాక పుణ్యమధికమగును.

శ్లో॥ యఃకార్తికే హరేరగ్రే గీతాపాఠంకరిష్యతి।
ససర్వపాపనిర్ముక్తః జీర్ణత్వచమివోరగః॥

తా॥ కార్తికమందు హరి సన్నిధిలో భగవద్గీతా పారాయణమును చేయువాడు పాము కుబుసమునువలె పాపములను విడుచును.

శ్లో॥ కార్తికేతులసీపత్రైః కరవీరైస్సితాసితైః।
అలంకరోతిసద్భక్త్యా విష్ణుమాద్యంజగద్గురుం।
సవిష్ణోర్మందిరంప్రాప్య విష్ణునాసహమోదతే॥

తా॥ కార్తిక మాసమందు తులసీదళములతోను తెల్లని,నల్లని,అయినగన్నేరు పూలతోను హరిని పూజించినయడల వైకుంఠమునకుపోయి హరితోగూడాసుఖించును.

శ్లో॥ విభూతింవిశ్వరూపంచ కార్తికేకేశవాగ్రతః।
యోజపేద్భక్తియోగేన సవైకుంఠేశ్వరోభవేత్॥

తా॥ కార్తికమాసమందు భగవద్గీతయందు ౧౦, ౧౧ అధ్యాయములను హరి సన్నిధిలో పారాయణ చేయువాడు వైకుంఠలోకమునకు అధిపతియగును.

శ్లో॥ పాదంవాశ్లోకమేకంవా పురాణంకార్తికేహరేః।
అగ్రతఃకురుతేరాజన్ సముక్తస్సర్వకర్మభిః॥

తా॥ కార్తికమాసమందు హరి సన్నిధిలో శ్లోకముగాని శ్లోకపాదముగాని పురాణము చెప్పినవారును విన్నవారును కర్మబంధ వినిర్ముక్తుడగును.

శ్లో॥ యఃకార్తికేసితేపక్షే వనభోజనమాచరేత్।
సయాతివైష్ణవంధామ సర్వపాపైఃప్రముచ్యతే॥

తా॥ కార్తికమాసమందు శుక్లపక్షమందు వనభోజనము చేయువారికి సమస్త పాపములు నశించును.

శ్లో॥ జపహోమార్చనే కాలే భోజనే పితృతర్పణే।
చండాలపతితానాంచ శూద్రనూతకభాషణం।
శుద్ధ్యాసమాచరేద్ధీమాన్ కార్తికే వనభోజనం॥

తా॥ ఇతరకాలములలో జపకాలమందు హోమకాలమందు పూజాకాలమందు భోజనకాలమందు తర్పణకాలమందును చండాలులయొక్కయు పాపాత్ములయొక్కయు శూద్రులయొక్కయు, ఆశౌచవంతులయొక్కయు, సంభాషణములను వినిన దోషము పరిహారము కొఱకు కార్తికమాసమందు వనభోజన మాచరించవలయును.

శ్లో॥ నానాద్రుమలతాకీర్ణే వనేచామలకాగ్రతః । సమభ్యర్చ్య విధానేన సాలగ్రామనివాసినం ॥ దామోదరంజగద్వంద్యం గంధపుష్పాక్షతాదిభిః। యథావిత్తానుసారేణ విప్రాన్ సంపూజ్యభక్తితః। ఏవంయఊర్జేమాసేస్మిన్ వనభోజనమాచరేత్ ॥ సనర్వపాపనిర్ముక్తో యద్యత్కాలాదిసంభవైః । తస్మాత్సర్వప్రయత్నేన వనభోజనమాచరేత్ ॥

తా॥ ఈవనభోజన మెట్లుగా చేయవలెనంటె చెప్పెదనువినుము. అనేకజాతివృక్షములతో గూడిన వనమందు ఆమలక (ఉసిరిగ) వృక్షమువద్ద సాలగ్రామమునుంచిగంధపుష్పాక్షతాదులతో బూజించి శక్తికొలది బ్రాహ్మణులను పూజించి బ్రాహ్మణులతోకలసి భోజనముచేయవలెను. ఇట్లు కార్తికమాసమందు వనభోజనముచేసినయడల ఆయాకాలములందు చేసిన సమస్త పాపములు నశించి విష్ణులోకమునందు సుఖముగా నుండును. కాఁబట్టి తప్పక కార్తికమందు వనభోజన మాచరించవలయును.

శ్లో॥ పురాణశ్రవణంభక్త్యా మాహాత్మ్యంకార్తికస్యచ।
యథావిప్రసుతో ముక్తో రాజన్ దుర్యోనిసంకటాత్ ॥

తా॥ కార్తిక మాహాత్మ్యమును భక్తితో విని బ్రాహ్మణుని కుమారుడు దుర్యోని సంకటము వలన ముక్తుఁడాయెను.

రాజోవాచ॥ శ్లో॥ కోవిప్రసూనుఃకింకర్మ కృతవాన్ కేనముచ్యతే।
తద్బ్రహ్మన్ సమాచక్ష్వ శ్రోతుమిచ్ఛామిసాంప్రతం॥

తా॥ రాజడుగుచున్నాడు. ఓమునీశ్వరా! బ్రాహ్మణుని కుమారు డెవ్వడు, వాడేకర్మ చేసెను? దేనిచేత ముక్తుడాయెను? యీవృత్తాంతమును వినవలయునని కుతూహలము గలిగినది. గనుక చెప్పుము.

వసిష్ఠఉవాచ॥ శ్లో॥ శ్రుణురాజన్ ప్రవక్ష్యామి కావేర్యాస్తీరతేశుభే।
దేవశర్మేతిఖ్యాతో వేదవేదాంగపారగః॥

తా॥ వసిష్ఠుడు చెప్పుచున్నాడు. జనకమహారాజా చెప్పెదను వినుము. కావేరీ తీరమందు దేవశర్మయను బ్రాహ్మణుడు వేద వేదాంగ పారగుడు గలడు.

శ్లో॥ తస్యసూనుర్దురాచారో తమాహాస్వసుతంపితా।
వక్ష్యామిశృణుతేపుత్ర సర్వపాపవిముక్తయే॥

తా॥ ఆదేవశర్మకు దురాచారవంతుడగు నొకకుమారుడుగలడు. అతనిదుర్మార్గమును జూచి తండ్రి నాయనా నీకు పాపములు నశించెడిమాటను చెప్పెదను వినుమనియిట్లనిరెను.

శ్లో॥ కురుష్వకార్తికేమాసి స్నానంకేశవపూజనం।
దీపమాలార్పణంతస్య విష్ణోరమితతేజసః॥

తా॥ అబ్బాయీ కార్తీక మాసమందు ప్రాతస్స్నానము చేయుము. సాయం కాలమందు హరిసన్నిధిలో దీపమాలను సమర్పించుము.

శ్లో॥ ఇతిశ్రుత్వాసుతస్తస్య పితరంపునరబ్రవీత్।
కుతఃకార్తికధర్మేతి తన్నకార్యంమయాక్వచిత్॥

తా॥ ఈలాగున తండ్రిచెప్పిన మాటను విని కుమారుడు కార్తీకమాస ధర్మ మనగా యేమిటి? నేను యిట్టికార్యమును యెప్పటికి చేయవలెననెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వాకోపతామ్రాక్షః శశాపసుతమంజసా।
మూషకోభవదుర్బుద్ధే అరణ్యేద్రుమకోటరే॥

తా॥ ఆమాటవిని తండ్రి వోరీ దుర్మార్గా! యెంతమాట అంటివిరా నీవు అరణ్యమందు చెట్టుతొర్రలో యెలుకవై యుండుమని శపించెను.

శ్లో॥ అయాచతవిశాపంచ పశ్చాత్తాపేనభూమిప।
దురాచారస్యమేతాత కథంముక్తిర్భవిష్యతి॥

తా॥ ఆశాపమును విని కుమారుడు తండ్రీ నాగతియేమి? నాకు ముక్తి యెప్పుడు అని అడగగా తండ్రివిని పశ్చాత్తప్తుడై శాపమునకు విమోచన మిచ్చునట్లు చేసెను.

శ్లో॥ సచాహకార్తికంధర్మం యదాశ్రోష్యసిపుత్రక।
ముక్తిస్తేభవితానూనం తస్యపుణ్యప్రభావతః॥

తా॥ తండ్రిచెప్పుచున్నాడు కుమారకా యెప్పుడు నీవు కార్తీక. మాహాత్మ్య మును వినెదవో అప్పుడు నీకు మూషకత్వ విముక్తి గలుగునని చెప్పెను.

శ్లో॥ ఇత్యుక్త్వావిరతే శీఘ్రం సుతః పితరి సోప్యథ।
తత్క్షణాన్మూషకో భూత్వా గజారణ్యద్రుమే నృప॥
ముఫలే సర్వజీవానా మాశ్రయే చ సుఖప్రదే॥

తా॥ తండ్రి యిట్లు చెప్పి యూరకున్నంతలో కుమారుడు అప్పుడే మూషకమై గజారణ్యమందు ఫలములతోఁగూడి అనేక జంతువుల కాధారమైయున్న వృక్షకోటర మందు నివసించియుండెను.

శ్లో॥ ఏవమంతరితే కాలే తత్రాగాత్కౌశికో మునిః।
శిష్యేభ్యః కార్తికస్నానం కృత్వా తన్మూలమాశ్రితః॥
పురాణపఠనం తత్ర మహాత్మ్యం కార్తికస్య చ।
చకార భక్తిభావేన తన్మూలే నరపుంగవ॥

తా॥ ఇట్లు కొంతకాలము గడచిన తరువాత యొకప్పుడు విశ్వామిత్ర మునీశ్వరుఁడు శిష్యులతో సహా కార్తికస్నాన మాచరించి ఆవృక్షముయొక్క మొదటిభాగ మందు కూర్చుండి కార్తిక మాహాత్మ్యమును భక్తితో చెప్పుకొనుచుండెను.

శ్లో॥ తదాకశ్చిద్దురాచారో వ్యాధశ్చాపధరః శఠః।
మృగయాం సంచరన్నాగా త్ప్రాణిహింసాపరాయణః।
విప్రాన్ హంతుం సముద్యుక్తో దయాహీనో ఘమూర్తిమాన్॥

తా॥ అంతలో దురాచారుడును, క్రూరుడును, హింసకుడును, అగు నొక కిరాతుడు వేట నిమిత్తము అచ్చటికివచ్చి బ్రాహ్మణులనుచూచి పాపాత్ముడుగనుక దయాశూన్యుడై వారిని జంప నిశ్చయించెను,

శ్లో॥ తేషాం దర్శనతో ద్భూతా సంజ్ఞా సర్వార్థదాయినీ।
తానువాచ తతః ప్రీతః కిమిదం కర్మ ఉత్తమం॥

తా॥ అంతలోనే విశ్వామిత్రాది ముని సందర్శనము వలన వానికి పురుషార్థ దాయకమైన జ్ఞానము కలిగి సంతోషించి అయ్యా యిదియేమిటి యీపనివల్ల యేమిఫల మున్నది అని అడిగెను.

శ్లో॥ తేనైవముక్తో రాజర్షి ర్విశ్వామిత్ర స్తమబ్రవీత్॥

తా॥ కిరాతుడీమాట అడిగినంతలో విశ్వామిత్రుఁడు చెప్పుచున్నాఁడు.

విశ్వామిత్ర ఉవాచ॥ శ్లో॥ శృణువ్యాధ ప్రవక్ష్యామి బుద్ధిస్తే విమలో
దయా। ధర్మః కార్తికమాసస్య నరాణాం కీర్తివర్ధనః॥

తా॥ విశ్వామిత్రుఁడు చెప్పుచున్నాఁడు. కిరాతా వినుము చెప్పెదను నీబుద్ధి మంచిదైనది. యిది కార్తికధర్మము, యీధర్మము మనుష్యులకు కీర్తినియిచ్చును.

శ్లో॥ కార్తికేమాసియో మోహాత్ స్నానందానాదికంచరేత్।
సర్వపాపవినిర్ముక్తో యాతివిష్ణోఃపరంపదం॥

తా॥ కార్తికమాసమందు మోహముచేతనైనను స్నానదానాదికముచేసిన వాఁడు పాపవిముక్తుఁడై వైకుంఠలోకమును చేరును.

శ్లో॥ భగవద్భక్తిభావేన కార్తికేమాసిమానవః।
ధర్మంసమాచరేత్సద్యో జీవన్ముక్తోనసంశయః॥

తా॥ కార్తికమాసమందు భక్తిశ్రద్ధాసంయుక్తుఁడై స్నానదానాది వ్రతమాచరించువాఁడు జీవన్ముక్తుఁడగును.

శ్లో॥ వ్యాధఃప్రోక్తమాకర్ణ్య ధర్మంచఋషిణానృప।
మూషకస్తత్రతచ్ఛ్రుత్వా ముక్తదేహస్తతోఽభవత్॥

తా॥ విశ్వామిత్రుఁడు యిట్లు కిరాతుని గురించి చెప్పిన కార్తిక ధర్మమును వృక్షముమీఁదనున్న మూషకమునిని అప్పుడె మూషకదేహమును విడిచెను.

శ్లో॥ విశ్వామిత్రస్తుతందృష్ట్వా సబభూవాతివిస్మితః।
నివేద్యసకలంకర్మ విప్రసూనురుదారధీః॥
సద్యస్సందర్శయంతత్ర వ్యాధాయైతత్ఫలంనృప।
అనుజ్ఞాతోయయౌశీఘ్రం విప్రసూనుస్స్వమాశ్రియం॥

తా॥ విశ్వామిత్రుఁడది చూచి ఆశ్చర్యమొందెను. తరువాత బ్రాహ్మణ కుమారుఁడు తనవృత్తాంతమును అంతయు విశ్వామిత్రునితో తెల్పి అనుజ్ఞపుచ్చుకొని తనయాశ్రయమునకు పోయెను.

శ్లో॥ వ్యాధోఽపిసకలంతస్మాచ్ఛ్రుత్వాఽవాపశుభాంగతిం॥

తా॥ కిరాతుఁడును మూషకదేహత్యాగమునుబట్టి కార్తిక వ్రతఫలమునుజూచి తరువాత మునివలన సకల ధర్మమును విని వైకుంఠముచేరెను.

శ్లో॥ ఇచ్ఛంతియదియేలోకే గతిమత్యంతదుర్లభాం।
కార్తికస్యచమాహాత్మ్యశ్రవణంచాభ్యసేచ్ఛుధీః॥
పుణ్యాంతేవాధికంప్రాప్య ప్రయాతిపరమాంగతిం॥

తా॥ సుగతిని గోరువారు కార్తిక మాహాత్మ్యమును వినవలెను. విన్నంతనే పుణ్యవంతులై పరమ పదము నొందెదరు.

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన కార్తికేధర్మమాచరేత్।
ఇదంసత్యమిదంసత్యం విధాత్రాస్సుశ్రుతంమయా॥
పురాణేషుమతింరాజన్ కురుసమ్యక్ప్రయత్నతః।
యాస్యసిత్వంపుణ్యగతిం నాత్రకార్యావిచారణా॥

తా॥ కాబట్టి తప్పక కార్తీకవ్రతమాచరించతగినది, యిదినిజము. యిదినిజము నాకు బ్రహ్మ చెప్పినాడు. రాజా నీవును పురాణములందు బుద్ధినుంచుము. అట్లైనయడల పుణ్యగతికి బోదువు, యీవిషయమై విచారణతో పనిలేదు. నిశ్చయము.

ఇతి శ్రీ స్కాందపురాణే కార్తిక మాహాత్మ్యే పంచమోఽధ్యాయ
స్సమాప్తః.

---

## అథ షష్ఠోఽధ్యాయ ప్రారంభః.

వసిష్ఠఉవాచ॥ శ్లో॥ యఃకార్తికేమాసిరాజన్ స్నానంపంచామృతే
నచ। కస్తూరీగంధతోయేన విష్ణోరమితేజసః॥ యఃకుర్యా
ద్భక్తిభావేన మాసమేకంనిరంతరం। సోఽశ్వమేధాయుత
ఫలం ప్రాప్యయాతిశుభాంగతిం॥

తా॥ వసిష్ఠమునీశ్వరులు తిరిగి చెప్పుచున్నారు. ఓజనకమహారాజా! వినుము. కార్తికమాసమందు భక్తితో మాసమంతయు హరికి కస్తూరితోను గంధముతోను పంచామృతములతోను స్నానము చేయించువాడు పదివేల అశ్వమేధయాగముల ఫలమును బొంది తుదకు పరమ పదమును బొందును.

శ్లో॥ యేసాయాహ్నేహరేరగ్రే కార్తిక్యామవనీపతే।
దీపదానంప్రకుర్వంతి తద్విష్ణోఃపరమంపదం॥

తా॥ కార్తికమాసమందు సాయంకాలమందు హరిసన్నిధిలో దీపదానమాచరించువారు విష్ణులోకమును బొందుదురు.

శ్లో॥ కార్తికేమాసిసంప్రాప్తే దీపదానంకరోతియః।
సుజ్ఞానంప్రాప్యవిమలం విష్ణోర్లోకమవాప్నుయాత్॥

తా॥ కార్తీక మాసమందు దీపదానమును చేసినవారు జ్ఞానమునుపొంది విష్ణులోకమును పొందుదురు.

శ్లో॥ తూలసంశోధ్యవిధినా వర్తింకృత్వాప్రయత్నతః। శాలిపిష్టేన
తత్పాత్రం గోధూమేనాథవానృప । కార్తిక్యాంకారయే

ద్భక్త్యా ఘృతవర్తిసమన్వితం । ఘృతపూరితతత్పాత్రం
వహ్నిజ్వాలానియోజితం। విప్రాయ వేదవిదుషే పూజ్యభక్త్యా
ప్రదాపయేత్ ॥

తా॥ కార్తీకమాసమందు పత్తిని చక్కగా ధూళిలేకుండా విడదీసి వత్తినిచేసి బియ్యపు పిండితోగాని గోధుమపిండితోగాని పాత్రనుచేసి గోఘృతంపోసి వత్తినితడిపి వెలిగించి మంచి బ్రాహ్మణునకు పూజించి యివ్వవలెను.

శ్లో॥ ఏవంక్రమేణ రాజేంద్ర మాసమేకంనిరంతరం। మాసాంతే రాజతంపాత్రం వర్తింకృత్వా సువర్ణకం ॥ శాలిపిష్టస్యమధ్యస్థం కృత్వాపూజ్యనివేదయేత్ । బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్స్వయమేవతతఃపరం । మంత్రేణానేనరాజేంద్ర కుర్యాద్దానమిదంశుభం॥

తా॥ ఇట్లు మాసమంతయుచేసి అంతమందు వెండితో పాత్రనుచేయించి బంగారముతో వత్తినిచేయించి బియ్యపు పిండిలో నడ్మగావుంచి పూజించినివేదించితరువాత బ్రాహ్మణ భోజనముగావించి తరువాత తాను స్వయముగా యీక్రింది మంత్రమును చెప్పుచు ఆదీపమును దానము చేయవలెను.

మంత్రః॥ శ్లో॥ సర్వజ్ఞానప్రదందీపం సర్వసంపత్సుఖావహం।
దీపదానంప్రదాస్యామి శాంతిరస్తుసదామమ॥

తా॥ మంత్రార్థము దీపము సర్వజ్ఞాన దాయకము, సమస్త సంపత్ప్రదాయకము, గనుక నేనిప్పుడు దీపదానమును చేయుచున్నాను. యీదీపదానమువల్ల నాకు నిరంతరము శాంతిగలుగుగాక.

శ్లో॥ ఏవంయఃకురుతే రాజన్ నారీవాపురుషోపివా।
కార్తికేమాసిరాజేంద్ర సోఽక్షయ్యంఫలమశ్నుతే॥

తా॥ ఈప్రకారముగా స్త్రీగాని పురుషుడుగాని కార్తికమాస మందాచరించిన యడల అనంత ఫలమును బొందుదురు.

శ్లో॥ దీపదోలభతే విద్యాం దీపదోలభతే శ్రుతం।
దీపదోలభతే చాయుః దీపదోలభతే దివం॥

తా॥ దీపదాత విద్యను బొందును. దీపదాత శాస్త్రశ్రవణఫలమును బొందును దీపదాత ఆయుస్సును బొందును. దీపదాత స్వర్గమును బొందును.

శ్లో॥ జ్ఞానాజ్ఞానకృతంపాపం మనోవాక్కాయకర్మభిః।
కార్తికే దీపదానేన విలయంయాతితత్‌క్షణాత్ ॥

తా॥ కార్తీకదీపదానమువలన మనోవాక్కాయములచేత చేయఁబడి జ్ఞానాజ్ఞాన కృతపాపములు నశించును.

శ్లో॥ శృణురాజన్ ప్రవక్ష్యామి పురావృత్తంమనోహరం॥

తా॥ ఈవిషయమందు పురాతనపు కథ ఒకటి వున్నది వినుము.

శ్లో॥ పురాద్రావిడ దేశేతు అంగనాకాచిదప్యభూత్ । సుతబంధు విహీనాసా సదాభిక్షాన్న జీవినీ । నసంస్కృతాన్నమల్పంచ భుక్తంపర్యుషితాశనా। పరపాకరతానిత్యం నిత్యంకుట్టణపేష ణీ। క్రయవిక్రయణీరాజన్ ఆర్జితాభుక్తశేషతః॥

తా॥ పూర్వకాలమందు ద్రావిడదేశమందు సుతబంధు విహీనరైన యొక స్త్రీ గలదు. ఆ స్త్రీ నిత్యము భిక్షాన్నమును భుజించునది. యెప్పుడు దూషితాన్నమునే భుజించునదిగాని పరిశుద్ధమైన అన్నమును తినునదిగాదు. చద్దిఅన్నమునుతినునదినిత్యము ధనము పుచ్చుకొని పరులకు వంట,కొట్టుపని,నూరుట మొదలైన పనులను చేయునది,అమ్మకం కొనుటయు చేయుచుండునది, ఇట్లుభుజించగా ఎక్కువద్రవ్యమును సంపాదించినది.

శ్లో॥ నధ్యాతంవిష్ణుపాదాబ్జం నశ్రుతాహరిసత్కథా।
నగతాపుణ్యతీర్థాని నోపోష్యంవిష్ణువాసరే॥
ద్రవ్యంనానావిధంభూప సంచితంబహుళంతయా।
నచోపకారంనోదానం నకృతంస్వాత్మభోజనం॥

తా॥ ఆ స్త్రీ విష్ణుపాదారవిందమును ధ్యానించలేదు. హరికథనువినలేదు, పుణ్యతీర్థములకు బోలేదు. ఏకాదశినాడుపవాసము చేయలేదు. అనేక వ్యాపారములచేత ద్రవ్యమును చాలాగా సంపాదించినది. గాని తాను తినలేదు, పరులకు పెట్టలేదు.

శ్లో॥ ఇత్థమజ్ఞానసంపన్నా మాహాకశ్చిద్ద్విజోత్తమః। దైవయోగా త్సమాయాత శ్రీరంగంద్రష్టుమిచ్ఛయా ॥ సవిప్రవర్యస్తాం దృష్ట్వా పాపబుద్ధిముపాశ్రితాం । అథాహకృపయారాజన్ సర్వభూతదయానిధిః॥

తా॥ ఇట్లు అజ్ఞాన సముద్రములో మునిగియున్న ఆ మెయింటికి దైవయోగము వలన శ్రీరంగమునకు బోవ నిచ్ఛగల ఒకబ్రాహ్మణుడువచ్చి దానిస్థితినిజూచి అయ్యో యీమెన్నది అన్యాయముగా నరకముల పాలు కాగలదని దయకలిగి ఆమెతోనిట్లనియె,

శ్లో॥ వక్ష్యామిసాంప్రతంమూఢా మద్వాక్యమవధారయ । దుఃఖా ద్దుఃఖమయో దేహః త్వఙ్మాంసాస్థిసమన్వితః॥దుఃఖాగారోప్యయంమూఢా భూతైఃపంచభిరన్వితః । దేహావసానే తేయాంతి పంచభూతాఃపృథక్ పృథక్।యథైవగేహవలభౌ నాశంయాంత్యుదబిందవః । జలబుద్బుదవద్దేహో నాశమాయాతినిశ్చితం॥

తా॥ ఓ మూఢులారా! యిప్పుడు నేచెప్పెడి మాటలనువినుము. విని చక్కగా ఆలోచించుము. యీ దేహము సుఖదుఃఖములతోగూడినది. చర్మము మాంసము ఎముకలు వీటితో గూడినది. దుఃఖములకు నిలయము భూమి, ఆకాశము, వాయువు,అగ్ని, జలము, అను పంచభూతములవలన గలిగి వాటితోగూడినది. దేహము నశించగా పంచభూతములు గృహోపరిభాగమందు పడిన వర్షబిందువులు వలె వేరువేరుగా పోవును యీ దేహము నీటిమీది నురుగువలె నశించును. యిది నిశ్చయము.

శ్లో॥ అనిత్యం దేహమాశ్రిత్య నిత్యంత్వంమన్యసేహృది।
తస్మాదంతస్థితంమోహం త్యజమూఢవిచారతః।
పతంగోగ్నింసమాగత్య పతత్యేవస్వయంయథా॥

తా॥ ఈదేహము నిత్యముగాదు యిట్టిదేహమును నిత్యమని నమ్మియున్నావు. యిది అగ్నిలో పడిన మిడుతవలె నశించును. కాబట్టి మోహమును విడువుము.

శ్లో॥ స్మరసత్యాత్మకం దేవం సర్వభూతదయానిధిం । ధ్యానంకురు మహావిష్ణోః పాదపంకజముత్తమం । కామంక్రోధంభయం లోభం మోహందారిద్ర్యాభిలాషణం । త్యజవిష్ణుపదద్వంద్వం భజభక్త్యాప్యనన్యయా॥

తా॥ దేవుని సత్యునిగాను సమస్త భూతములందు దయగలవానినిగాను గుర్తెఱుగుము, హరిపాదములను ధ్యానించుము. కామ మనగా కోరిక, క్రోధ మనగా దురాగ్రహము, భయమనగా ఆత్మార్తియు, భంగబుద్ధి, లోభమనగా ద్రవ్యవ్యయచింత, మోహమనగా మమతాహంతలు, వీటిని విడువు, ద్రవ్యమును సంపాదింతమను ఆశను వదలుము నిశ్చలమైన భక్తితో హరిపాదారవిందధ్యానము చేయుము.

శ్లో॥ కురుష్వకార్తికస్నానం భక్తిభావేన కేశవే । యథాదానం తథాకార్యం కార్తికేచాల్పమేవచ । దీపదానంప్రయత్నేన బ్రాహ్మణాయమహాత్మనే । తేననశ్యంతిపాపాని జన్మాంతరకృతాన్యపి॥మాకురుష్వాత్రసందేహం మహాపాపవిముక్తయే॥

తా॥ కార్తీకమాసమందు ప్రాతస్స్నాన మాచరించుము. విష్ణుప్రీతిగా దానము చేయుము. బ్రాహ్మణునకు దీపదానము చేయుము, అట్లు చేసిన యెడల అనేక జన్మముల పాపములు నశించును. యీవిషయమై సందేహము వలదు.

శ్లో॥ ఇత్యుక్త్వాసయయౌధీమాన్ ఐంద్రీంవిప్రవర స్తదా।
ఇతి తేనోదితంశ్రుత్వా విస్మితా రాజసత్తమ।
పశ్చాత్తాపమనుప్రాప్య సాకరోత్కార్తికవ్రతం॥

తా॥ ఇట్లు చెప్పి బ్రాహ్మణుడు తూర్పుగా వెళ్లెను. తరువాతఆమాటలునమ్మి విచారించి ఆశ్చర్యమొంది చేసినపాతకములకు వగచి కార్తీక వ్రతమును ఆరంభించెను

శ్లో॥ పతంగోదయ వేళాయాం కార్తీకస్నానమంభసి । హరేఃపూజాందీపదానం పురాణశ్రవణంతథా మాసాంతేవిప్రముఖ్యేభ్యో భోజనంసాప్రయచ్ఛతి । కార్తికేతుసదా రాజన్ మాసస్నానంకరోతిసా। తేనశీతజ్వరోత్పత్తి ర్గాయ తేకుక్షిరోగతః। తప్యమానాదివారాత్రం దుఃఖాద్వ్యాప్యాపు లేషుణా। మమార బంధుహీనాసా స్వర్గలోకంగతాముదా॥

తా॥ సూర్యోదయ సమయాన శీతోదకస్నానము హరిపూజ తరువాత దీపదానము, తరువాత పురాణ శ్రవణము, యీప్రకారముగా కార్తీకమాసము నెలరోజులు చేసి చివరకు బ్రాహ్మణభోజన సమారాధన చేసెను. నెలరోజులు శీతోదకస్నానము చేయుటచేత ఆస్త్రీకి శీతజ్వరము సంభవించి గర్భమందు రోగము జనించి రాత్రింపగళ్లు పీడితురాలై బంధుహీనయై దుఃఖించి చివరకు మృతినొందినది. తరువాతవిమాన మెక్కిపోయి శాశ్వత స్వర్గ భోగముల సౌఖ్యము బొందినది.

శ్లో॥ తస్మాత్కార్తికమాసేతు దీపదానంవిశిష్యతే।
జ్ఞానాజ్ఞానకృతంపాపం కార్తికేదీపదానతః॥
నశ్యంతినాత్రసందేహః శంకరేణోదితంపురా।
ఇదంరహస్యమాఖ్యానం కథితంతవభూపతే।
యచ్ఛ్రుత్వాముచ్యతేజంతుః జన్మసంసారబంధనాత్॥

తా॥ కాబట్టి కార్తీకమాసమందు అన్నిటికంటె దీపదానము అధికము. కార్తీక దీపదానము తెలిసి తెలియక చేసిన పాపములను నశింపచేయును. యిట్లని పూర్వము శివుడు పలికెను. రాజా యీరహస్యమును నీకు చెప్పితిని దీనిని విన్నవారు జన్మసంసార బంధనమును తెగించుకుని విష్ణుపదప్రాప్తులగుదురు.

ఇతి శ్రీ స్కాందపురాణె కార్తికమహాత్మ్యే షష్ఠోఽధ్యాయ స్సమాప్తః.

## 7 అథ సప్తమోఽధ్యాయారంభః.

శ్రీవసిష్ఠఉవాచ॥ శ్లో॥ పునఃకార్తికమహాత్మ్యం ప్రవక్ష్యామిసమాసతః।
తచ్ఛృణుష్వనరశ్రేష్ఠ ప్రసన్నేనాంతరాత్మనా॥

తా॥ (వసిష్ఠ మహాముని చెప్పుచున్నాడు.) ఓజనకమహారాజా! వినుము కార్తిక మాహాత్మ్యమును యింకా చెప్పెదను. సావధాన మనస్కుడవై వినుము.

శ్లో॥ యఃకార్తికేయజేద్భక్త్యా కమలైఃకమలేక్షణం।
తస్యగేహేవసేన్నిత్యం కమలానాత్రసంశయః॥

తా॥ కార్తికమాసమందు యెవడు పద్మములచేత పద్మములవంటి నేత్రములు గలహరినిపూజించునోవానియింట్లోపద్మములందుండులక్ష్మీదేవినిత్యనివాసముచేయును

శ్లో॥ దేవేశంభక్తియోగేన తులసీజాతిపుష్పకైః।
అర్చయేద్యదిమాసేస్మిన్ సచభూయోనజాయతే॥

తా॥ కార్తికమాసమందు భక్తితో తులసీదళములతోను, జాజిపువ్వులతోను హరిని పూజించువాడు తిరిగి భూమియందు జన్మించడు.

శ్లో॥ కార్తికేబిల్వపత్రేణ విష్ణుంవ్యాపకమీశ్వరం।
యఃపూజయేన్నరశ్రేష్ఠ నతుభూయోభిజాయతే॥

తా॥ కార్తిక మాసమందు మారేడు దళములతో సర్వవ్యాపకుడైన హరిని పూజించినవాడు తిరిగి భూమియందు జన్మించడు.

శ్లో॥ కార్తికేఫలదానంచ యఃకుర్యాద్భక్తిసంయుతః।
పాపానివిలయంయాంతి తమాంసీవారుణోదయే॥

తా॥ కార్తిక మాసమందు భక్తితో ఫలములను దానమిచ్చువాని పాపములు సూర్యోదయము కాగానే చీకట్లువలె నశించును.

శ్లో॥ యోధాత్రీఫలమూలేతు దృష్ట్వావిష్ణుంప్రపూజయేత్।
యమస్తంనేక్షితుంశక్తో నాత్రకార్యావిచారణా॥

తా॥ ఉసిరికాయలతో ఉసిరిగచెట్టుక్రింద హరిని పూజించు వానిని యముడు చూచుటకు సమర్థుడుకాడు.

శ్లో॥ సాలగ్రామార్చనంరాజన్ ఊర్జెమాసిప్రయత్నతః।
తులసీదళైరర్చయేచ్చ యస్సధన్యోనసంశయః॥

తా॥ కార్తికమాసమందు తులసీదళములతో సాలగ్రామమును పూజించువాడు ధన్యుడగును. యిందుకు సందియములేదు.

శ్లో॥ యోవనే భోజనం కుర్యాద్విప్రైస్సార్థం నృపోత్తమ।
కార్తికే తేన నశ్యంతి మహాపాతక కోటయః॥

తా॥ కార్తికమాసమందు బ్రాహ్మణులతోగూడా వనభోజన మాచరించువాని యొక్క మహాపాతకములుంగూడ నశించును.

శ్లో॥ ధాత్రీవృక్షసమీపేతు సాలగ్రామార్చనం నరః।
యః కుర్యాద్ద్విజశార్దూల కార్తికే బ్రాహ్మణైస్సహ॥
స వైకుంఠపురం ప్రాప్య విష్ణువన్మోదతే చిరం॥

తా॥ కార్తికమాసమందు బ్రాహ్మణులతోగూడా వుసిరిగచెట్టు దగ్గర సాలగ్రామమునుపూజించువాడు వైకుంఠముకుపోయిఅచ్చట విష్ణువువలెఆనందించుచుండును.

శ్లో॥ యః కార్తికే ఘూసిభక్త్యా తోరణం చూతపల్లవైః॥
దామోదరాగ్రే యః కుర్యాత్స యాతి పరమాం గతిం॥

తా॥ కార్తికమాసమందు భక్తిచే హరియొక్క ఆలయమందు మామిడి చిగురుటాకులతో తోరణమును కట్టువాడు పరమ పదమును నొందును.

శ్లో॥ కదళీస్తంభపూజాంచ యః కుర్యాత్కార్తికే హరేః।
పుష్పైర్వా మంటపం విష్ణో స్స వైకుంఠే చిరం వసేత్॥

తా॥ కార్తికమాసమందు హరికి అరటి స్తంభములతోగాని పుష్పములతోగాని మంటపమును నిర్మించి పూజించువాడు చిరకాలము వైకుంఠమందుండును.

శ్లో॥ కార్తిక్యాం కేశవస్యాగ్రే నమస్కుర్వంతి యే సకృత్।
సర్వపాపవినిర్ముక్తా అశ్వమేధఫలం స్మృతం॥

తా॥ కార్తికమాసమందు పక్కమారైనను హరిముందర దండప్రణామ మాచరించువారు పాపముక్తులై అశ్వమేధయాగఫలము నొందుదురు.

శ్లో॥ కార్తికే తు హరేరగ్రే జపహోమసురార్చనం।
యః కుర్యాద్యాతి వైకుంఠం పితృభిస్సహ భూమిప॥

తా॥ కార్తికమాసమందు హరిముందర జపము, హోమము, దేవతార్చనమును చేయువారు తమపితరులతోసహ వైకుంఠమునకు బోవుదురు.

శ్లో॥ కార్తికే వస్త్రదానంచ యః కుర్యాత్స్నానశీతలే।
సోశ్వమేధాయుతానాంచ ఫలం ప్రాప్నోత్యసంశయః॥

తా॥ కార్తికమాసమందు స్నానముచేసి తడిబట్టతోనున్న వానికి వస్త్రదానము చేయువాడు పదివేల అశ్వమేధయాగములు చేసిన ఫలమును బొందును.

శ్లో॥ యఃకార్తికేమాసివిష్ణో శ్శిఖరేధ్వజమర్పయేత్ ।
తేనసశ్యంతిపాపాని వాయునాపాంసవోయథా॥

తా॥ కార్తికమాసమందు విష్ణువుయొక్క ఆలయ శిఖరమందు ధ్వజారోపణ చేయువాని పాపములు గాలికి పరాగములవలె నశించును.

శ్లో॥ కార్తిక్యామతసీపుష్పై రర్చయేదచ్యుతంనరః ।
సితాసితై ర్వారాజేంద్ర యజ్ఞాయుతఫలంలభేత్ ॥

తా॥ కార్తికమాసమందు నల్లవిగాని తెల్లవిగాని అవిసిపువ్వులతో హరిని పూజించిన యెడల పదివేల యజ్ఞములు చేసిన ఫలము గల్గును.

శ్లో॥ బృందావనాగ్రేకార్తిక్యాం గోమయేనోపలిప్యచ ।
స్వస్తికైశ్శంఖపద్మాద్యై ర్యాకుర్యాత్సాహరిప్రియా॥

తా॥ కార్తిక మాసమందు బృందావనమందు గోమయముతో నలికి పంచరంగులతోను శంఖపద్మస్వస్తికాదులను చేయునది హరికి ప్రియురాలగును.

శ్లో॥ నందాదీపంతుకార్తిక్యా మర్పయేద్విష్ణుమందిరే ।
తత్ఫలస్యచమర్యాదా బ్రహ్మణాపినశక్యతే॥

తా॥ కార్తికమాసమందు విష్ణుసన్నిధిలో నందాదీపమును అర్పించిన ఫలమునకు ప్రమాణమును చెప్పుటకు బ్రహ్మకును శక్యముగాదుగదా.

శ్లో॥ నశ్యేదేతద్యదారాజన్ వ్రతభ్రష్టోభిజాయతే ।
తిలవ్రీహిసమాయుక్తం మునిపుష్పైస్సమన్వితం।
నందాదీపంవిధానేన కార్తిక్యాంవిష్ణవేర్పయేత్ ॥

తా॥ ఈ నందాదీపము నశించిన యడల వ్రతభ్రష్టుడగును గాన తిలలతోను ధాన్యములతోను అవిసిపువ్వులతోను కలిపిన నందాదీపమును కార్తికమాసమందు హరికి సమర్పించవలయును నందా అనగా ౧-౬-౧౧ తిథులందు జేయునది.

శ్లో॥ యఃకార్తిక్యామర్కపుష్పై రర్చయేద్గిరిజాపతిం ।
సలబ్ధ్వాపూర్ణమాయుష్యం పశ్చాన్మోక్షమవాప్నుయాత్ ॥

తా॥ కార్తికమాసమందు శివునికి జిల్లేడు పువ్వులతో పూజించినవారు చిరకాలము జీవించి తుదకు మోక్షము నొందుదురు.

శ్లో॥ రాజన్ యఃకార్తికేమాసి కేశవాలయమంటపం ।
అలంకరోతిశోభాఢ్యా సయాతిహరిమందిరం॥

తా॥ కార్తీకమాసమందు విష్ణ్వాలయ మంటపమును భక్తితో అలంకరించువారు హరిమందిరమందు స్థాయియగుదురు.

శ్లో॥ మల్లికాకుసుమైర్దేవం మాధవంకార్తికేఽర్చయేత్ ।
తేననశ్యంతిపాపాని తమస్సూర్యోదయేయథా॥

తా॥ కార్తీకమాసమందు హరిని మల్లిపువ్వులతో పూజించువాని పాపములు సూర్యోదయానంతరము చీకట్లువలె నశించును.

శ్లో॥ తులసీకాష్ఠగంధంతం సాలగ్రామస్యయోఽర్చయేత్ ।
సర్వపాపవినిర్ముక్తో యాతివిష్ణోఃపరంపదం॥

తా॥ కార్తీకమాసమందు తులసీగంధముతో సాలగ్రామమునుపూజించువాడు పాపముక్తుడై విష్ణులోకమును బొందును.

శ్లో॥ యఃకుర్యాత్కార్తికేవిష్ణో ర్నర్తనంనర్తకీతథా ।
జన్మాంతరార్జితంపాపం నాశంయాతినసంశయః॥

తా॥ కార్తీకమాసమందు హరిసన్నిధిలో స్త్రీగానిపురుషుడుగాని నాట్యము చేసినయెడల పూర్వజన్మసంచితమైన పాతకములుగూడ నశించును.

శ్లో॥ కార్తికేమాసిరాజేంద్ర కేశవాలయమండనం।
యఃకుర్యాత్సోఽపివైకుంఠే విష్ణుసాయుజ్యమవాప్నుయాత్॥

తా॥ కార్తీకమాసమందు విష్ణ్వాలయమందు అలంకారము చేయించువాడు వైకుంఠమందు సాయుజ్యముక్తినొందును.

శ్లో॥ కార్తికేచాన్నదానంచ యఃకుర్యాద్భక్తిమాన్నరః ।
తస్యాఘంనశ్యతిక్షిప్రం పవమానాద్యథాఘనః॥

తా॥ కార్తీకమాసమందు భక్తితో అన్నదానమాచరించువాని పాపములు గాలికి మబ్బువలె నశించును.

శ్లో॥ తిలదానంనదీస్నానం భోజనంబ్రహ్మపత్రకే ।
కార్తికేచాన్నదానంచ ధర్మమేతచ్చతుష్టయం॥

తా॥ కార్తీకమాసమందు తిలదానము, మహానదీస్నానము, బ్రహ్మపత్రిభోజనము అన్నదానము, యీనాలుగు ధర్మములును, చేయవలెను.

శ్లో॥ నకుర్యాద్యశ్చకార్తిక్యాం స్నానందానంనరాధమః ।
శ్వానయోనిశతంగత్వా చండాలత్వమతఃపరం॥

తా॥ కార్తీకమాసమందు స్నానము, దానము, యథాశక్తిగా చేయనివాడు నూఱుజన్మములందు కుక్కగాబుట్టి తరువాత చండాలుడగును.

శ్లో॥ నారీవాపురుషోవాపి నకుర్యాత్కార్తికవ్రతం।
రాసభీంయోనిమాప్నోతి శ్వానయోనిశతంతథా॥

తా॥ స్త్రీగాని పురుషుండుగాని కార్తిక వ్రత మాచరించనివారు గాడిదెగా ముందు జన్మించి తరువాత నూఱుసారులు కుక్కగా జన్మించుదురు.

శ్లో॥ కదంబపుష్పైఃకార్తిక్యా మర్చయేద్భక్తవత్సలం।
ససూర్యమండలంభిత్వా స్వర్గలోకేవసేచ్చిరం॥

తా॥ కార్తికమాసమందు కడపపువ్వులతో హరిని పూజించువాడు సూర్య మండలమును భేదించుకొని స్వర్గమునకు బోవును.

శ్లో॥ కేతక్యాకార్తికేమాసి యఃపూజయతిభక్తితః।
సప్తజన్మభవేద్విప్రో వేదవేదాంగపారగః॥

తా॥ కార్తికమాసమందు మొగలి పువ్వులతో భక్తితో హరికి బూజించువాడు యేడు జన్మలందు వేద వేదాంగ పారంగతుడైన బ్రాహ్మణుడై జన్మించును.

శ్లో॥ సహస్రపత్రైర్యోవిష్ణుం పూజాంకుర్యాచ్చకార్తికే।
సమిత్రపదవీంప్రాప్య దీర్ఘాయుష్యసువాప్నుయాత్॥

తా॥ కార్తికమాసమందు పద్మములతో హరిని పూజించువాడు సూర్యమండలమందు చిరకాలము నివసించును.

శ్లో॥ అతసీపుష్పమాలాంయో హ్యలంకృత్యతథాస్వయం।
స్కంధేధృత్వాఽర్చయేద్విష్ణుం సచస్వర్గాధిపోభవేత్॥

తా॥ కార్తికమాసమందు తాను స్వయముగా అవిసెపువ్వుల మాలను ధరించి తరువాత హరిని అవిసెపువ్వుల మాలికలతో పూజించువాడు స్వర్గాధిపతియగును.

శ్లో॥ స్త్రీయోమాల్యేనవావిష్ణుం పూజయేత్తులసీదళైః।
ససర్వపాతకాన్ముక్తో యాతివిష్ణోఃపరంపదం॥

తా॥ స్త్రీలు మాల్యములచేతను తులసిదళములచేతను కార్తిక మాసమందు హరిని పూజించినయడల పాపవినిర్ముక్తులై వైకుంఠమును పొందుదురు.

శ్లో॥ కార్తికేభానువారేతు స్నానకర్మసమాచరేత్।
మాసస్నానేనయత్పుణ్యం తత్పుణ్యంలభతేనృప॥

తా॥ కార్తికమాసమందు ఆదివారమందు స్నానముచేసినయడల మాసమంతయు స్నానమాచరించిన పుణ్యమును బొందును.

శ్లో॥ ఆద్యేంతిమేమధ్యమేచ దినేయస్స్నానమాచరేత్।
మాసస్నానఫలంతేన లభతేనాత్రసంశయః॥

తా॥ కార్తికమాసమందు శుక్ల పాడ్యమినాడు పూర్ణిమనాడు అమావాస్య నాడు యీమూడునాళ్లు ప్రాతస్స్నానము చేసినయెడల అశక్తునకు మాసస్నాన ఫలము వచ్చును.

శ్లో॥ అథవామాసమాహాత్మ్యం యశ్శృణోత్యఘనాశనం।
మాసమేకంనృపశ్రేష్ఠ సముక్తస్సర్వపాతకైః॥

తా॥ అందుకు శక్తిలేనంతలో కార్తికమాసమందు నెలనాళ్లు తప్పకుండా మాసమాహాత్మ్యమును వినినట్లైతే స్నానఫలముగలిగి పాపములు నశించును.

శ్లో॥ కార్తికేమాసియోదీపాన్ దృష్ట్వామోదతియఃపుమాన్।
తేనపాపానినశ్యంతి నాత్రకార్యావిచారణా॥

తా॥ కార్తికమాసమందితరులు సమర్పించిన దీపములను జూచి ఆనందము నొందువాని పాపములు నిశ్చయముగా నశించును.

శ్లో॥ సహాయంకురుతేవిష్ణోః పూజార్థంయఃప్రయత్నతః।
కర్మణామనసావాచా సస్వర్గఫలమశ్నుతే॥

తా॥ కార్తికమాసమందు యితరులకు హరిపూజకు మనోవాక్కాయముల చేత సహాయముచేయువాడు స్వర్గమును బొందును.

శ్లో॥ కార్తికేమాసియోభక్త్యా హ్యర్చయేదచ్యుతంనరః।
గంధపుష్పైస్సుధూపాద్యైః యాతితత్పదమవ్యయం॥

తా॥ కార్తికమాసమందు భక్తితో గంధపుష్ప ధూప దీపాదులచేత హరిని పూజించువాడు వైకుంఠమును బొందును.

శ్లో॥ కార్తికే కేశవస్యాగ్రే యోజపంససమాచరేత్।
సజంబుకోభవేద్భూమౌ సప్తజన్మస్వసంశయః॥

తా॥ కార్తికమాసమందు హరిసన్నిధిలో జపమాచరించనివాడు భూమియందు యేడు జన్మములందు నక్కగా జన్మించును యిందుకు సందేహములేదు.

శ్లో॥ యేప్రదోషేపురాణంతు కార్తికే కేశవాగ్రతః।
కుర్వంతినరశార్దూల తేయాంతిహరిమందిరం॥

తా॥ కార్తికమాసమందు సాయంకాలమందు హరిసన్నిధియందుపురాణకాల క్షేపమును చేయువారు వైకుంఠము చేరుదురు.

శ్లో॥ కార్తికేమాసిసాయాహ్నే స్తోత్రపాఠపరోనరః।
సస్వర్గలోకమాసాద్య ధ్రువలోకమతఃపరం॥

తా॥ కార్తీకమాసమందు సాయంకాలమందు ఆలయములందు స్తోత్రములను పఠించువాడు స్వర్గలోకమందు కొంతకాలముండితరువాత ధ్రువలోకముచేరిసుఖించును.

ఇతి శ్రీస్కాందపురాణె కార్తీకమాహాత్మ్యే

సప్తమోధ్యాయస్సమాప్తః.

---

## అథ అష్టమోఽధ్యాయ ప్రారంభః.

రాజోవాచ॥ శ్లో॥ మచ్చిత్తేఽధికసందేహో వర్తతె బ్రహ్మనందన।
తన్నాశయాద్య మెబ్రూహి త్వద్వాక్యామితవ ప్రభో॥

తా॥ రాజడుగుచున్నాడు. వసిష్ఠమునీంద్రా! నామనస్సులో గొప్పసందేహము గలిగినది ఆసందేహము తెలిపెదను దానిని నశింపజేయుము.

శ్లో॥ త్వత్తోమయా శ్రుతంవిప్ర సూక్ష్మధర్మస్యలక్షణం। తథావిధం పాతకంచ నిందితంవిబుధాదిభిః । బహుపాపరతానాంచ వర్ణసంకరకారిణాం। ఆచారహీనానాంచ దుర్జనానాంమహామతే। ప్రాయశ్చిత్తై స్తుపూయంతె త్రయీవిద్యాదిసంభవైః। కృత్వా గురూణిపాపాని మానవాదుష్టబుద్ధయః । ధర్మలేశేన తేసర్వే కథంయాంతిహరేఃపదం॥

తా॥ మీరు నాకు ధర్మసూక్ష్మమును చెప్పినారు, పాతకములో గొప్పదానిని చెప్పినారు, అయితే వర్ణసంకర కారకములైన మహాపాపములు చేసి దుర్జనులు వేదత్రయోక్తములైన ప్రాయశ్చిత్తములను చెసికొని పరిశుద్ధులగుదురని ధర్మశాస్త్రము లందు చెప్పబడియుండగా మీరు ధర్మలేశముచేతనే పరిశుద్ధులై హరిలోకమునుబొందుదురని చెప్పినారే అది యెట్లు సంభవమగును.

శ్లో॥ బ్రహ్మన్బహూనిపాపాని గురూణివివిధానిచ ప్రాయశ్చిత్తవిహీనాని కృత్వాయాంతికథంహరిం। జ్ఞాత్వాసర్వాణ్యనంతాని పాతకానినరఃక్వచిత్ । దిష్ట్యోపలబ్ధధర్మేణ కథంయాంతిహరేఃపదం॥

తా॥ ఓమునీశ్వరా! అనేక మహాపాతకములుచేసి ప్రాయశ్చిత్తములను చేసికొనక యెట్లు హరి లోక నివాసులగుదురు? అనంత పాతకములుచేసి యీపాపములు గొప్పవనియు వీటికి ప్రాయశ్చిత్తములు చేయించుకొనవలయుననియు తెలిసియు అట్లు చేయక దైవవశముచేత సంభవించిన కార్తీకదీపదానాది పుణ్యములవలన వైకుంఠమునకు పోవుట యెట్లు సంభవించును.

శ్లో॥ మహాపర్వతసంకాశం చిన్నభిన్నంగిరేశృంగమదో యథా। కఠిన్యాంజనశైలం కులిశేనతథాప్యయం। స్వయంగృహాంతరే సిక్తా వహ్న్యగ్నిదత్వాభ్యమజ్జనత్। జ్వలంతమగ్ని మజ్ఞోపి నాచమేత్ చుళుకోదకాత్। మహానదీప్రవాహేతు స్వయంగత్వా తతః పునః। తృణసంగ్రహణంకృత్వా తథాధారోభవేన్నచ। మహాదుర్గంసమారుహ్య తచ్ఛృంగాత్పతితోనరః। తదంతరాళతిలకాగ్రహే కేసభవేత్సుఖం। గురుందుష్కృతమాశ్రిత్య హ్యల్పేనసుకృతేనచ। సకధంచవిముచ్యేత పాతకేనాత్యసంభవం। ఇదంమమసమాచక్ష్వ శ్రోతౄణాంవిస్మయావహమ్॥

తా॥ స్వల్పపుణ్యముచేత అధికపాపములు నశించవనుట విషయమై దృష్టాంతములను చెప్పుచున్నాడు గండ్రగొడ్డలి మొదలయిన యాయుధములచేత ఛేద్యముగాని వజ్రపర్వతమును గోటి చివరభాగముచేత చూర్ణము చేయుటకు శక్యమగునా, తాను లోపలనుండి గృహమునకు అగ్ని ముట్టించి మండుచుండగా తెలియనివాడిపలెనుండి పుడిసెడునీళ్లు అనగా చేతికివచ్చినన్ని జలము ఆమండే అగ్నిమీద చల్లినయడల ఆఅగ్ని ఆగునా మహానదీ ప్రవాహములో స్వయంగా పడికొట్టుకొనిపోవుచు గడ్డిపరకను ఆధారముగా చేసుకొని దరికిజేరునా, స్వయముగా గొప్పపర్వతమును యెక్కి అక్కడనుంచి క్రిందికి పడుతూ మధ్యనున్న చిన్నతీగను పట్టుకున్నయడల పడకుండా ఆగునా, ఇట్టి దృష్టాంతములనుపట్టి చూడగా అధికములైన పాపములను చేసి స్వల్పపుణ్యముచేతవాటిని నశింపచేయుట కెట్లు శక్యమగును. యీసంశయమును నాకు నశింపచేయుము. నాకేగాదు వినువారికి నందరకును గలిగెడి సందేహమేను.

శ్లో॥ కార్తికేమాఘవైశాఖే ధర్మసూక్ష్మంత్వయోదితం।
బహూనిపాతకాన్యేవ హ్యుదితానిత్వయామునే।
తత్సర్వంవిలయంకుర్యాత్ స్వల్పైవచసాంపత్రితం॥

తా॥ కార్తీక మాఘవైశాఖమాసములందు చేసిన స్వల్పపుణ్యమే అధికపాతకములను నశింపచేయునని మీరు చెప్పినారు అది యెట్లు సిద్ధించును:

శ్రీసూతఉవాచ॥ శ్లో॥ ఇతిభూపవచశ్శ్రుత్వా మందస్మేరముఖాంబుజః॥
ఇదమాహప్రహృష్టాత్మా రాజానంవిస్మయాన్వితం॥

తా॥ సూతుఁడు చెప్పుచున్నాడు ఈప్రకారముగా రాజు మాటవిని, వసిష్ఠమునీంద్రుడు చిరునవ్వునవ్వి సంతోషముతో స్వల్పపుణ్యముచేత గొప్పపాపములెట్లు నశించునను ఆశ్చర్యముతో కూడుకొనియున్న రాజుతో నిట్లనియె.

వసిష్ఠ ఉవాచ॥ శ్లో॥ శృణురాజన్ ప్రవక్ష్యామి సాధుసాధువిమర్శనం।
మయాప్యాలోకితంసర్వం వేదశాస్త్రవిచారణం।తత్రధర్మాహ్య
సంఖ్యాతాబహుసూక్ష్మతరాన్నృప।దృశ్యం తేహంప్రవక్ష్యామి
త్వంమాకుర్వత్రసంశయం।

తా॥ ఓ రాజా వినుము ! మంచి విమర్శనచేసినావు, నేనుగూడ విచారించినాను వేదశాస్త్రపురాణములను విచారించగా ధర్మములలో సూక్ష్మములున్నట్లు తెలిసినది. అట్టి సూక్ష్మధర్మములు యెంత పనినైన చేయ సమర్థములు ఒకానొకప్పుడు గొప్ప పుణ్యముగూడా స్వల్పమైపోవును. ఒకప్పుడు స్వల్పపుణ్యమె అధిక ఫలప్రదమగును. గనుక యీవిషయమందు సందేహమొందకుము, చెప్పెదను సావధానముగా వినుము.

శ్లో॥ గుణత్రయాన్వితాధర్మాః రాజన్ శాస్త్రేష్వవస్థితాః।
సత్వంరజస్తమఇతి గుణాఃప్రకృతిసంభవాః॥

తా॥ అట్టి భేదమెట్లుగానంటె ధర్మములు గుణత్రయముతోగూడుకొని స్వల్పాధిక్యములగును, గుణములు, సత్వము, రజస్సు, తమస్సు అనునవి మూడు యీమూడు గుణములను ప్రకృతివలన గలిగినవి, ప్రకృతియనగా మూలప్రకృతి అనగా మాయ.

శ్లో॥ యోధర్మస్సత్వమాలంబ్య త్వంసూక్ష్మంకవయోవిదుః॥
ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపఃకర్మాన్వితానివై।రజోన్వితాని
రాజేంద్ర భూయోజన్మప్రదానిచ । ఇదంకృతాకృతఫలం
యద్ధర్మంప్రోచ్యతేబుధైః॥ తద్ధర్మంతామసంప్రాహుర్నిష్ఫ
లంపృథివీపతే॥

తా॥ అందులో సత్వమువలన చేయబడిన ధర్మమును సూక్ష్మమందురు. ప్రాయశ్చిత్తములన్నియు తపస్సు కర్మకాండమంతయు రజోగుణమువలన గలిగినవి. తమో గుణమువలన చేసిన ధర్మము తామసమనబడును యిదినిష్ఫలము.

శ్లో॥ తస్మాత్సాత్వికధర్మంతు తేసూక్ష్మంకథితంమయా।
లేశంవాజాయతేరాజన్ సమృద్ధిఃకాలయోగతః॥

తా॥ ఇందులో సత్వగుణముతో చేయబడిన ధర్మమును సూక్ష్మమని నీకు చెప్పితిని అది కొంచమైనను కాలయోగమువలన వృద్ధినొందును.

శ్లో॥ అదేశకాలేయద్దానమపాత్రేప్రతిపాదితం।
విధిహీనమంత్రించ ధర్మంతత్తామసంవిదుః॥

తా॥ దేశమనగా పుణ్యక్షేత్రము, కాలమనగా పుణ్యకాలము, పాత్రమనగా యోగ్యుడైన బ్రాహ్మణుడు, యీమూడు విధముల యోగ్యతను విచారించకయు విధి రహితముగాను మంత్రరహితముగాను చేయు దానాదికము తామసమనబడును యిది యెంతగొప్పదైనను పాపనాశన సామర్థ్యముగలదిగాదు.

శ్లో॥ కాలదేశంసవిజ్ఞాయ ధర్మంయఃకురుతేనృప।
తదక్షయఫలంప్రోక్తం ముక్తిహేతుర్నసంశయః॥

తా॥ దేశకాల పాత్రములను విచారించి చేసిన ధర్మము అక్షయమై మోక్ష హేతువగును.

శ్లో॥ యదాధికంవాస్తోకంవా కాలంవిజ్ఞాయమానవః।
విచారితార్థంకుర్వీత గహనాకర్మపద్ధతిః॥

తా॥ ధర్మము అధికమో, స్వల్పమో కాలమునుబట్టివిచారించినిశ్చయించవలెను. కర్మపద్ధతి దుర్విజ్ఞేయము అనగా కర్మసరణియిట్టిదనినిశ్చయించుటకువీలు లేదనిభావము.

శ్లో॥ లభంతే తేనసౌఖ్యాని దుర్లభానిమహీపతే।
జ్ఞానేనాప్యథవాజ్ఞానా త్కాలే దేశేచ్ఛదైవతః।
కరోతిఫలమక్షయ్యం జాయతేనాత్రసంశయః॥

తా॥ అట్లుగా దేశకాలవిచారణచేసి చేసిన ధర్మమువలన సుఖమును పొందుదురు. కాబట్టి జ్ఞానముచేతగాని అజ్ఞానముచేతగాని దేశకాలపాత్ర విచారణచేసి చేసిన ధర్మము అక్షయఫలమునిచ్చును యిరిదుకు సందియములేదు.

శ్లో॥ కాష్ఠభారాన్సమాదాయ సన్నివేశ్యనగోపమాన్। తత్రగుంజాఫలంమాత్రమగ్నింనిక్షిప్యతాన్దహేత్ ॥ గృహసంతమసేవ్యాప్తె దీపేనాల్పేనయాద్యుతిః। తమిస్రంవినిహంత్యాశు ధర్మోల్పోపివాధవాన్నృప॥ యథాకర్దమనీరేతు స్నాత్వాభూయోతినిర్మలే। జలేస్నానేనరాజేంద్ర నిర్మలోజాయతేతథా॥

తా॥ అల్పపుణ్యముచేత అధిక పాపములు నశించుననుటకు దృష్టాంతములుచూపబడుచున్నవి, పర్వతము యెత్తున కట్టెలను పేర్చి అందులో గురువిందగింజంత అగ్నిని వుంచిన యెడల ఆకట్టెలన్నియు భస్మమగుటలేదా, గృహమంతయు చీకట్లు వ్యాపించగా చిన్నదీపమును వెలిగించినంతలో యీచీకట్లు నశించుటలేదా, చిక్కగానున్న బురదనీటిలో యెంతకాలము స్నానముచేసిన చివరకు నిర్మలజలమందు వకమారు స్నానమాచరించిన యెడల ఆమురికి పోవుటలేదా,

శ్లో॥ అల్పం వా యేన కేనాపి హ్యజ్ఞానేనాథ వా సకృత్ । నామసంకీర్తనాద్విష్ణోఃదహ్యంతే బహూని పాతకాః। విష్ణుసంకీర్తనం రాజన్ కీర్తయేజ్ఞానమోహితః । దహత్యఘం మహాదపి వేణుగుల్మమివానలః॥

తా॥ అజ్ఞానముచేతగాని జ్ఞానముచేతగాని చేసినపాపములు అధికముగాని స్వల్పముగాని హరినామ సంకీర్తనతమువలన నశించును. మహిమ తెలియక చేయబడిననైనను హరినామ సంకీర్తనముచే పాపములన్నియు అగ్నివలెనే నశించును.

శ్లో॥ పురా కశ్చిద్దురాచారో విప్రనామా నరజామిళః। దాసీపతిః క్రూరకర్మా దాసీసంసర్గలాలసః । కన్యాకుబ్జే సత్యనిష్ఠో నామ్నా వై స బహుశ్రుతః। తస్య భార్యా ధర్మవతీ సాధ్వీ పతిపరాయణా। తస్యా చాంతరితే కాలే సంజాతోఽజామిళ స్తదా॥

తా॥ పైనచెప్పిన విషయమై యొక కథను చెప్పెదను వినుము పూర్వకాలమందు కన్యాకుబ్జమను క్షేత్రమందు వేదవేదాంగ పారంగతుఁడైన సత్యనిష్ఠుఁడను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. ఆబ్రాహ్మణునకు పతివ్రతయు ధర్మాత్మురాలునగు భార్యకలదు. వారిరువురకు చివరకాలమున అజామిళుడను నొక కొమారుఁడు పుట్టెను అజామిళుడు దురాచారుడును దాసీభర్తయు, హింసకుడును, నిత్యము దాసీసాంగత్యమందు ఆసక్తి గలవాడును అయి వుండెను. అట్టివాడు స్వల్పపుణ్యముచేత అనగా తెలియక చేసిన హరినామ సంకీర్తనమువల్ల తరించెను.

శ్లో॥ పూర్వకర్మానురోధేన సోఽభవత్ప్రాప్తయౌవనః।కస్యచిద్ద్విజముఖ్యస్య దుర్మార్గస్య చ భూమిప । గృహే దాసీ పతిశ్చాసీత్ పూర్వకర్మానుబంధతః । మాతరం పితరం హిత్వా మదనావేశమోహితః । తయా సమం సతన్వంగ్యా పానభోజనభక్షణైః । కామశాస్త్రకలాపైశ్చ పరిరంభణచుంబనైః॥ అజామిళ స్తయా దాస్యా రేమే కామవిమోహితః॥ సర్వకర్మాణి సంత్యజ్య వేదశాస్త్రోదితాని చ॥

తా॥ ఆ అజామిళుడు ప్రవర్తించిన ప్రకారమెట్లన అజామిళునకు యౌవనము రాగానే యొక దుర్మార్గ బ్రాహ్మణుని యింట్లో యొకదాసీవున్నది దానితో సంగమము చేసి దానియందే ఆసక్తుడై తల్లిని తండ్రిని విడిచి కామాతురుడై దానితో జలపానము, భోజనము, శయనము, జరుపుచు వైదికకర్మలను విడిచి కామశాస్త్రప్రతి

ణుడై ఆలింగన చుంబనాది కేళీలంపాసక్తిగలవాడై ఆదాసీతోనే నిరంతరము కాలము గడుపుచుండెను.

శ్లో॥ చక్రుర్నిష్కాసయామాసతత్రి తంతదా బాంధవాఃపరే। పరిత్యజ్య తతో౽జ్ఞాం విప్రసూనుస్సపాపధీః । తస్మిన్నేవాంత్యజభువం ప్రావ్యతత్సన్మచాశ్రితః । పశుపక్షిమృగాదీనాం హత్వాత న్మాంసజీవనః। శ్వాగురికసరీయుక్తో వనేహింసాపరాయణః॥ దాస్యామంచచారాసౌ వనేదుష్టమృగాకులే॥

తా॥ ఆ అజామిళుడిట్లు కులాచార భ్రష్టుడై నంతలో బంధువులందఱు అతనిని గృహమునుంచి వెళ్ళగొట్టిరి. అజామిళుడు ఆవూరిలోనే యొక చండాలునియింట్లో నివాసముచేసికొని నిత్యము దాసీతోగూడి కుక్కలను,వుచ్చులువేసి మృగములను పట్టుకొను వాళ్ళను వెంటబెట్టుకొని అరణ్యమును బోయి పశువులను, పక్షులను, మృగములనజంపి వాటి మాంసమును భుజింపుచు కాలము గడుపుచుండెను.

శ్లో॥ కదాచిత్సాలవృక్షేసా మధుదృష్ట్వారురోహన్నృప।
భగ్నశాఖా౽పతద్భూమౌ మరణంసముపాగతా॥

తా॥ ఇట్లుండగా నొకనాడు దాసీగిట్లుదాగ్రిగుదమను యాశతో తాడిచెట్టెక్కి కొమ్మవిరిగి క్రిందపడి మృతిబొందెను.

శ్లో॥ అజామిళస్తతోదృష్ట్వా రాజన్ ప్రాణధనేశ్వరీం।
స్వపురస్థాన్యబహుధా విలలాపాకులేంద్రియః॥
గిరిగర్తేమహారాజన్ తాంవిసృజ్యగృహంగతః॥

తా॥ తరువాత అజామిళుడు భార్యను చూచి తనప్రాణముల్కంటె అధికప్రియమైనది గనుక చచ్చిన శవమును తనముందర నుంచుకొని వికలుడై బహుశోకించి తరువాత దానిని కొండబిలమందు పారవైచి యింటికిపోయెను.

శ్లో॥ తతస్తస్యాస్సుతాతన్వీ సురూపాప్రాప్తయావనా।
తాందృష్ట్వాసచపాపాత్మా తయారేమేచిరంనృప॥

తా॥ అజామిళుడు తరువాతయావనవంతురాలైన దానికూతురునుచూచి పాపాత్ముడుగనుక తన పుత్రికయను నీతిని విడిచి దానితో చిరకాలము క్రీడించుచుండెను.

శ్లో॥ తస్మాత్తాసుషువేరాజన్ పుత్రాన్కాలేచవైనృప । క్షీణాయుభోగతాస్సర్వే కనిష్ఠశ్చావశేషితః । నారాయణాఖ్యః

ధానంచ చక్రే హ్యజ్ఞానో ... భక్ష్యన్ పిబన్ భుంజన్
పశ్యన్ పరిస్వజన్ సదా । పుత్రపాశేన సంబద్ధస్తన్నామ
గ్రహణాతురః॥

తా॥ తరువాత అజామిళునకు ఆ దాసిగల భార్యయందు కొందరు కుమారులు కలిగి నశించిరి. అందు చినవాడు మాత్రము మిగిలియుండెను. వానికి "నారాయణ" అను నామకరణము చేసి అజామిళుడు నడుచునప్పుడు కూర్చుండునప్పుడును జలపాన కాలమందును భోజనము చేయునప్పుడును నిద్రించునప్పుడును పుత్రపాశము చేత బద్ధుడై నిరంతరము నామమునే (నారాయణ నామమునే) పలుకుచుండెను.

శ్లో॥ తతః కాలేసమాయాతే మరణే సముపస్థితే।
తన్నేతుమాగతా రాజన్ యమదూతా భయంకరాః॥
రక్తశ్మశ్రుముఖాలోష్ట దండహస్తాసిపాణయః॥

తా॥ తరువాత కొంతకాలమునకు అజామిళునకు మరణకాలము సమీపించి నంతలో అతనిని తీసుకొనిపోవుటకుగాను యెఱ్ఱని గడ్డములు మీసములుగలిగి చేతు లందు దండములను గాళ్ళను కత్తులను ధరించి భయంకరులైన యమదూతలు వచ్చిరి.

శ్లో॥ తాన్ దృష్ట్వా భయసంత్రస్త మహాత్మానం నేతుమాగతాన్ ।
ఉవాచ వాక్యమేతచ్చ పుత్రస్నేహపరిప్లుతః । దూరే క్రీడనకా
సక్తం పుత్రం నారాయణాహ్వయం । ద్రావితేన స్వరేణోచ్చై
రాజుహావాకులేంద్రియః॥

తా॥ అజామిళుడు తనను దీసికొనిపోవ వచ్చిన యమదూతలను చూచి భయ పడి పుత్రస్నేహము చేత దూరమందాటలో నున్న కుమారుని ఓనారాయణా, నారా యణా అని పిలిచెను. ఆపిలుచునప్పుడు భయముచేత దీనస్వరముతో పెద్దగా ఓనారా యణా అను పలుమారు పిలిచెను.

శ్లో॥ శ్రుత్వా తన్మ్రియమాణస్య పదవాద్విష్ణుకీర్తనం।
తేవిచింత్య తతో దూరం జాతకంపాస్థితాన్నృప॥

తా॥ భక్తియుక్తితో గూడిన నారాయణనామ సంకీర్తనమును మరణకాలమందు అజామిళుడు చేయుచుండగా విని యమదూతలు ఆలోచించి దగ్గరకు రావెఱచి దూరముగా పోయి భయముతో నుండిరి.

శ్లో॥ తదాజగ్ముర్విమానస్థా విష్ణుదూతాస్సుతేజసః॥

యమప్రేష్యాన్ విష్ణుదూతా వారయామాసురోజసా ।
అస్మాకం వశగోఽయంచ ఊచుస్తే యమకింకరాః ॥

తా॥ అంతలో తేజోవంతులైన విష్ణుదూతలు వచ్చి యమదూతలనుజూచి ఓయీ యీ అజామిళుడు మావాడుగాని మీవాడుగాడని పలికిరి.

శ్లో॥ తేస త్వైవిష్ణుపద్రాజన్ పద్మపత్రాయతేక్షణాః। పీతాంబరధరా ముఖ్యాః స్సర్వే పుష్కరమాలినః । కిరీటినః కుండలినః చారుస్రగ్వస్త్రభూషణాః। చతుర్భుజాశ్చారురూపాః శ్శంఖచక్రభుజశ్రియః । దేశంసుమిశ్రితాలోకాన్ కుర్వంతస్స్వేన తేజసా ।
దృష్ట్వాచవిష్ణుదూతాస్తే మాయావాక్యం సమబ్రువన్ ॥

తా॥ రాజా ! ఆవిష్ణుదూతలు పద్మములవలె విశాలములైన నేత్రములు గలవారును పచ్చని పట్టుబట్టలను ధరించినవారును, పద్మమాలాంకృతులును, కిరీటవంతులును, కుండలధారులును, మంచిమాలికలు వస్త్రములు, ఆభరణములు గలవారును నాలుగు చేతులుగలవారును సుందరదేహులును, శంఖచక్రములను ధరించినవారును, తమకాంతిచేత దేశమంతయు ప్రకాశింపచేయువారును, అయివుండిరి. యిట్టి విష్ణుదూతలను జూచి యమదూతలు యిట్లనిరి.

శ్లో॥ యూయంహిఉత దేవావా కిన్నరాసిద్ధచారిణాః।
ఇతి తేషాంవచశ్శ్రుత్వా తానవాదృత్యపుష్పకే।
అజామిళంసన్నివేశ్య గంతుకామావచోబ్రువన్ ॥

తా॥ మీరెవ్వరు కిన్నరులా! సిద్ధులా! చారణులా! దేవతలా! అనిఅడగగా యమదూతలను ధిక్కరించి విష్ణుదూతలు అజామిళుని తమ పుష్పక విమానము నెక్కించుకొని తమలోకమునకు పోవనిశ్చగలవారై యిట్లని పలికిరి.

ఇతి శ్రీ స్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే
అష్టమోఽధ్యాయస్సమాప్తః.

---

9. అథ నవమోఽధ్యాయ ప్రారంభః.

విష్ణుదూతా ఊచుః। శ్లో॥ భవతాంస్వామినా కింకిం వదత్వ కథితం యుతః కోహోత్ర యమదండస్య కేధర్మాః పుణ్యపాపకాః॥ నూనమస్మాకమగ్రేతు బ్రూతసర్వం యమానుగాః॥ ఇతి తైరుదితం శ్రుత్వా ఊచుస్తె యమకింకరాః॥

తా॥ విష్ణుదూతలడుగుచున్నారు ఓ యమదూతలారా! మీప్రభువు మీతో చెప్పిన మాటలేమిటి మీయమదండనకు యెవ్వఁడు తగినవాఁడు. పుణ్యాత్ములనగా యెవ్వి. పాతకములనగా యెవ్వి. యీవిషయములన్నిటిని సవిస్తారముగా మాకు చెప్పుడీ. యిట్లని విష్ణుదూతలడుగఁగా యమదూతలు చెప్పుచున్నారు.

యమదూతా ఊచుః॥ శ్లో॥ శ్రుణుధ్వమవధానేన విష్ణుదూతాస్సునిర్మలాః॥ పతంగఃపావకో వాయు ర్వ్యోమగావో నిశాపతిః॥ సంధ్యాహానీదిశఃకాల ఇతిదేహస్యసాక్షిణః ఏతై రధర్మో విజ్ఞాతః స్సవై దండస్యయుజ్యతే॥

తా॥ ఓవిష్ణుదూతలారా సావధానముగా వినుఁడు. సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, వాయువు, ఆకాశము, గోవులు, సంధ్యలు, పగలు, దిక్కులు, కాలము, యివి మనుష్యుని పుణ్యపాపములను గుఱించి సాక్షులు, మేము వీరి సాక్ష్యమును విచారించి పాపమును చేసిన వానిని దండింతుము.

శ్లో॥ స్వవేదమార్గరహితః శ్రుతిస్మృత్యాదిదూషకః।
నిందితస్సాధువృత్తానాం సమేదండ్యో నసంశయః॥

తా॥ వేదమార్గమును వదలి ఇచ్ఛానుసారముగా తిరుగుచు వేదశాస్త్రములను దూషించుచు సాధుబహిష్కృతుఁడైన వారిని మేము దండింతుము.

శ్లో॥ విప్రంచగురుమస్వస్థం పాదాద్యైర్యదితాడయేత్।
యోమాతాపితరౌద్వేష్టి సదండ్యోనాత్రసంశయః॥

తా॥ బ్రాహ్మణుని గురువును రోగిని పాదములచేత కొట్టువాఁడును తల్లిదండ్రులతో కలహించువాఁడును. అయిన వారిని మేము దండింతుము.

శ్లో॥ యోనిత్యమనృతంవక్తి ప్రాణిహింసాపరాయణః।
కులాచారపరిభ్రష్టస్సయాతియమమందిరం॥

తా॥ నిత్యము అబద్ధమాడుచు జంతువులను జంపుచు కులాచారము వదలిన వారిని మేము దండీతుము.

శ్లో॥ దత్తాపహారకోదంభో దయాశాంతివివర్జితః।
యఃపాపకర్మనిరతస్సయాతియమమందిరమ్।

తా॥ ఇచ్చిన సొమ్మును తిరిగి తీసుకున్నవానిని డాంబికుని దయాశాంతులు లేని వానిని పాపాత్ములను మేము దండింతుము.

శ్లో॥ పరదారాభిగమనం సభుం క్తేయమయాతనాన్।
యస్సాక్షికంవ దేద్దద్రిస్య లోభేనాత్యంతదుష్టధీః॥

తా॥ పరుని భార్యతో క్రీడించువానిని ద్రవ్యమును గ్రహించి సాక్ష్యము చెప్పువానిని మేము దండింతుము.

శ్లో॥ అహంతుదాససూ రేతి సభుం క్తేయమయాతనాం।
మిత్రద్రోహీకృతఘ్నశ్చ సభుం క్తేయమయాతనాం॥

తా॥ నేనుదాతనని చెప్పువానినిన్ని మిత్రద్రోహిని, ఉపకారమును మరచిన వానినిన్ని, అపకారమును చేయువానినిన్ని, మేము దండింతుము.

శ్లో॥ వివాహవిఘ్నంయఃకుర్యాత్సభుం క్తేయమశాసనం।
యోవాపరేషామైశ్వర్యం దృష్ట్వానూయేతదుష్టధీః॥

తా॥ వివాహమును చెరుపువానినిన్ని యితరుల సంపత్తులనుచూచి అసహ్యపడువారినిన్ని మేము దండింతుము.

శ్లో॥ పరేషామర్భకానాంచ సగచ్ఛేద్యమయాతనాం।
కన్యాద్రవ్యేణయోజీవేత్తథావార్ధుషికేనచ॥

తా॥ పరుల సంతానమును చూచి దుఃఖించువానిని కన్యాశుల్కములచేత జీవించువానిని వడ్డీతో జీవించువానిని మేము దండింతుము.

శ్లో॥ తటాకకూపకుల్యానాం విఘ్నమాచరతేచయః।
తద్ధాన్యవిఘ్నకర్తాచ పాతకీచనసంశయః॥

తా॥ చెరువును, నూతిని, స్వల్పకాలువలను, నిర్మించు వ్యాపారమును మాన్పించువాని నిర్మితములయిన వాటిని చెరుచువానిని మేము దండింతుము.

శ్లో॥ యఃపిత్ర్యాన్నసముద్దిశ్య శ్రాద్ధంమోహానవానరః॥
నిత్యకర్మపరిత్యాగీ సభుం క్తేయమశాసనం॥

తా॥ వ్యామోహముచేత మాతాపితరుల శ్రాద్ధమును విడచినవానిని నిత్యకర్మను వదలినవానిని మేము దండింతుము.

శ్లో॥ వరపాకపరిత్యాగీ పరపాకరతస్తథా।
పిత్రుశేషాన్నభోక్తాచ సభుం క్తేయమయాతనామ్॥

తా॥ పరపాక పరిత్యాగిని పరపాకరతుని పిత్రుశేషాన్నమును భుజించు వానిని మేము దండింతుము. పరిపాక పరిత్యాగియనగా తాను వండిన అన్నములో యితరులకు లేశమాత్రమును బెట్టక తానే అంతయు భుజించువాడు, పరపాకరతుడనగా నిత్యము

పరుల అన్నమును భుజించువాడు, శిశ్నశేషాన్నభోక్తయగా యితరులు శ్రాద్ధభోక్త లుభుజించిన తరువాత తాను శిష్టమును భుజించువాడు.

శ్లో॥ నదదస్వేతి యోబ్రూయా న్నదద్యాద్బ్రాహ్మణేషుచ।
శరణాగతహంతాచ సభుంక్తేయమయాతనామ్॥

తా॥ ఇతరులకు దానముచేయు సమయానయివ్వవద్దు అనిపలుకువానిని యాచించిన బ్రాహ్మణునకివ్వనివానినిశరణుజొచ్చినవానిచంపువానిని మేముదండింతుము.

శ్లో॥ స్నానసంధ్యాపరిత్యాగీ నిత్యంబ్రాహ్మణనిందకః॥
బ్రహ్మఘ్నశ్చాశ్వగోఘ్నశ్చ సయాతియమమందిరం॥

తా॥ స్నానమును సంధ్యావందనమును విడుచువానిని నిత్యము బ్రాహ్మణనిందకుని బ్రాహ్మణహంతను అశ్వహంతను గోహంతను మేము దండింతుము.

శ్లో॥ ఏవమాదీనిపాపాని యమేనోక్తానివైష్ణవాః॥
యేకుర్వంతియమేలోకే తేన్వభూయంతియాతనామ్॥

తా॥ ఈమొదలయిన పాతకములను చేయుమానవులు యామయ్యలోకమందు మాచేత యాతనల నొందుదురు.

శ్లో॥ అయంవిప్రాన్వయేజాతో దాసీపతిరజామిళః॥
అనేనార్జితపాపానాం సంఖ్యానాస్తినసంశయః॥
జన్మప్రభృతిజన్మాంతం పాపమేవముపార్జితం।
అయంవై విష్ణులోకస్య కథమర్హోతిదుష్టధీః॥

తా॥ ఈ అజామిళుడు బ్రాహ్మణుని వంశమందు జన్మించి దాసీ సంగతుడై జన్మమొదలు జన్మాంతము పాపములనే చేసినాడు యితనిచే చేయబడిన పాపములకు మితిలేదు. యట్టి దుష్టబుద్ధియుడు మీవిష్ణులోకమున కెట్లు అర్హుడగును.

శ్లో॥ ఇతి తేషాంవచశ్శ్రుత్వా విష్ణుదూతాశ్శుచిస్మితాః॥
మేఘగంభీరయావాచా ఊచుఃకిలముఖాంబుజాః॥

తా॥ ఈప్రకారముగా పలికిన యమదూతల మాటలు విని చిరునగవుతో వికసించిన ముఖపద్మములు గలవారై పురుషులతో సమాన గంభీరధ్వనితో యిట్లనిరి.

విష్ణుదూతాఊచుః॥ శ్లో॥ అహోఆశ్చర్యమేతద్ధి యద్యూయంమూఢచేతసః। శృణ్వంతుధర్మమర్యాదాం సమాధానేనచేతసా॥

తా॥ ఏమి ఆశ్చర్యము మీరింత మూఢులైరిగదా ధర్మమర్యాదను మేముచెప్పెదము సావధానముగా వినుడి.

శ్లో॥ యోదుస్సంగపరిత్యాగీ సత్సంగతిముపాశ్రయః॥
బ్రహ్మజ్ఞానంతతో నిత్యం నదండ్యస్సయమేనవై॥

తా॥ దుస్సంగమును విడుచువాడు సత్సంగమును ఆశ్రయించువాడు నిత్యము బ్రహ్మచింతనమును చేయువాడు యమదండార్హుడుగాడు.

శ్లో॥ స్నానసంధ్యాదినిరతో జపహోమపరాయణః॥
సర్వభూతదయాయుక్తో నసయాతియమాలయం॥

తా॥ స్నానసంధ్యా వందనము లాచరించువాడును జపహోమాదు లాచరించు వాడును, సర్వభూతములందు దయావంతుడును, యమదండార్హుడుగాడు.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయకర్మాణి సత్యవాగనసూయకః॥
జపాగ్నిహోత్రేయఃకుర్యాత్ నసయాతియమాలయం॥

తా॥ సత్యవంతుడై అసూయాదోషరహితుడై జపాగ్నిహోత్రములను చేయుచు కర్మలను బ్రహ్మయందుంచినవాడు యమదండార్హుడుగాడు. "బ్రహ్మణ్యాధాయ కర్మాణి బ్రహ్మణి సగుణే పరమేశ్వరే సర్వాణి కర్మాణి ఆధాయ కర్తృత్వం కారయితృత్వం భోక్తృత్వం భోజయితృత్వం స్థాపయిత్వా ఈశ్వరార్పణబుద్ధ్యాయత్కర్మ కర్తృత్వం తదేవాత్ర బ్రహ్మణ్యాధాయ కర్మాణీత్యస్య తాత్పర్యం భవతి అనగా కర్తృభోక్తృత్వాదులను సగుణ పరమేశ్వరునియందు స్థాపించి ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరించుటయె బ్రహ్మణ్యాధాయకర్మాణి అనుదానికి తాత్పర్యము అన్యథా బ్రహ్మశబ్దస్య నిర్గుణ పరమాత్మా యద్యర్థ ఇతిచేత్ శ్లోకార్థస్య ప్రతిపత్తిర్నభవేత్ అనగా అట్లుగాక బ్రహ్మశబ్దమునకు నిర్గుణ పరమాత్మను అర్థముగా చెప్పుకొన్న యెడల యీశ్లోకార్థమునకే పోనివచ్చును.

శ్లో॥ యోఽన్నదానదాతా నిత్యం వారిదానంప్రయత్నతః॥
గోదానంచవృషోత్సర్గం యఃకుర్యాన్నసపాతకీ॥

తా॥ అన్నదాన మాచరించువాడును, జలదాతయు, గోదానకర్తయు, వృషోత్సర్గకర్తయు యమదండార్హుడుగాడు.

శ్లో॥ విద్యాదానంచార్థికేభ్యః యఃకుర్యాద్భక్తిమాన్నరః॥
పరోపకారనిరతః నసయాతియమాలయం॥

తా॥ విద్యకోరినవారికి విద్యాదాన మాచరించువాడును, పరోపకారమందాసక్తి గలవాడును, యమదండార్హుడుగాడు.

శ్లో॥ యోవిష్ణుమర్చయేద్భక్త్యా తస్యాంగేజపముత్తమం।
వివాహోపనయనాకర్తా నసయాతియమాలయం॥

తా॥ హరిని బూజించువాడును, హరినామమును జపించువాడును, వివాహము లను ఉపనయనములను చేయువాడును యమదండార్హుడుగాడు.

శ్లో॥ యేనాథమంటపంమార్గే రాసనిర్మాణమేవచ।
అనాథప్రేతసంస్కారా న్నసయాంతియమాలయం॥

తా॥ మార్గమధ్యను మంటపములు కట్టించువాడును క్రీడాస్థానములను కట్టించు వాడును, దిక్కులేని శవమునకు మంత్రసంస్కారమును చేయించువాడును యమదండా ర్హుడుగాడు.

శ్లో॥ సాలగ్రామార్చనంనిత్యం తత్తీర్థంచపిబేన్నరః।
తస్యదండప్రణామంచ యఃకుర్యాన్నసపాతకీ॥

తా॥ నిత్యము సాలగ్రామార్చనమాచరించి ఆతీర్థమును పానము చేసి దానికి వందనమాచరించువాడు యమదండార్హుడుగాడు.

శ్లో॥ తులసీమణిమాలాంతు గళేధృత్వార్చయేద్ధరిం।
సాలగ్రామశిలాంవాపి నసయాతియమాలయం॥

తా॥ తులసీకాష్ఠమాలికను మెడయందు ధరించి హరినిపూజించువాడును సాల గ్రామమును బూజించువాడును యమదండార్హుడుగాడు.

శ్లో॥ యేషాంగృహేచతులసీ వర్తతేహరిసత్కథా।
గీతాపారపరాయేచ నతేయాంతియమాలయం॥

తా॥ గృహాంగణమందు తులసీవృక్షమును పెంచువారును హరికథను వినువారు ను, భగవద్గీతాపారాయణము చేయువారును, యమదండార్హులుగారు.

శ్లో॥ నిత్యంభాగవతంయస్య లిఖితంపుస్తకంగృహే।
తిష్ఠతేచార్చయేద్వాపి నసయాతియమాలయమ్॥

తా॥ భాగవతము వ్రాసి గృహమందు బూజించుచున్నను గృహమందుంచు కొన్నను యమదండార్హుడుగాడు.

శ్లో॥ తులాసంస్థేదినకరే మకరస్థేచభాస్కరే।
మేషసంక్రమణేభానౌ స్నానశీలానయాంత్యధః॥

తా॥ సూర్యుడు మేష తులా మకర సంక్రాంతులందుండగా ప్రాతస్స్నాన మాచరించువారు యమదండార్హులుగారు.

శ్లో॥ రుద్రాక్షమాలికాంధృత్వా కృతంయేనజపంశుభం।
దానహోమాదిపరోసిత్యం నసయాతియమాలయం॥

తా॥ రుద్రాక్షమాలికను ధరించి జపదానహోమాదుల నాచరించువాడు యమ దండార్హుడుగాడు.

శ్లో॥ అచ్యుతానంతగోవింద కృష్ణనారాయణావ్యయ।
ఇతి యోవదతే నిత్యం నసయాతి యమాలయం॥

తా॥ నిత్యము అచ్యుత, గోవింద, అనంత, కృష్ణ, నారాయణ, ఓరామ, అని హరినామసంకీర్తన మాచరించువారు యమదండార్హుడుగాడు.

శ్లో॥ యఃకర్ణికాయాంమ్రియతే మరణే హరిముచ్చరన్।
సర్వపాపరతోవాపి నసయాతి యమాలయం॥

తా॥ కాశియందు మణికర్ణికా ఘట్టమందు హరిస్మరణచేయుచుమృతినొందిన యెడల వాడు సర్వపాపములు చేసినవాడైనను యమదండార్హుడుగాడు.

శ్లో॥ స్తేనస్సురాపోమిత్రఘ్నో బ్రహ్మహాగురుతల్పగః।
స్త్రీరాజగురుగోహంతా యేచపాతకినః పరే॥
నామవ్యాహరణాద్విష్ణో ర్స్మరణేహ్యఘనిష్కృతిః॥

తా॥ దొంగ, కల్లుత్రాగువాడు, మిత్రహంతకుడు, బ్రాహ్మణహంత, గురుభార్యారతినిడు, స్త్రీహంత, రాజహంత, గురుహంత, గోహంత, మొదలైనపాపాత్ములు మరణకాలమందు హరిని స్మరించిన యెడల పాపవిముక్తులగుదురు.

శ్లో॥ అజ్ఞానాదథవాజ్ఞానా దుత్తమశ్లోకనామయత్।
సంకీర్తనాదఘహరం పుంసాందుష్కృతినామపి॥

తా॥ మహిమను తెలుసుకొనిగాని తెలియకగాని, హరినామసంకీర్తన గావించినవారు పాపాత్ములైనను ముక్తులగుదురు.

శ్లో॥ సాంకేత్యంపారిహాస్యంచ స్తోకంహేళనమేవవా।
వైకుంఠనామగ్రహణ మశేషాఘనివారణమ్॥

తా॥ హరినామమును సంకేతముచేతగాని, పరిహాసముచేతగాని, తెలిసిగాని, తెలియకగాని స్వల్పముగాగాని, అధికముగాగాని, యుచ్చరించువారు పాపముక్తులగుదురు.

శ్లో॥ పతితస్స్ఖలితోభగ్న స్సందష్టస్తప్తజాహతః।
హరిరిత్యవశేనాహ పుమాన్నార్హతియాతనామ్॥

తా॥ పడినప్పుడును, తొట్రుపాటుబొందినప్పుడును, కొట్టబడినప్పుడును, జ్వరాదులచేత పీడింపబడునప్పుడును, సప్తవ్యసనములచేత పీడింపబడునప్పుడు వశముకానినప్పుడు హరీ యని అన్నయెడల యమదండార్హుడుగాడు.

శ్లో॥ యచ్చిత్తేసర్వపాపాపి హరినామాన్యశేషతః॥

శ్లో॥ పాపానిజన్మాంతరసంచితాని యేనైవతన్నిష్కృతివర్జితాని
వ్రాయంతినామగ్రహణేనవిష్ణోర్మనుష్యలోకేదివివానసంశయః॥

తా॥ అనేక జన్మలలో సంపాదింపబడి ప్రాయశ్చిత్తములులేక కొండలవలె

పెరిగియున్న పాపములన్నియు భూమియందుగాని స్వర్గమందుగాని హరినామ సంకీర్తనముచేత నశించును.

శ్లో॥ గురూణాంచలఘూనాంచ పాపానాంనాశనాయచ।
యస్యసౌభగవన్నామ మ్రియమాణస్సుగృహీత్।
తేనపాపానినశ్యంతి వహ్నౌప్రక్షి ప్తతూలవత్॥

తా॥ మరణావస్థలోయున్నవాడు హరినామస్మరణమును చేసిన యడల వాని పాపములన్నియు అగ్నిలోవుంచిన దూదివలెనశించును.

శ్లో॥ ఇత్యుక్త్వా తేయమభటాణ్ విష్ణుదూతాస్సు తేజసః। హేమపుష్పకమధ్యస్థ మజామిళమతంద్రితాః। ఆహృత్యజగ్ముర్వైకుంఠం తదాహోజామిళోనృప। వవందేశిరసా దేవం కింకరాణ్ దర్శనోత్సుకః। అథాజామిళఆకర్ణ్య దూతానాం యమకృష్ణయోః। ధన్యోస్మ్యనుగృహీతోస్మి యుష్మత్సందర్శనాదహం॥

తా॥ విష్ణుదూతలిట్లు యమదూతలతో పలికి అజామిళుని యమదూతలవలన విడిపించిరి. తరువాత అజామిళుడు విష్ణుదూతలకు నమస్కారముచేసి మీదర్శనమువల్ల నేను తరించితినని చెను, తరువాత విష్ణుదూతలు వైకుంఠమునకు పోయిరి.

శ్లో॥ అథాజామిళఆకర్ణ్య దూతానాంయమకృష్ణయోః। అహో మేపరమంకష్టం యదభూదవిజితాత్మనః। ధిఙ్మాంవిగర్హితం సద్భిః దుష్కృతంకులకజ్జలం। హిత్వాబాలాంసతీంయోహం సురాపామసతీమిమాం॥ వృద్ధావనాధౌపితరౌ నాన్యబంధూత పాపినా। అహోమయాధునాత్యక్త్వావనభిజ్ఞేనసీచవత్।సోహం వ్యక్తంపతిష్యామి నరకేభృశదారుణే। ధర్మఘ్నాఃకామినో య విందంతియమయాతనామ్॥

తా॥ తరువాత అజామిళుడు యమదూత విష్ణుదూతల సంవాదమునువిని ఆశ్చర్యపడి అయ్యోయెంతకష్టమాయెను, ఆత్మహితముచేసికొనలేకపోతినిగదా ఛీఛీనాబ్రతుకు సజ్జననిందితమాయెగదా పతివ్రతయైనభార్యనువదలివేసి కల్లుదాగెడిదాసీభార్యను స్వీకరించితినిగదా వృద్ధులును నాకంటె వేరేదిక్కులేనివారును పుణ్యాత్ములయినమాతాపితరులను నీచుడనై విడిచితినిగదా అయ్యో! యెంతకష్టము ధర్మహంతలును కాములును అనుభవించెడి నరకమందిప్పుడు నేను నిశ్చయముగా పడెదను.

శ్లో॥ కిమిదం స్వప్న ఆహోస్విత్ సాక్షాద్దృష్టమిహాద్భుతం। వాక్వ
ద్యయాతాఅద్యయేమాంవ్యాకృష్యతే కృష్ణఘోరాసిపాణయః॥ పురామ
యాకృతేనైవ ధాన్యంపుణ్యేనకర్మణా। అన్యథామ్రియమా
ణస్య నస్మృతిర్వృషలీపతేః॥ వైకుంఠనామగ్రహణం జిహ్వా
వక్తుమిహార్హతి॥ క్వచాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిర
పత్రపః। క్వచనారాయణేత్యేవ భగవన్నామమంగళం॥

తా॥ ఇదియేమి ఆశ్చర్యము యిది స్వప్నమా ఆసల్లకత్తులను ధరించిన యమభటులెట్లుపోయిరి. నేను పూర్వజన్మమందు పుణ్యమాచరించినవాడను యిది నిజము అట్లు గానిచో దాసీపతినైన నాకు మరణకాలమందు హరిస్మృతియెట్లుగలుగును, నాజిహ్వ హరినామమును యెట్లుగ్రహించును, పాపాత్ముడనైన నేనెక్కడ అంత్యకాలమందీ స్మృతియెక్కడ, లజ్జనువిడచి బ్రాహ్మణులను చంపు నేనెక్కడ, మంగళకరమైన నారాయణనామ మెక్కడ.

శ్లో॥ ఇత్యుక్త్వాభగవద్భక్తిం మాలంబ్యాత్మనమాత్మని।
తతస్సాయుజ్యపదవీం లేభేయన్నామకీర్తనాత్॥
నారాయణేతియన్నామ జగదచ్యుతరక్షణం।
యాతివిష్ణోఃపదంరాజన్ నిర్ధూతాశేషకిల్బిషః॥

తా॥ అజామిళుడిట్లు విచారించి నిశ్చలమైన భక్తినొంది జితేంద్రియుడై కొంత కాలమునకు సాయుజ్యముక్తిని బొందెను. కాబట్టి నారాయణ నామకీర్తనము గావించువారు సమస్తపాతకముక్తులై వైకుంఠలోకమునొందుదురు ఇందు సందియ మెందును లేదు.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే నవమోధ్యాయ
స్సమాప్తః.

---

## 10. అథ దశమోఽధ్యాయారంభః.

జనకఉవాచ॥ శ్లో॥ కోసావజామిళః పూర్వం ముముక్షుం కేనసంచితం।
కథంతూష్ణీంగతాయామ్యాః కిమూచుస్స్వామిన్ వద॥

తా॥ జనకుండు తిరిగి అడుగుచున్నాడు. మునీశ్వరా! యీ అజామిళుడు పూర్వ మందెవ్వడు, యితడేమి పాపములు చేసెను, విష్ణుదూతలు చెప్పిన మాటలనువిని, యమభటులు యెందుకు యూరకుండిరి, యమునివద్దకుపోయి యమునితో ఏమని చెప్పిరి.

వసిష్ఠఉవాచ॥ శ్లో॥ ఏవంప్రచోదితాయామ్యా ద్రుతంగత్వాయమాం తికం। యమరాజాయతత్సర్వ మాచచక్షురరిందమ॥

తా॥ వసిష్ఠుండు చెప్పుచున్నాండు. యమదూతలు విష్ణుదూతల మాటలువిని శీఘ్రముగా యమునివద్దకుబోయి సర్వవృత్తాంతమును యమునితోచెప్పిరి.

శ్లో॥ పాపిష్ఠంచదురాచారం నిందితంకర్మచాశ్రితం।
తంవిష్ణుదూతావై జగ్మ ర్వైకుంఠంవిష్ణుమందిరం॥
వయంతత్కార్యకరణా శ్శక్తిహీనాఃపునఃపునః॥

తా॥ అయ్యా పాపాత్ముండును దురాచారుండును నిందితకర్మల నాచరించువాండును, అగు అజామిళునితోడి తెచ్చుటకుపోయినంతలో విష్ణుదూతలువచ్చి మమ్ములను ధిక్కరించి అతనిని విడిపించిరి మేమువారిని ధిక్కరించుటకు అశక్తులమై వచ్చితిమి.

శ్లో॥ తచ్ఛ్రుత్వాకోపతామ్రాక్షః జ్ఞానచక్షుర్దదర్శనః।
మ్రియమాణస్యదుర్బుద్ధే ర్విష్ణునామప్రభావతః।
విష్ణుదూతా స్తమాదాయ యయుర్వైకుంఠమందిరం।
హరినామస్మృతంచైవ మృతికాలేహ్యజామిళః।
ససర్వపాపనిర్ముక్తో విష్ణులోకంగతో౽ధునా॥

తా॥ ఆమాటనువిని కోపించి యముండు జ్ఞానదృష్టితోచూచి యిట్లనియె, యీ అజామిళుండు దుర్మార్గుండైనను అంతకాలమందు హరినామస్మరణచేయుటచేత పాపములను నశింపచేసి వైకుంఠప్రియుండాయెను. అందువలననే అతనినివిష్ణుదూతలుస్వీకరించిరి.

శ్లో॥ హరిర్హరతిపాపాని దుష్టచిత్తైరపిస్మృతః।
అనిచ్ఛయాపిసంస్పృష్టో దహత్యేవహిపావకః॥

తా॥ దుష్టాత్ములై మహిమను తెలిసికొనక హరినామస్మరణ చేసినను పాపములు నశించును, దహనేచ్ఛలేకపోయినను తాకినయెడల అగ్ని కాల్చకమానునా.

శ్లో॥ యస్స్మరేద్భక్తిభావేన నారాయణమనామయం।
జీవన్ముక్తస్సవిజ్ఞేయః పశ్చాత్కైవల్యమశ్నుతే॥

తా॥ భక్తితో నారాయణ స్మరణ చేయువాండు జీవన్ముక్తుండై అంతమందు మోక్షము నొందును.

శ్లో॥ ఇత్యాలోచ్యతతస్తూష్ణీ మాసీద్వైవస్వతోయమః॥

తా॥ యముడిట్లు విచారించి యూరకుండెను.

శ్లో॥ అసావజామిళః పూర్వం విప్రస్సౌరాష్ట్రకే పురే। శివాగారార్చకో నిత్యం శివద్రవ్యాపహారకః॥ అస్త్రపాణిర్దురాచార స్స్నానహీనో తథాఽశుచిః। సమంత్రో విధిశ్శంభు మర్చయత్యస్య మానసః। మృడస్యాభిముఖే పాదౌ ప్రసార్యాస్తే సదుర్మదః। వయస్యైరన్వితో రాజన్ బహుభాషీదురాగ్రహః। రూప యౌవనసంపన్నో నానాలంకారభూషితః॥

తా॥ అజామిళుడు పూర్వజన్మమందు సౌరాష్ట్రదేశమందు బ్రాహ్మణుడై యుండి శివార్చకుడుగానుండి శివద్రవ్యమును హరించుచు స్నానసంధ్యలనువిడిచి అన్యమానసుడై శివుని పూజించుచు శివునకభిముఖముగా కాళ్లుచాపుకొనిశయనించుచు ఆయుధపాణియై స్నేహితులతోగూడి నానాలంకారమండితుడయి యిచ్ఛావిహారముల తిరుగుచు బహుభాషియై మంచియావనముతో నుండెను.

శ్లో॥ తత్రకాచిద్ద్విజసతీ సురూపాప్రాప్తయౌవనా।
పతిస్తస్యాహిదుఃఖేన దారిద్ర్యేణాతిపీడితః॥
అన్యాన్నంచైవమాకాంక్షన్ పర్యటన్ పత్తనాదిషు।
ఘోషగ్రామాదిసర్వేషు యాచనావృత్తిమాశ్రితః॥

తా॥ ఆవూరిలో యొక బ్రాహ్మణుడుండెను అతనికొకరూపవతియు యౌవనవతియునగు భార్యగలదు ఆబ్రాహ్మణుడు దరిద్రపీడితుడై అన్నముకొఱకై పట్టణములు గ్రామములు పల్లెలు తిరుగుచు యాచించుచుండెను.

శ్లో॥ కదాచిత్క్షుధయాక్రాంతో భారవాహో గృహంగతః।
ఉవాచభార్యాంశీఘ్రేణ కురుపాకంతుమంగళే॥
బాధతేమాంక్షుధాశుభ్రు తచ్ఛాంతింకురువారిణా॥

తా॥ ఒకానొకప్పుడు బ్రాహ్మణుడు సంపాదించిన ధాన్యాదికమును శిరస్సున వుంచుకొని ఆకలితో యింటికివచ్చి భార్యతో ఓసీ నాకాకలి అగుచున్నది త్వరగా వంటచేయుము ముందు మంచినీళ్లు యివ్వుము యిది దాహమును కొంచము శాంతించెడను

శ్లో॥ ఇతితస్యవచశ్శ్రుత్వా చుల్లీకృత్యాతిదుర్మదా।
కించిన్నోవాచతంవిప్రం గృహకర్మరతాశనైః।
చిత్తంవిటజనేసమ్య గాధాయాతీవదుర్మదా॥

తా॥ భర్తయిట్లు యెన్నిమారులడిగినను భార్య అతని మాటను లెక్కచేయక పనులు చేయుచు జారుని మనసులో ధ్యానించుచు యూరకుండెను.

శ్లో॥ తాం కర్కశాం తదా దృష్ట్వా యష్టిమాదాయ తాడయన్।
సా పునః పతిమావిశ్య దృఢం ముష్ట్యాహనత్పునః॥

తా॥ అంత భర్త కోపించి దండముతో భార్యను గొట్టెను భార్య భర్తను ముష్టితో గుద్దెను

శ్లో॥ తేన స్వభవనం హిత్వా యయౌ గ్రామాంతరం ద్విజః।
భిక్షాన్నభోజనం కృత్వా చింతయన్మనసా స్పృహ॥

తా॥ తరువాత భర్త గృహమును విడిచి గ్రామాంతరంబోయి అచ్చట భిక్షమునెత్తుకొని జీవించుచు భార్యా సంగతినిగూర్చి చింతించుచుండెను.

శ్లో॥ సా సాయమశనం కృత్వా హ్యలంకృత్వా సువాససా।
తతస్తాంబూలమాదాయ రజకాలయమాగమత్॥

తా॥ భార్యయు సుఖముగానుండి రాత్రి భుజించి మంచిచీర ధరించి తాంబూలము భక్షింపుచు యొకచాకలివాని యింటినిగూర్చి బోయెను.

శ్లో॥ రజకం రూపసంపన్నం రహస్యోవాచ సా నిశి।
కిమత్రాగమనం మూఢే గృహే స్మిన్ కారణం వినా।
బ్రాహ్మణీ బ్రహ్మకులజా కర్మణా నిందితా వయం॥

తా॥ సుందరుడయిన చాకలివానినిజూచి రాత్రి నాతో సంభోగించుమనెను, ఆమాటవిని వాడు ఓతల్లీ! నీవు బ్రాహ్మణురాలవు, నీవు అర్ధరాత్రివేళ మాయింటికి మీరు రావచ్చునా, మీరు గొప్పకులమునందు బుట్టినవారు, మేము నీచులము కాబట్టి యిట్టి సంపర్కము మీకు తగునా.

శ్లో॥ ఏవం వివాదమానే తు దృష్ట్వా తద్ధర్మచారిణం। కోపరక్తాంతనాసం చ సంరక్తాంబరలోచనం। గృహీత్వా ముసలం శీఘ్రం తాడయామాస కోశలాత్। స్నానమాస తత్రుహాతం చ హిత్వా రాజపథం గతా। తత్రే మం దేవలం గత్వా తస్యసా పాణిమగ్రహీత్॥ పశ్చాదాగత్య వేదేన తేన సా వ్యర్థమున్నిశి। రాత్రిశేషం తతో నీత్వా బ్రాహ్మణీ వ్యభిచారిణీ। పశ్చాత్తాపం గతా రాజన్ ప్రభాతే తిపమాగమత్। పతిం సంబోధయామాస వాక్యైస్సాధుకృపోదయైః తయా స్వగృహం భూయో గత్వా వాత్సీద్యథా సుఖం॥

తా॥ ఈప్రకారముగా [illegible] వానిని కొట్టెను, అది యెరుగని [illegible] రాజమార్గమున బోవుచుండగా పైని చెప్పిన శివార్చకుడు చూచెను, అంతలో ఆస్త్రీ వాని పట్టుకుని గతిరేళికి రమ్మన మని పిలుచుకొనిపోయి వానితో భోగించి రాత్రియంతయు వానితో కాలక్షేపముచేసి తెల్లవారగానే పశ్చాత్తాపమును బొంది భర్తవద్దకుబోయి ఆయనను బ్రతిమాలి ఆయనతోగూడా గృహమందు సౌఖ్యముగానుండెను.

శ్లో॥ ఏవమంతరితే కాలే శివాగారార్చకో నృప। గతాసుర భవద్రాజ న్నిరయే యాతనామయే। భుక్త్వాతత్ర క్రమాత్పాపం ఘోరవ్యాదిష్వభూపతే। సపునర్భువమభ్యేత్య సత్యనిష్ఠసుతోభవత్। కార్తికే కృత్తికాయోగే సకుర్యాత్స్వామిదర్శనం। సప్తజన్మగతంపాపం హంతి హ్యేతద్ద్విజన్మనః। పశ్చాద్భూమింగతో రాజన్ భగవన్నామకీర్తనాత్॥

తా॥ తరువాత కొంతకాలమునకు శివార్చకుఁడు మృతినొంది యమలోకమందు క్రమముగా రౌరవాది నరకదుఃఖముల ననుభవించి తిరిగి భూమియందు సత్యనిష్ఠుని కొడుకు అజామిళుడయి జన్మించెను, యితనికి కార్తీకపూర్ణిమనాడు శివదర్శనము లభించినది, అంతకాలమందు హరినామస్మరణ గలిగినది, ఆ హేతువులచేత సప్తజన్మార్జిత పాపజాలములు నశించి మోక్షమును బొందెను.

శ్లో॥ ఏషావిప్రవధూపాపా కాలధర్మాత్ క్షయంగతా। నరకేయాతనాంభుక్త్వా పునర్భూమిముపాగతా। చండాలయోనౌ సంజాతా కన్యాకుబ్జేనరేశ్వర। చండాలః కాలశుద్ధ్యర్థం గత్వావిప్రమపృచ్ఛత। సజగాదాంత్యజంరాజన్ పితృగండంభవిష్యతి। శుభ్యేతంత్వరితో భాగ్యాచ్ఛిశుః నిష్కాస్యదూరతః। రాజన్ క్షత్రద్విజః కశ్చిత్ పుత్రహీనో దదర్శతం। శిశుంబాల్యేత్యానా న్యత్వా దోహదమానంసమగ్రహీత్। దత్వోపమాతృహస్తేచ సూద్రాద్యాసమ్యక్ప్రపోషితః। వృద్ధింగతాయాస్తద్దాస్యా ప్రహ్వోయమభవత్పతిః॥

తా॥ ఆబ్రాహ్మణియు కొంతకాలమునకు మృతినొంది నరకములందనేక యాతనలనొంది తిరిగి భూమియందు కన్యాకుబ్జమందు చండాలునకు పుత్రికగా జన్మించెను.

చండాలుఁడు యిది పుట్టిన సమయము మంచిదాయని యొక బ్రాహ్మణునినడిగెను అతడు యిది తండ్రిగండాన పుట్టినదని చెప్పెను, ఆమాటవిని చండాలుడు ఆశిశువును తీసికొని పోయి అరణ్యమందుంచెను, అంతలోయొక బ్రాహ్మణుఁడుజూచి రోదనము చేయుచున్న ఆశిశువును తీసికొనిపోయి తనయింట్లో దాసీగావున్న యొక స్త్రీకిఅప్పగించెను ఆదాసీది దీనిని పెంచినది, తరువాత దీనినిఅజామిళుడుదగ్గి రపడితీసెనుతరువాతకథపూర్వోక్తమేను.

శ్లో॥ ఏతత్తేకథితంసర్వం రాజన్జన్మాంతరార్జితం।
యానిపాపానిరాజేంద్ర జన్మాంతరకృతానివై ।
ప్రాయశ్చిత్తాన్యశేషాణి విష్ణుధ్యానంవినానృప॥

తా॥ రాజోత్తమా యిది నీవడిగిన ప్రశ్నకు సమాధానము అజామిళునిపూర్వ వృత్తాంతము, పాపములకు ప్రాయశ్చిత్తములు వేయుట హరినామ కీర్తనము వినగాను అనగా హరినామకీర్తన గావించిన యెడల ప్రాయశ్చిత్తములతో పనిలేదు. అదిగాని యెడల ధర్మశాస్త్రోక్త ప్రాయశ్చిత్తములు చేయవలెనని భావము.

శ్లో॥ జిహ్వానవక్తియది మాధవనామధేయంచేతశ్చ।
నస్మరతిమాధవపాదపద్మం శ్రోత్రంకథాంనచశృణోతి।
హరేర్న రేంద్రపాపాని తస్యవిలయంతుకథంప్రయాంతి॥

తా॥ ఎవ్వనియొక్క నాలుక హరినామ కీర్తనము చేయదో, మనస్సు హరిపాద పద్మమును స్మరించదో, చెవులు హరిచరిత్రములను వినవో, వానిపాపములు యెట్లుగా నశించును అనగా నశించవు.

శ్లో॥ అనన్యచేతాస్సతతం యేస్మరంతిజనార్దనం।
లభంతేతేననిర్వాణం నాత్రకార్యావిచారణా॥

తా॥ యితర చింతను మాని హరిని స్మరించువారు ముక్తినొందెదరు. యిందుకు సందియము లేదు.

శ్లో॥ తస్మాద్గురుంవా లేశంవా నిహనిష్యతిపాతకం।
కార్తికేమాసియత్ప్రోక్తం ధర్మంసూక్ష్మతయానఘ॥

తా॥ కాఁబట్టి కార్తికమాసమం దాచరించిన ధర్మము సూక్ష్మమైనను అది గొప్పదిగాని కొద్దిదిగాని అయిన పాతకము నంతను నశింపచేయును.

శ్లో॥ పాపానాందహనేశక్తి రస్తిరాజన్నసంశయః।
తస్మాత్కార్తికమాసేతు యోధర్మంనసమాచరేత్।
సయాతినరకంరాజన్ నాత్రకార్యావిచారణా॥

తా॥ కార్తిక ధర్మములకు పాపములను నశింపజేయు సామర్థ్యమున్నది, కాబట్టి కార్తికమాసమందు ధర్మమాచరించనివాడు నరకము నొందును యని నిశ్చయము.

శ్లో॥ ఇదంయఃపుణ్యమాఖ్యానం శ్రుణోత్యఘవినాశనం।
సనర్వపాపనిర్ముక్తో యాతివైకుంఠమందిరమ్॥

తా॥ పాపములను నశింపజేయు యీకథను విన్నవారు సమస్త పాతకములను నశింపచేసి మోక్షమొందుదురు.

శ్లో॥ యఇదంపుణ్యమాఖ్యానం శ్రావయేద్వాసమాహితః।
తేనపాపానినశ్యంతి విష్ణునాసహమోదతే॥

తా॥ ఈకథను వినుపించువాడు పాపముక్తుడై వైకుంఠమందు విష్ణువుతో సుఖించును.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే దశమోధ్యాయ స్సమాప్తః.

---

॥ అథ ఏకాదశాధ్యాయారంభః.

వసిష్ఠఉవాచ॥శ్లో॥ భూయశ్శృణుష్వరాజేంద్ర పుణ్యంకార్తికసంభవం।
కార్తిక్యామతిసీపుష్పై రర్చయేద్యోజనార్దనం।
తస్యపాపానినశ్యంతి చాంద్రాయణఫలంలభేత్॥

తా॥ రాజోత్తమా తిరిగి చెప్పెదను వినుము కార్తికమాసమందు అవిసెపువ్వులతో హరినిపూజించినచో వానిపాపములు నశించి చాంద్రాయణఫలముగలవాడగును.

శ్లో॥ యోదుర్వాగ్రైఃకుశాగ్రైశ్చ పూజయేత్కార్తికేచ్యుతం।
సనర్వపాపనిర్ముక్తో యాతితత్పదమవ్యయమ్॥

తా॥ కార్తికమాసమందు గరికతోను కుశలతోను హరినిపూజించువాడు పాపముక్తుడై వైకుంఠము జేరును.

శ్లో॥ యోర్చయేదచ్యుతంభక్త్యా కార్తికేరాజసత్తమ।
వస్త్రైర్విచిత్రవర్ణైశ్చ సలభేత్ఫలముత్తమమ్॥

తా॥ కార్తికమాసమందు చిత్రిరంగులలో గూడిన వస్త్రములను హరికి సమర్పించినవాడు మోక్షమొందును.

శ్లో॥ కార్తికేమాసియస్స్నాత్వా దీపమాలాభిరర్చయేత్।
యశ్శ్రావయేత్పురాణాంశ్చ యఃకుర్యాచ్ఛ్రవణంతథా।
సర్వపాపవినిర్ముక్త స్తత్పదంయాతిభూమిప॥

తా॥ కార్తీకమాసమందు స్నానమాచరించి హరిసన్నిధిలో దీపమాలల నుంచువాడును, పురాణము చెప్పువాడును, పురాణము వినువాడును, పాపములన్నియును నశింపచేసికొని పరమపదమును బొందుదురు.

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనం।
పాపఘ్నమహదాశ్చర్య మాయురారోగ్యవర్ధనమ్॥

తా॥ ఈవిషయమై యొక పూర్వకథగలదు అది విన్నమాత్రమున నానేక పాపములనుపోవును, ఆయురారోగ్యములను యిచ్చును. బహుఆశ్చర్యకరముగానుండును అది చెప్పెదను వినుము.

శ్లో॥ కశ్చిత్కళింగదేశస్థో బ్రాహ్మణోమందరాహ్వయః।
స్నానసంధ్యావిహీనస్సన్ పరేషాంభృత్యతాంగతః॥

తా॥ కళింగదేశమందు మందరుడను నొకబ్రాహ్మణుడు గలడు. అతడుస్నానసంధ్యావంధనాదులను విడిచి యితరులకు కూలిచేయుచుండెడివాడు.

శ్లో॥ తస్యభార్యాసుశీలాచ పాతివ్రత్యపరాయణా।
సర్వలక్షణసంపన్నా నారీణాముత్తమావధూః॥

తా॥ అతనికి మంచిగుణములు గలుగుటచేత సుశీలయను పేరును వహించిన నొక భార్యవుండెను ఆమెపతివ్రితయు సమస్తసాముద్రిక లక్షణములతో కూడినదై ఆడవారిలో శ్రేష్ఠురాలై యుండెను.

శ్లో॥ నాసూయాంకురుతేక్వాపి పతినారాజసత్తమ।
సతథాజీవనోపాయం జానీతేసకదాచన।
ఖడ్గపాణిశ్చకాంతారె చౌర్యవిత్తముపాశ్రియన్।
పాంథాంనాంబాధతేనిత్యం హత్వావస్త్రానివైనృజ॥

తా॥ ఆసుశీల భర్తదుర్గుణ పూర్ణుడైనను అతనియందు ద్వేషమును వుంచక సేవించుచుండెను, తరువాత వాడు కూలి జీవనము కష్టమని తలచి కత్తినిధరించి అడవిలో మార్గమును కనిపెట్టుకునివుండి దారినడుచువారిని కొట్టి వారిధనములను అపహరించుచు కొంతకాలము గడపెను.

శ్లో॥ గత్వాన్యదేశంబలవాన్ క్రీత్వావస్త్రానిసర్వశః।
తేనోపజీవనంకుర్వన్ కుటుంబభరణాతురః॥

తా॥ అట్లు చౌర్యము వలన సంపాదించిన వస్తువులను యితరదేశమునకు పోయి అమ్ముకొని ఆధనములో కుటుంబమును పోషించుచుండెను.

శ్లో॥ పాంథంకంచిద్ద్విజందృష్ట్వా ఖడ్గపాణిస్సకానన। తమభ్యేత్యాశుసంగృహ్య వత్రెబధ్వాహరద్ధనం॥ తందృష్ట్వాలుబ్ధకఃకశ్చిచ్ఛూరశ్చాపధరశ్శఠః। స్వయంజగ్రాహతత్సర్వం తౌహత్వా దుష్టధీర్నృప। వ్యాఘ్రస్తదాగుహాంతస్థో వ్యాజగామగుహాద్బహిః। తద్గంధమాఘ్రాయాగత్య వ్యాఘ్రందృష్ట్వాగ్రహీన్నృప। సోపిఖడ్గేనతంవ్యాఘ్రమహాసత్రోక్రోధసంయుతః। అన్యోన్యాఘాతదోషేణ కాలస్యాయతసంగతౌ॥

తా॥ ఒకప్పుడు ఆబ్రాహ్మణుడు నాగ్యానులోనున్న మార్గమును కనిపెట్టుకుండి మార్గానవచ్చె వకబ్రాహ్మణుని పట్టుకుని మఱ్ఱిచెట్టుకు కట్టి అతని సొమ్మంతయు హరించెను, యింతలోనే క్రూరుడైన కిరాతుడొకడు వచ్చి ఆయిద్దరు బ్రాహ్మణులను చంపి ఆధనమంతయు తాను హరించెను. తరువాత గుహలోవున్న పెద్దపులి కిరాత మనుష్య గంధమును ఆఘ్రాణించి వచ్చివానిని కొట్టెను, కిరాతుడును కత్తితో పులిని కొట్టెను, యిట్లు యిద్దరు పరస్పర ప్రహారముల చేత ఒకమారే చనిపోయిరి.

శ్లో॥ తావేకకాలేహ్యేకత్ర ద్వావిప్రౌవ్యాఘ్రలుబ్ధకౌ। జగ్ముర్మరణమేకత్ర కాలసూత్రంతతఃపరమ్॥

తా॥ యిట్లు యిద్దరు బ్రాహ్మణులు పులి కిరాతుడు నలుగురు వకచోట మృతినొంది యమలోకమును బోయి కాలసూత్ర నరకమందుబడిరి.

శ్లో॥ తత్రైవకూపెక్రిమివిష్ఠసంకులే మహాభయధ్వాంత సుతప్తరక్తకే। నిమగ్నయామాసురథోపరంతాః దుఃఖాన్వితాః పాపభరేణభూపతే॥

తా॥ యమభటులు వారినందరిని పురుగులతోను అమేధ్యముతోను కూడినటువంటి భయంకరమైన చీకటిలో తప్తరక్తకూపమందు పడవైచిరి.

శ్లో॥ సావిప్రపత్నీసకలైశ్చ ధర్మైరాచార నిష్ఠాహరిభక్తిసంస్థా। సత్సంగసలాపముపాశ్రితాజనైస్సదాపతిధ్యానపరావరేశ్వర॥

తా॥ జనకమహారాజా ఆబ్రాహ్మణుని భార్య సమస్త ధర్మములను చేయుచు ఆచారవంతురాలై హరిభక్తియుతయై సజ్జన సహవాసము చేయుచు నిరంతరము భర్తను ధ్యానించుచుండెను.

శ్లో॥ అస్యాగృహంయతిఃకశ్చిదాగతోదైవయోగతః। విష్ణుదేవంస్మరన్నుచ్చైః ప్రనృత్యన్పులకాంకితః॥

విష్ణుభక్త్యామృతంపీత్వా విష్ణుంసర్వత్రచింతకః।
రోమాంచితతనుర్భూప ఆనందాశ్రుతులేక్షణః॥

తా॥ ఓ రాజా యిట్లుండగా దైవవశముచేత ఒకయతీశ్వరుండు హరినామస్మరణ చేయుచు నాట్యము చేయుచు పులకాంకిత శరీరుండై హరినామామృతమును పానము చేయుచు సమస్త వస్తువులందు హరిని దర్శించుచు ఆనందబాష్పయుతుండై ఆమె యింటికి వచ్చెను.

శ్లో॥ తందృష్ట్వాసాచ తేభ్యోన్నం దత్వోవాచయతించసా।
భవదాగమనంమహ్యం దుర్లభంగృహమేధినాం।
గృహీనాస్త్యత్రగేహేస్మిన్ ఏకాకీతత్పరాయణా॥

తా॥ ఆమెయు ఆయతినిచూచి భిక్షమిడి అయ్యా యతి పుంగవా మీరు మా యింటికి వచ్చుటచేత నేను తరించినాను మీవంటివారి దర్శనము దుర్లభము మాయింటి వద్ద నాభర్త లేడు నేనొకదానినే పతిధ్యానమును చేయుచున్నదానను.

శ్లో॥ ఏవముక్తస్తయాయోగీ శ్యామాంతుప్రియవాదినీం।
శృణుభద్రేవక్ష్యామి మహార్థమింవమందిరే।
దినాంతేవిష్ణుపురతః పురాణపఠనంమయా।
కార్యంతదర్థందీపస్య వర్తింకృత్వాదదస్వమే।
అనేన్యామ్యహమేవాత్ర తైలంతద్భక్తికారకః।
ఇదానీంకార్తికేమాసి పౌర్ణమీవర్తతేశుభా॥

తా॥ ఆమె యిట్లు చెప్పగా విని యతీశ్వరుఁడు ప్రియభాషిణియు శ్యామయు నైన ఆమెతో యిట్లనియె. అమ్మాయీ యీరోజు కార్తీక పూర్ణిమ, మహాపర్వము యీదినసాయంకాలము హరిసన్నిధిలో మీయింట్లో పురాణ పఠనము జరుగవలెను, ఆపురాణమునకు దీపముకావలెను నూనె నావద్దయున్నది గనుక నీవువత్తినిచేసియివ్వుము అనిచెప్పెను శ్యామయనగాయౌవనవతియనిఅర్థము, శ్యామాయౌవనమధ్యస్థేతినిఘంటుః

శ్లో॥ ఇతితస్యవచశ్శ్రుత్వా జాతహర్షాన్వితాన్రృప।గృహసంమార్జనంసమ్యగ్గోమయేనోపలిప్యచ । రంగవల్ల్యాస్వస్తికాద్యైరలంకృత్యతతఃపరమ్ । తూలంసంశోధ్యవిధివ ద్వర్తిద్వయమరిందమ । తేనానీతేనతైలేన దీపంసావిష్ణవేర్పయత్ ॥

తా॥ యతీశ్వరుఁడిట్లుచెప్పఁగా ఆచిన్నదివిని సంతోషముతో గోమయము తెచ్చి ఆయిల్లు చక్కఁగా అలికినది ఆందుమీద పంచవర్ణంగులతోను ముగ్గులను బెట్టి పీమ్మట

దూదెని పరిశుద్ధము చేసినదై ఆమాదిచే రెండువత్తులనుచేసి నూనెతో యతీశ్వరునివద్ద వెలిగించి స్వామికి సమర్పించెను.

శ్లో॥ దీపపాత్రంతథావర్తిం స్వయందత్వామహామణా।
ప్రజ్వాల్యపావకంభక్త్యా జ్వాలాంచసమయోజయత్॥

తా॥ ఆచిన్నది దీపపాత్రను, వత్తినిన్ని తాను యిచ్చినందుకు చాలాసంతోషించి దీపమును వెలిగించెను.

శ్లో॥ తత్ప్రకాశస్థలేయోగీ సమర్చ్యజనార్దనం।
పురాణపఠనంతత్ర చకారాత్మవిశుద్ధయే॥

తా॥ యతియు ఆదీపము ముందరను హరిని బూజించి మనశ్శుద్ధికొఱకై పురాణపఠన మారంభించెను.

శ్లో॥ గృహంగృహాంతతోగత్వా జనానాహూయసాసతీ।
పురాణశ్రవణార్థంతు శుశ్రావచజనైస్స్వయమ్॥

తా॥ ఆమెయు ప్రతియింటికిబోయి పురాణశ్రవణమునకురండని బహుమందిని పిలుచుకునివచ్చి వారితోసహా ఏకాగ్రమనస్సుతో పురాణమును వినెను.

శ్లో॥ అనన్యబుద్ధ్యారాజేంద్ర స్వయమేవయథాగతః।
పశ్చాదంతరితేకాలే కాలధర్మేణసానృప।
మమారవిష్ణుధ్యానేన జ్ఞానేనాత్యంతనిర్మలా॥

తా॥ తరువాత యతీశ్వరుడు యథేచ్ఛగాపోయెను కొంతకాలమునకు హరిధ్యానముచేత జ్ఞానమును సంపాదించుకొని ఆమెమృతినొందెను.

శ్లో॥ తదాజగ్ముర్విష్ణుదూతాశ్శంఖచక్రాంబుజశ్రియః। చతుర్భుజారవిందాక్షాః పీతాంబరధరాశ్శుభాః। మనోహరేణదివ్యేన విమానేనార్కవర్చసా। నానాపుష్పఫలైస్తద్వదమరోద్యానసంభవైః। ప్రవాళముక్తామణిభిర్విచిత్రైర్వస్త్రభూషణైః। అలంకృత్యవిమానాగ్ర్యం తన్మధ్యేతాంనివేశ్యచ। విష్ణుభక్తిర్వినీతైశ్చ కరతాళైశ్చనర్తనైః। జయశబ్దైస్స్తూయమానా యయుర్వైకుంఠమందిరమ్॥

తా॥ అంతలో శంఖచక్రాంకితులును, చతుర్బాహువులును, పద్మాక్షులును, పీతాంబరధారులును, అయిన విష్ణుదూతలు దేవతలతోటలోనున్న పుష్పములతోను,

ముత్యాలతోను, పగడములతోను, గచించిన గాలికలతోను, వస్త్రములతోను, ఆభరణములతోను అలంకరించబడిన విమానమును, తీసికొనివచ్చి సూర్యుడువలె ప్రకాశించెడి ఆవిమానమందు ఆమెను యెక్కించి జయధ్వనులతో కరతాళములు వేయుచు అనేక మంది వెంటరాగా వైకుంఠలోకమును చేరెను.

శ్లో॥ తదాగద్దమనే శీలా దృష్ట్వాతన్నిరయాలయం।
విష్ణుదూతానువాచేదం విస్మితేనాంతరాత్మనా॥

తా॥ ఆమె వైకుంఠమును బోవుచు మధ్యమార్గమందు నరకమునుచూచి ఆశ్చర్యమొంది విష్ణుదూతలతో నిట్లు పలికెను.

శ్లో॥ తిష్ఠంతునిమిషం దేవా నరకేతునిపాతితాః।
అత్రాంధకూపె పతితః పతిర్మేమృతిమాగతః।
త్రిభిస్స్వయంనిపత్యాధో వదధ్వంమమవైష్ణవాః॥

తా॥ ఓవిష్ణుదూతలారా! నిమిషమాత్రము వుండండి యీనరకకూప మందునా భర్త ముగ్గురితో పడియుండుటకు కారణమేమి యీవిషయమును నాకుచెప్పండీ.

విష్ణుదూతాఊచుః॥ శ్లో॥ పతి స్తవాయం లేమూఢః పరేషాందాసకర్మభిః। చచారచోరవృత్తించ పరవిత్తైకజీవనః। వేదమార్గం పరిత్యజ్య దుష్టమార్గేవ్యవస్థితః। తేనకర్మవిపాకేన నిరయం యాతిమంగళే॥

తా॥ వీడు నీభర్త వీడు కూలిచేసి దొంగతనముచేసి, పరధనాపహరణమునుచేసినాడు, వేదోక్తమైన యాచారమును వదలి దుర్మార్గమందు చేరినాడు అందువల్ల వీడు నరకమందున్నాడు.

శ్లో॥ ద్వితీయోయంద్విజస్సుభ్రు మిత్రఘ్నశ్చాతిపాతకః। బాల్యాదారభ్యతన్మిత్రం ప్రాణాదప్యధికంశుభె। తంహత్వాతద్ధనం హృత్వా దేశాంతరముపాగమత్।పతిస్తవాశుభాచార స్తద్ధనంస్వయమాహరత్। మార్గేమధ్యాహ్నసమయె కానసేకమలేకుణే। తౌహత్వాలుబ్ధకస్తత్ర సోపివ్యాఘ్రేణదంశితః। శార్దూలమపినాభూయో మృతౌతౌవ్యాఘ్రలుబ్ధకౌ। నిరయాలయవాసీచ లుబ్ధకోబ్రహ్మహత్యయా। వ్యాఘ్రోయంచ పురాపాపీ బ్రాహ్మణోద్రావిడశ్శుచిః। ద్వాదశ్యాంతైల

భోక్తాసీ ద్భక్ష్యాభక్ష్యవివర్జితః । తేనకర్మవిపాకేన నిరయా లయమాశ్రితమ్॥

తా॥ యీరెండవబ్రాహ్మణుఁడు మిత్రద్రోహి, మహాపాతకుడు, యితనిబాల్య మునుంచి, మిత్రుడైయున్నవాని నొకనిని చంపి వాని ధనమునుఅపహరించి యితరదేశ మునకు పోవుచున్నంతలో నీభర్తచేత హతుడాయెను. అట్టిపాపాత్ముడు గనుక యితను నరకమందుబడియున్నాడు యీమూడవవాడు కిరాతుడు, వీడునీభర్తనుయీబ్రాహ్మ ణుని యిద్దరిని చంపినాడు అందుచేత వీడు నరకమందుండెను, యీనాల్గవవాడు పులి, కిరాతులు పరస్పరఘాతములచేతమృతినొందిరి. యీపులిపూర్వమందు బ్రాహ్మణుడు యితను ద్వాదశినాడు భక్ష్యాభక్ష్యవిచారణచేయక తైలమును భుజించినాడు అందుచేతవీడునరకమందున్నాడు, యిట్లునలుగురునరకమందుయీతనలనొందుచున్నారు

శ్లో॥ తైరేవముదితాతన్వీ పునస్తానాహభూపతే।
కేనపుణ్యేన తేషాంతు కథంముక్తిర్భవిష్యతి॥

తా॥ విష్ణుదూత లిట్లు చెప్పగా విని ఆమె అయ్యలారా యేమి పుణ్యముచేత వీరు నరకమునుంచి ముక్తులగుదురు అని అడిగెను.

శ్లో॥ తఊచురితంరాజేంద్ర కార్తికేచరితంత్వయా । ఫలందదస్వ పౌరాణశ్రవణస్యశుభాననే । పత్యుఃకార్తికమాసస్య తేన ముక్తిర్భవిష్యతి। తత్పురాణస్యయద్వార్తిం తత్ప్రాతే సమర్పితం । మృగలుబ్ధకయోస్సామ్యం ధర్మందేహిశుభాననే। మిత్రఘ్నస్యాపిదుర్బుద్ధేః ద్విజస్యకుటిలాలకే యదాహూతం జనానాంచ పురాణశ్రవణోత్సుకా । తత్ఫలందేహివిప్రస్య కృతఘ్నస్యశుభేక్షణే । తేనతేనపభావేన ముక్తింయాంతి నసంశయః॥

తా॥ ఆమాటవిని దూతలిట్లనిరి అమ్మా కార్తికమాసమందు నీచేత చేయబడిన పుణ్యమందు పురాణశ్రవణ ఫలమును నీభర్తకివ్వుము, దానితోవాడు ముక్తుడగును, ఆపురాణశ్రవణార్థమై దీపమును నీవుసమర్పించినవర్తిపుణ్యమును యీకిరాతవ్యాఘ్ర ములకు సమానముగా యిమ్మ దానంజేసి వారు ముక్తులగుదురు, పురాణశ్రవణార్థమై నీవు ప్రతిగృహమునకుబోయి ప్రజలనుపిలిచినపుణ్యమును యీకృతఘ్నునకిమ్ము దానితో వాడు ముక్తుడగును, యిట్లు ఆయాపుణ్యదానములచేత వారు వారు ముక్తులగుదురు.

శ్లో॥ ఇతి తేషాం వచశ్శ్రుత్వా విస్మయావలితేక్షణా స్తత్తంద త్తంచ యారాజన్ దానం యన్ముక్తికారణం। తదా తేనారకాన్ముక్తా విమానమధిరుహ్యాచ। యయుర్విష్ణుపదం సర్వే శంసంతస్తాం నరాధిప। శనై స్సైజ్ఞానగమ్యాస్య ముక్తింయాంతి పరంపదం॥

తా॥ విష్ణుదూతలు మాటలు విని ఆశ్చర్యమొంది బ్రాహ్మణ స్త్రీ ఆయా పుణ్యము అను వారివారికిచ్చెను దానిచేత వారు నరకమునుంచి విడుదలై దివ్యవిమానముల నెక్కి ఆస్త్రీని కొనియాడుచు మహాజ్ఞానులు పొందెడి ముక్తిపదమును గూర్చి తీసుకువెళ్ళిరి.

శ్లో॥ తస్మాత్కార్తీకమాసేతు పురాణశ్రవణం యది।
కురుతే రాజశార్దూల సయాతిహరిమందిరమ్॥

తా॥ కాబట్టి కార్తీక మాసమందు పురాణ శ్రవణము చేయువాడు హరి లోక మందుండును.

శ్లో॥ య ఇదం దివ్యమాఖ్యానం శ్రుణోతి శ్రద్ధయాన్వితః।
కర్మత్రయార్జితం పాపం తత్క్షణా దేవనశ్యతి॥

తా॥ యీ చరిత్రను వినువారు మనోవాక్కాయముల చేత సంపాదించబడిన పాపమును నశింపచేసికొని మోక్షమును బొందుదురు.

ఇతి శ్రీ స్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే ఏకాదశోఽధ్యాయ స్సమాప్తః.

---

## 12 అథ ద్వాదశాధ్యాయారంభః.

వసిష్ఠ ఉవాచ॥ శ్లో॥ కార్తీక్యాం మిందువారస్య మాహాత్మ్యం శృణు భూపతే। తస్మాచ్ఛతగుణం తస్మిన్ పవిత్రం సౌరిత్రయోదశీ॥ సహస్రగుణితం తస్మాత్ కార్తీకే మాసి పౌర్ణిమా। తయా లక్షగుణం ప్రోక్తం మాసస్య ప్రతిపద్దినం। తస్మాత్కోటి గుణం రాజన్ అంతిమైకాదశీం విదుః। తస్మాదనంతగుణితం కార్తీకే ద్వాదశీదినమ్॥

తా॥ వసిష్ఠమహాముని తిరిగి చెప్పుచున్నాడు. ఓ రాజా వినుము కార్తీకమాస మందు సోమవార మాహాత్మ్యమును వినుము. సోమవారముకంటె శనిత్రయోదశి నూరు రెట్లు ఫలముగలది. శనిత్రయోదశికంటె కార్తీకపూర్ణిమ వెయ్యిరెట్లు ఫలముగలది.

పూర్ణిమాంతమని యందురు. కార్తికమాసమునందు ... పూర్ణిమాంతమని పక్షము ప్రాధాన్యమై లక్షగుణాధికఫలము, కృష్ణపక్షమై ... ఏకాదశి కోటిగుణఫలప్రదము, అంతిమైకాదశికంటె కార్తికద్వాదశి అనంతగుణఫలప్రదము, యిచ్చట అంతిమైకాదశి యనగా కార్తికబహుళైకాదశి వచ్చుచున్నదిగాని పూర్ణిమాంతమాస శాస్త్రప్రకారముగా చూచిన యడల కార్తిక శుక్లైకాదశియె యగును, వింధ్యోత్తరదేశమందు అంతిమైకాదశియనగా శుక్లైకాదశినే గ్రహింతురు. అచ్చట పూర్ణిమాంతమే మాసము యిదిగాక ముందు కార్తికశుక్లైకాదశినిగురించియె అనంతమహిమ చెప్పబడుచున్నది అంబరీషుని చరిత్రమందును శుక్లైకాదశియె గ్రహించబడినది.

శ్లో॥ అంతిమైకాదశీంమోహా దుపోష్యయదిమందిరే।
గీతవాద్యపురాణైశ్చ కుర్యాజ్జాగరణంనరః।
ససర్వపాపనిర్ముక్తో విష్ణులోకేవసేచ్చిరమ్॥

తా॥ మోహముచేతనైనా అంతిమైకాదశినా డుపవాసముచేసి గీతవాద్యపురాణములచేత జాగరమాచరించువాడు సమస్త పాతకము వీడి విష్ణులోకమందునివసింతురు

శ్లో॥ తథాపరదినేప్రాప్తే పారణంబ్రాహ్మణైస్సహ।
యఃకార్తికేమాసిరాజన్ ససాయుజ్యంలభేద్ధరేః॥

తా॥ కార్తిక మాసమందు యేకాదశినాడుపవాస మాచరించి ద్వాదశినాడు బ్రాహ్మణులతోకూడా పారణచేయువాడు సాయుజ్యముక్తి నొందును.

శ్లో॥ కార్తికేయశ్చద్వాదశ్యాం అన్నదానంమహాత్మనే।
యఃకుర్యాద్ద్విజశార్దూల సర్వసంపద్వివర్ధతే॥

తా॥ కార్తిక మాసమందు ద్వాదశినాడు అన్నదానమును చేయువానికి సమస్త సంపత్తులు వృద్ధిబొందును.

శ్లో॥ గంగాతీరేరవిగ్రస్తే కోటిబ్రాహ్మణభోజనాత్।
యత్ఫలంలభతేజంతుః తత్ఫలంద్వాదశీంవిదుః॥

తా॥ సూర్యగ్రహణమందు గంగాతీరమందు కోటిబ్రాహ్మణులకు భోజనము పెట్టిన పుణ్యము ద్వాదశినాడు ఒకబ్రాహ్మణునకు అన్నము పెట్టిన లభించును.

శ్లో॥ ఉపరాగసహస్రాణి వ్యతీపాతాయుతానిచ।
అమాలక్షంతుద్వాదశ్యాః కళాంనార్హంతిషోడశీమ్॥

తా॥ వేయి గ్రహణములును పదివేల వ్యతీపాతయోగములును లక్ష అమావాస్యలును కలసి ద్వాదశిలో పదియారవ వంతునకు ... [illegible]

||శ్లో|| అనేకతిథయస్సంతి సదాసత్పుణ్యదాయకాః|
తాసామనంతగుణితా ద్వాదశీవిష్ణువల్లభా||

తా|| పుణ్యమును యిచ్చె తిథులనేకములున్నవిగాని ద్వాదశి హరిప్రియము గాన వాటికన్నిటికంటె అధికఫలప్రదము.

శ్లో|| కార్తికేశుక్లపక్షేతు ద్వాదశీహరిబోధినీ|
తస్యామేకస్యవిప్రస్య అన్నదానంకరోతియః|
ససర్వసౌఖ్యంలభతే పశ్చాద్విష్ణుపురేన్నృప||

తా|| కార్తీకశుక్ల ద్వాదశినాడు అనగా యేకాదశినాడు రాత్రియామముండగా హరి పాలసముద్రమునుంచి నిద్రలేచునుగాన ఆద్వాదశి హరిబోధిని యనబడును. ఆద్వాదశినాడు ఒకబ్రాహ్మణునకైనను అన్నదాన మాచరించువాడు యిచ్చట భోగములను బొంది అంతమందు హరి సన్నిధి నొందును.

శ్లో|| కార్తికేమాసిద్వాదశ్యాం దధ్యన్నందానముత్తమం|
యఃకుర్యాత్సోపిధర్మేభ్యో హ్యధికంఫలముచ్యతే||

తా|| కార్తీకమాసమందు ద్వాదశినాడు పెరుగు అన్నమును దానము చేసిన యడల సమస్త ధర్మములకంటె అధికఫలమును బొందును.

శ్లో|| నారీవాపురుషోవాపి కార్తిక్యాంద్వాదశీదినే|
స్వర్ణశృంగీంరౌప్యఖురాం సవత్సాంసపయస్వినీం|
గామభ్యర్చ్యవిధానేన దానంయఃకురుతేనఘ|
యావతీరోమసంఖ్యాస్యాత్తావత్స్వర్గాధిపోభవేత్ ||

తా|| స్త్రీగాని పురుషుడుగాని కార్తీకశుక్ల ద్వాదశినాడు పాలిచ్చెడియావుకు బంగారపు కొమ్ములు వెండి డెక్కలను చేయించి పెట్టి పూజించి దూడతోగూడ గోదాన మాచరించిన యడల ఆగోవుకు యెన్ని వేల వెంట్రుకలుండునో అన్ని వేలయేండ్లు స్వర్గ నివాసము కలుగును.

శ్లో|| ద్వాదశ్యాంకార్తికేమాసి వస్త్రదానంకరోతియః|
భక్త్యాప్రయత్నతోరాజన్ పాపైఃపూర్వార్జితైరపి
విముచ్యవిష్ణుభవనం యాతినాస్త్యత్రసంశయః||

తా|| కార్తీకమాసమందు ద్వాదశినాడు భక్తితో వస్త్రదానమాచరించువాడు పూర్వజన్మార్జిత పాపములను నశింపచేసి వైకుంఠ లోకమును పోవును. యిందుకు సందేహము లేదు.

శ్లో॥ ద్వాదశ్యాం కార్తికేమాసి పౌర్ణమాస్యాం ప్రతిపద్దినే।
యోదీపదానం కురుతే సకాంస్యంచఘృతాదికం।
కోటిజన్మార్జితంపాపం తత్క్షణేనవినశ్యతి॥

తా॥ కార్తికమాసమందు ద్వాదశియందును పూర్ణిమయందును పాడ్యమియందును గాని కంచుపాత్రలో ఆవునెయ్యిపోసి దీపమును వెలిగించి దానమిచ్చువానికి కోటిజన్మములలో చేయబడిన పాతకములు నశించును.

శ్లో॥ ఫలంయజ్ఞోపవీతంచ సతాంబూలంసదక్షిణం।
ద్వాదశ్యాంయేప్రకుర్వంతి తత్ఫలంశృణుభూమిప।
భుంక్తేమహావిపులాన్ భోగాన్ స్వర్గేప్యంతేతుదుర్లభాన్।
పశ్చాద్విష్ణుపురంప్రాప్య మోదతేవిష్ణువచ్చిరమ్॥

తా॥ కార్తిక ద్వాదశినాడు ఫలమును యజ్ఞోపవీతమును తాంబూలమును దక్షిణను యిచ్చువాడు యీలోకమందు అనేక భోగములనుబొంది అంతమందు వైకుంఠమందు విష్ణువుతోగూడా చిరకాలము సుఖించును.

శ్లో॥ సువర్ణతులసీదానం ద్వాదశ్యాం కార్తికేనృప।
సాలగ్రామంసమభ్యర్చ్య శ్రోత్రియాయకుటుంబినే।
దానంయఃకురుతేభక్త్యా తస్యపుణ్యఫలంశృణు॥

తా॥ కార్తిక ద్వాదశీనాడు బంగారపు తులసీవృక్షమును సాలగ్రామమును దానము చేయువాడు పొందెడి ఫలమును చెప్పెదను వినుము.

శ్లో॥ చతుస్సాగరపర్యంతం భూదానాద్యత్ఫలంవిదుః।
తత్ఫలంసమవాప్నోతి ద్వాదశ్యాంకార్తికస్యచ॥

తా॥ కార్తిక ద్వాదశినాడు పూర్వోక్తదానమును చేసినవాడు నాలుగుసముద్రముల మధ్యనున్న భూమినంతయు దానమిచ్చువాడు పొందెడి ఫలమును పొందును.

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసంపురాతనం।
శృణ్వతోసర్వపాపఘ్నం తత్సమాసేనమేశృణు॥

తా॥ యీవిషయమందు యొక కథ గలదు చెప్పెదనువినుము విన్నవారికిసమస్త పాతకములు నశించును.

శ్లో॥ వైశ్యఃకశ్చిద్దురాచారః గోదావర్యాస్తటేశుభే।
స్వయంచాపినభుంజీత దానంవానాణుమాత్రకమ్॥

తా॥ గోదావరీతీరమందు దురాచారవంతుడైన యొక కోమటి గలడు. అతడు స్వల్పదానమైనను చేయువాడుగాడు తానైనను అనుభవించుటయును లేదు.

శ్లో॥ నోపకారంకృతంతేన యస్యైకస్యాపి దేహినః।
పరనిందాపరోనిత్యం పరద్రవ్యేషులాలసః॥

తా॥ వాడు యెవ్వనికిని యుపకారమాచరింపలేదు. నిత్యము పరనింద చేయువాడు పరద్రవ్యములందాసక్తి గలిగియుండువాడు.

శ్లో॥ కస్యచిద్ద్విజముఖ్యస్య ఋణందత్వాధికంధనం।
తద్గృహీతంసమాయాతో విప్రంగ్రామాంతరేస్థితం।
సమపృచ్ఛత్తదావైశ్యో ఋణందేహీతిభూసురమ్॥

తా॥ ఆకోమటి యొక బ్రాహ్మణునకు అధికముగా అప్పయిచ్చి, ఆఋణమును తిరిగి పుచ్చుకొనుట కొఱకు ఆయన ఊరికి వెళ్లి అతను గ్రామాంతరమందున్నట్లు తెలిసి అచ్చటికి వెళ్ళి బ్రాహ్మణుఁడా నాసొమ్ము నాకిమ్ము అని అడిగెను.

శ్లో॥ సవిప్రవర్యస్తచ్ఛ్రుత్వా విచార్యోవాచతంనృప।
ద్రవ్యందాస్యామిమాసాంతే యేనకేనాపికర్మణా।
అతస్థిత్వాఋణంసర్వం గృహీత్వాగంతుమర్హసి॥

తా॥ బ్రాహ్మణుఁడామాట విని ఓయీ యీనెలాఖరున నీసొమ్మును నీకు యేదోవక విధముగా యిచ్చెదను కాఁబట్టి కొంచము నిదానించి నీసొమ్మును తీసికొని పొమ్మనెను.

శ్లో॥ యోజీవతిఋణీనిత్యం నిరయంకల్పమశ్నుతే।
పశ్చాత్తస్యసుతోభూత్వా తత్సర్వంప్రతిదాస్యతి॥

తా॥ ఋణమును పుచ్చుకొని తిరిగి సొమ్ము యివ్వనివాఁడు నరకమందు యాతనల బొంది తిరిగి ఋణదాతకు పుత్రుఁడై జన్మించి వాని సొమ్మును యివ్వవలసియుండును.

శ్లో॥ ఏవముక్తోద్విజోవైశ్యః క్రోధాదారక్తలోచనః । మూఢాద్య దేహిమేద్రవ్యంనోచేత్ఖడ్గేనతాడయే। ఆకృష్య కేశానాదాయ దుష్టాత్మాపాపధీరయం। తేనాశుపతితంభూమౌ విప్రంపాదా వతాడయత్ । క్రోధావేశేనపాపాత్మా విప్రంవేదాంతపారగం । ఖడ్గేనైవాహనత్తూర్ణం హరిస్తుహరిణంయథా మహా రతేనఘాతేన బ్రాహ్మణోబంధువత్సలః॥

తా॥ బ్రాహ్మణుఁడిట్లు చెప్పిన మాటను విని వైశ్యుడు కోపముచేత కన్నెఱ్ఱ చేసి ఓరీ మూఢా బ్రాహ్మణాధమా సాధనము నాకిప్పుడే యిమ్ము లేనియెడల యీ కత్తితో నిన్ను నరుకుదునని దుర్మార్గబుద్ధితో ఆవేదాంతవేత్తయైన బ్రాహ్మణుని జుట్టుపట్టుకుని లాగి క్రిందపడద్రోసి పాపబుద్ధిగలవాడగుటచేత తనకాలితో ఆబ్రాహ్మణుని తన్ని కత్తితో కొట్టెను ఆకత్తి దెబ్బచేత ఆబ్రాహ్మణుడు సింహము దెబ్బచేత లేడివలె మృతి నొందెను.

శ్లో॥ సతుద్రావతో వేగాత్ భయాద్బ్రాహ్మో మహీపతే।
పునర్గృహంప్రవిశ్యాఽసౌ బ్రహ్మఘ్నో నిరపత్రపః।
ఆయురంతరితే కాలే మరణంసముపాగతః॥

తా॥ తరువాత కోమటి రాజదండన వచ్చునను భయముతో అచ్చటనుంచి పరుగెత్తి యింటికిపోయి బ్రాహ్మణుని చంపితినను సిగ్గులేక సుఖముగానుండి కొంతకాలమునకు మృతినొందెను.

శ్లో॥ ఆయయుర్యమదూతాశ్చ పాశహస్తాభయంకరాః।
కరాళవదనారాజన్ కృష్ణరాత్రిసమప్రభాః।
పాశైరాబధ్యతంవైశ్యం యయుర్యమనికేతనం।
తస్మింస్తే రౌరవేఘోరే విససర్జుర్యమాజ్ఞయా॥

తా॥ అంతకరాళముఖులును అమావాస్య రాత్రియందున్న చీకటితో సమానమైనకాంతిగలవారును భయంకరులును అగు యమదూతలు పాశములనుధరించి వచ్చి ఆవైశ్యుని యమపాశములచేత బంధించి యమలోకమునకు గొనిపోయి అచ్చట భయంకరమైన రౌరవమను నరకమందు యమాజ్ఞచొప్పున బాధించుచుండిరి. రౌరవమనగా రురువనగా మృగవిశేషము దాని సంబంధమైనది రౌరవము అనగా రురుమృగములచేత కాటికొమ్ములతో బాధింపించెడి నరకము రౌరవనరకంబనఁబడును.

శ్లో॥ తస్యసూనుర్మహీపాల ధర్మవీరేతివిశ్రుతః । పిత్రార్జితధనం భూరి సదాధర్మపరాయణః । కూపోద్యానతటాకాది సేతు బంధనకారకః॥ వివాహోపనయాకర్తా యజ్ఞకేష్వతిలాలసః॥ అన్నదానపరోనిత్య మాతురాణాంద్విజన్మనాం । సర్వేషామపివర్ణానాం క్షుధార్తానాంమహీపతే॥

తా॥ ఆవైశ్యుని పుత్రుఁడు ధర్మవీరుడనువాడు తండ్రిపోయిన తరువాతతండ్రి సంపాదించిన ధనముచేత నూతులు త్రవ్వించి తోటలు వేయించి చెరువులు త్రవ్వించి

భిక్షు చిన్నవములకు జంతెనలు కట్టించి ఉపనయనములు వివాహములు చేయించుచు యజ్ఞ ములను చేయించుచు నిత్యము బ్రాహ్మణులకు అన్నదానము చేయుచు అన్నిజాతుల వారికి ఆకలిగలిగినవారికి అన్నము పెట్టుచు నిత్యము ధర్మములను చేయుచుండెను.

శ్లో॥ తస్యచాంతరితేకాలే గృహేతత్పుణ్యయోగతః నారదఃపర్య
టన్ స్థానా ద్ధర్మరాజాలయాచ్ఛుచిః । వీణాసుతంత్రీఃధ్వన
యన్ సగాయన్ విష్ణుకీర్తనం । వణిగ్వైశ్యస్య నేకాలే ప్రనృ
త్యన్ పులకాంకితః । గోవిందనారాయణ కృష్ణవిష్ణో అనంత
వైకుంఠనివాసమూర్తే । శ్రీవత్సవిశ్వంభర దేవదేవ సమస్త
దేవేశనమోనమస్తే।

తా॥ ఇట్లుండగా నొకప్పుడు అధర్మవీరుడు హరిని బూజించుచు సమయమున నారదమహాముని సమస్త లోకములందు తిరుగుచు ఆనాడు యమలోకమునుంచి బయ లుదేరి తనవీణాతంతువులను ధ్వనిచేయుచు గోమాచితుండై "గోవింద "నారాయణ, కృష్ణ, విష్ణో, అనంత, వైకుంఠ, శ్రీనివాస. శ్రీవత్సభూష, విశ్వంభర, సమస్తదేవతా చక్రవర్తి నమస్తే నమస్తే ఇట్లని కీర్తనము చేయుచువచ్చెను.

శ్లో॥ నృత్యంతమేవంగృహమాగతం వణిక్ సమస్తసంతోషపయో
ధిమగ్నః।ననామపాదౌమునయేమహాత్మనేహ్యానంద బాష్పౌ
న్నయనస్సదండవత్ ।

తా॥ ఇట్లు నృత్యము చేయుచున్న నారదమునీశ్వరుజూచి వైశ్యుడు ఆనంద సాగరమగ్నుడై నేత్రముల వెంట ఆనందబాష్పములను వదలుచు మునిపాదములకు నమ స్కరించి దండప్రణామ మాచరించెను.

శ్లో॥ తంపాదపద్మానమితం దయాళుర్మునిస్తదాతంపరిరభ్యహర్షితః॥

తా॥ నారదుండు తన పాదములకు ప్రణమిల్లిన వైశ్యుని ప్రీతితో కౌగలించుకొనెను

శ్లో॥ సప్రాహవైశ్యఃపురతః కృతాంజలిః తంవిష్ణుమర్ఘ్యాదిభిరర్చ్య
తంన్నృప । భవదాగమనంమహ్యం మునేహ్యత్యంతదుర్లభం।
యతార్జితంమయాపూర్వంధర్మమార్గముపాగతం।యన్మయా
చరితంత్వద్య ఫలితంతనదర్శనాత్ । సేవాంవిధాస్యేవిప్రేంద్ర
ప్రపయొప్రీణయేన చ।

తా॥ తరువాత ఆవైశ్యుడు నారదమునీశ్వరుని ముందర అంజలినిబట్టినవాడై అర్ఘ్యా దులచేత పూజించి ఓ నారదా! మీరు మాగృహమునకు వచ్చుట చాలాదుర్లభము నేను

పూర్వమందు యేమి పుణ్యము చేసితినో మీయదర్శనమిచ్చినవారు కాబట్టి నాపూర్వపుణ్యము యిప్పుడు ఫలించినది మునీంద్రా మీకు దాసుడను మేమి సేవ చేయవలెను చెప్పుము చేసెదను

శ్లో॥ ఇతితస్యవచశ్శ్రుత్వా మందస్మేరముఖాంబుజః।
ఉవాచధర్మవీరంతం నారదోభగవాన్మునిః॥

తా॥ వైశ్యుడిట్లుపలికిన మాటనువిని నారదమునీశ్వరుడు చిరునవ్వుతో గూడిన ముఖముగలవాడై ధర్మవీరునితో యిట్లనియె.

నారదః॥ శ్లో॥ ధర్మవీరాద్య మేవాక్యం సావధానమనాశ్శ్రిణు। కార్తికస్యతుమాసస్య ద్వాదశీహరివల్లభా। స్నానదానాదికంతస్య సదానంతఫలంవిదుః॥

తా॥ నారదుడు చెప్పుచున్నాడు. ధర్మవీరా! నామాటనుజాగ్రత్తగావినుము కార్తీక ద్వాదశి విష్ణుమూర్తికిప్రియమైనది గనుక ఆరోజున చేసిన స్నానదానాదికము అనంత ఫలప్రదమగును.

శ్లో॥ ఆఢ్యకోవాదరిద్రోవా యతిర్వానస్థఏవవా।బ్రాహ్మణఃక్షత్రియోవాపి వైశ్యశూద్రోపివాసతీ। సాలగ్రామశిలాదానం యేకుర్వంతిప్రయత్నతః।తులాసంస్థేదినకరే ద్వాదశ్యామర్కికేదినే। తేనపాపానినశ్యంతి జన్మాంతరకృతానిచ॥

తా॥ సూర్యుడు తులారాశి యందుండగా కార్తీకమాసమందు ద్వాదశినాడు ధనికుడుగాని, దరిద్రుడుగాని, యతిగాని, వానప్రస్థుడుగాని, బ్రాహ్మణుడుగాని, క్షత్రియుడుగాని, వైశ్యుడుగాని, శూద్రుడుగాని, స్త్రీగాని, సాలగ్రామదాన మాచరించువారు జన్మాంతర కృతపాపములను నశింపచేయుదురు.

శ్లో॥ ధర్మరాజాలయేవైశ్యః పితాతవమృతింగతః।
రౌరవాఖ్యేమహాఘోరే పచ్యతేనరకాగ్నినా।
తస్యపాపవిశుద్ధ్యర్థం ద్వాదశ్యాంకార్తికస్యచ।
సాలగ్రామశిలాదానం కురుత్వంమావిలంబితమ్॥

తా॥ ధర్మవీరా వినుము నీతండ్రిచచ్చిపోయి యమలోకమందు బాధల నొందుచున్నాడు, అతని పాపవిశుద్ధి కొఱకు కార్తీకద్వాదశినాడు శీఘ్రముగా సాలగ్రామశిలాదానము చేయుము.

శ్లో॥ మునిస్తస్యవచశ్శ్రుత్వా వైశ్యఃప్రాహమునింనృప।
గోభూతిలహిరణ్యాది దానానాంయత్ఫలంమునే।
నాస్తిత్తత్ఫలతోముక్తిశ్శిలాదానేనకింభవేత్॥

తా॥ నారద మునీశ్వరుడిట్లు చెప్పిన మాటను విని వైశ్యుడుయిట్లనియె, మునీంద్రా, గోదానము, భూదానము, తిలదానము, సువర్ణదానము, మొదలైన మహాదానములచేత కాని ముక్తి శిలాదానముచేత నెట్లుగలుగును.

శ్లో॥ శిలాదానంవృథామన్యే నభోజ్యంనచభక్షణం।
నాతఃకార్యంమయావిప్ర శిలాదానంచనీచవత్॥

తా॥ శిలాదానము వృథాగాచేయుట యెందుకు అది భోజ్యముగాదు, భక్షణముగాదు, గనుక నేను రాతిని దానము చేయను.

శ్లో॥ బహుధాబోధ్యతంవైశ్యం మునిరంతరధీయత।
నకుర్యాద్వ్యధిమూఢాత్మా బోధితోబ్రహ్మసూనునా॥

తా॥ నారద మహర్షి యెంతగా నొక్కి చెప్పినను వైశ్యుడు మూఢుడై సాలగ్రామదానమును చేయుటకు సమ్మతించలేదు అంతనారదు డంతర్ధానమాయెను.

శ్లో॥ సోపికాలాంతరేతీతే గతాసురభవన్నృప।మహద్వచనమజ్ఞేన హ్యతిక్రమణదోషతః। సాలగ్రామశిలాదాన మనాదృత్య మహీపతే। తేనదోషేణసంజాతో వ్యాఘ్రయోనౌత్రిజన్మసు త్రివారంనుర్కటత్వంచ పంచవారంవృషస్యచ। దశవారం పునస్త్రీత్వం గతభర్తృత్వమంజసా॥

తా॥ తరువాత కొంతకాలమును ధర్మవీరుఁడు మృతినొంది మహాత్ములమాట వినని దోషముచేతను, సాలగ్రామదానము చేయని దోషముచేతను, నరకమందుబాధలనొంది తరువాత మూడుసారులు వ్యాఘ్రమై జన్మించి తరువాత ముమ్మారు కోతిగా పుట్టి అనంతరము అయిదుమారులు వృషభమైయుండి తరువాత పదిమారులు స్త్రీగా జన్మించి గతభర్తయై వైధవ్యమునుబొంది యుండెను.

శ్లో॥ జన్మన్యేకాదశేరాజన్ యాచకస్యసుతాభవత్।
తాందృష్ట్వావిప్రశార్దూల స్సురూపాంప్రాప్తయౌవనాం।
సమానకులగోత్రాయ వివాహమకరోత్పితా॥

తా॥ ఇట్లు పదిజన్మలు గడచిన తరువాత పద కొండవ జన్మమందు యాచకునకు కుమార్తెగా జన్మించెను. తరువాత కొంతకాలమును యౌవనమురాగానే తండ్రి తగిన వరునకిచ్చి వివాహము చేసెను.

శ్లో॥ మృతంజామాతరంద్రుష్ట్వా నవోఢాంతనయాంపిత్రా । అయ
యుర్బాంధవాస్సర్వే దుఃఖాదాకులితేంద్రియాః।యాచకోపి
విచార్యేదం దివ్యదృష్ట్యాతయాకృతం।పూర్వజన్మనిరాజేంద్ర
సుకృతందుష్కృతంద్విజః । విజ్ఞాయాహోధసర్వేభ్యః బంధు
భ్యోద్విజసత్తమ॥

తా॥ దానిని మృతినొందిన ఆ అల్లుని బంధువులందరువచ్చి చూచి అట్టిబాల్య వైధవ్యమునకు చాలాదుఃఖించిరి, యాచకుడును దివ్యదృష్టితో చూచినవాడై ఆచిన్న దాని బాల్యవైధవ్యమునకు కారణమును తెలుసుకుని బంధువులందరికిని కుమార్తెయొక్క పూర్వపుణ్యమును పూర్వపాపమును చెప్పెను.

శ్లో॥ తస్యాఃపాపవిశుద్ధ్యర్థం పితాత్రంముక్తికారణం।
జన్మాంతరార్జితాఘౌఘ నాశహేతుంసుఖప్రదం।
సాలగ్రామశిలాదానం కార్తిక్యామిందువాసరే।
విప్రం వేదాంతనిరతం సమభ్యర్చ్యవిధానతః॥
పుణ్యంపాపవిశుద్ధ్యర్థం దాపయామాసభూసురః॥

తా॥ ఇట్లు చెప్పి కూతురుయొక్క పాపముల నాశనముకొఱకు జన్మాంతరార్జిత పాపనాశన సమర్థమగు సాలగ్రామదానమును కార్తికసోమవారమందు వేదాంతవేత్తయైన బ్రాహ్మణునకు దానముచేసెను.

శ్లో॥ పతిరుజ్జీవితస్తేన సుఖేనభువిదంపతీ।
స్థిత్వాకాలేసమాయాతి దివంగత్వానుభూయచ।
సపుర్భవమభ్యేత్య స్థిత్వాసుతపసోభవత్ ।
పూర్వార్జితేనపుణ్యేన తస్యజ్ఞానోదయోఽభవత్ ॥

తా॥ ఆసాలగ్రామ శిలాదాన మహిమచేత కుమారుని భర్త తిరిగి జీవించెను. తరువాత దంపతులిద్దరు సుఖముగా చిరకాలముండి స్వర్గమునకుబోయి అందు బహుకాల మానందముతో యుండి తిరిగి భూమియందు జన్మించి బ్రాహ్మణుడై పూర్వపుణ్యముచేత జ్ఞానమును బొందెను.

శ్లో॥ వర్షేవర్షేచసుకృతం కార్తిక్యామిందువాసరే।
సాలగ్రామశిలాదానం తేనముక్తిమవాపసః॥

తా॥ ప్రతిసంవత్సరమందు కార్తికసోమవారమందు సాలగ్రామ శిలాదాన మాచరించి ఆపుణ్యముతో మోక్షసామ్రాజ్యపదవి గతు డాయెను.

శ్లో॥ రౌరవేముఃఖితస్యాపి ముక్తిరాసీచ్ఛతత్పితుః।
తస్మాద్రాజేంద్రియత్నేన కార్తికే కేశవాలాపతేః।
సాలగ్రామశిలాదానం తుష్ట్యర్థంనాత్రసంశయః॥

తా॥ రౌరవ నరకమందున్నవాని తండ్రియు ఆసాలగ్రామదాన మహిమచేత ముక్తుండాయెను కాంబట్టి జనకరాజా కార్తికమందు సాలగ్రామదానముచేత హరి సంతోషించును యిందుకు సందియములేదు.

శ్లో॥ కోటిజన్మసుయత్పాపం సంచితంపాపిభిస్సదా।
తత్పాపనాశహేతుర్వై కార్తికే హరిబోధినీ॥

తా॥ పాపకర్ములు కోటిజన్మలలో చేసిన పాతకములు కార్తికశుక్ల ఏకాదశ్యుపవాస ద్వాదశీదానాదులచేత నశించును.

శ్లో॥ సర్వపాపప్రశమనం ప్రాయశ్చిత్తంజగత్త్రయే।
సాలగ్రామశిలాదానా త్పరంనాస్తినసంశయః॥

తా॥ కార్తికమాసమందు సాలగ్రామ దానమువలన సమస్త పాతకములు నశించును. యిదియే ముఖ్యమైన ప్రాయశ్చిత్తము. యింతకంటె వేరు ప్రాయశ్చిత్తములేదు యిందుకు సందియములేదు.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే ద్వాదశోధ్యాయ
స్సమాప్తః.

---



అథ త్రయోదశోధ్యాయారంభః.

వసిష్ఠఉవాచ। శ్లో॥ అథేదానీంప్రవక్ష్యామి ధర్మాన్కార్తిక సంభవాన్। ప్రశస్తాత్మాసవై భూప తథాచావశ్యకాంచ్ఛృణు॥

తా॥ వసిష్ఠుడు తిరిగి చెప్పుచున్నాడు. జనకరాజా? కార్తిక మాసమందు చేయదగిన ధర్మములను చెప్పెదను నీస్వచ్ఛమైన మనస్సుతో వినుము ఆధర్మములన్నియు ఆవశ్యకము లైనవి.

శ్లో॥ సంసారభయభీతస్య పాపభీరోర్నరస్యచ।
కార్తికేమాసియత్ప్రోక్తం మత్ప్రత్రావిధినాపురా।
సత్యంబ్రవీమికర్తవ్యాన్ నోచేత్పాపంభవేన్నృప॥

తా॥ రాజా! కార్తీక ధర్మములు మాకెంతో గొప్పవైన బ్రాహ్మణులచే చెప్పబడినవి అవి అన్నియు చేయదగినవే యగును చేయని యెడల పాపము సంభవించును. యిది నిజము సంసార సముద్రమునుంచి దాట గోరువారును నరకబాధ భయము గలవారును యీధర్మములను తప్పక చేయవలెను.

శ్లో॥ కన్యాదానంతులాస్నానం శిష్టపుత్రోపనాయనం।
విద్యావస్త్రాన్నదానాని ఊర్జేశస్తానిభూపతే॥

తా॥ కార్తీకమాసమందు కన్యాదానము ప్రాతఃస్నానము శిష్టుడైన బ్రాహ్మణుని పుత్రునకు ఉపనయనము చేయించుట విద్యాదానము వస్త్రదానము అన్నదానము యివి ముఖ్యములు.

శ్లో॥ విత్తహీనస్యవిప్రస్య సూనోశ్చాప్యుపనాయనం।
సదక్షిణంససంభారం ఊర్జేదత్వానరోనఘ।
తస్యపాపానినశ్యంతి కృతానిబహుళాన్యపి॥

తా॥ కార్తీకమాసమందు ద్రవ్యహీనుడైన బ్రాహ్మణపుత్రునకుపనయనమును చేయించి దక్షిణయిచ్చిన యెడల అనేకజన్మార్జిత పాపములు నశించును.

శ్లో॥ జపేనైకేనగాయత్ర్యా ద్రవ్యదాతుఃఫలంశృణు।
అగమ్యాగమనాదీని హత్యాదీనిసహస్రశః।
తథాన్యాన్యుగ్రపాపాని భస్మసాద్యాంతిభూమిప॥

తా॥ తనద్రవ్యమిచ్చి యుపనయనము చేయించి నప్పుడు ఆవటువుచే చేయబడిన గాయత్రీ జపఫలమువలన పంచమహాపాతకములు భస్మమగును.

శ్లో॥ గాయత్రీం దేవదేవస్య పూజాస్వాధ్యాయనార్పణం।
ఏతేషామధికంపుణ్యం మయావక్తుంనశక్యతే॥

తా॥ గాయత్రీజపము, హరిపూజ, వేదగానము, వీటిఫలమును చెప్పుటకు నాకు శక్యముగాదు.

శ్లో॥ తటాకాయుతనిర్మాణం అశ్వత్థారోపణంశతం।
కోటయఃకూపవాపీనాం క్రమాన్నందనపాలనాత్।
బ్రహ్మప్రతిష్ఠాపుణ్యస్య కలాంనార్హంతిషోడశీమ్॥

తా॥ పదివేలు తటాకములను త్రవ్వించు పుణ్యము, నూరు రావిచెట్లు పెట్టించు పుణ్యము నూతులు దిగుడు భావులు నూరు త్రవ్వించుపుణ్యము నందనతోటలు వేయించు పుణ్యమును యీ బ్రాహ్మణునకు ఉపనయనము చేయించిన పుణ్యములో పదియారవ వంతునకు కూడ సరిపోవు.

శ్లో॥ మాఘ్యాంవై మాఘవేమాసి చోత్తమంమౌంజిబంధనమ్।
కారయిష్యంతి తేరాజన్ దానందత్వాతుకార్తికే॥

తా॥ కార్తీకమాసమందుపనయన దానముచేసి తరువాత మాఘమాసమందు
గాని వైశాఖమాసమందుగాని యుపనయనమును చేయించవలయును.

శ్లో॥ సాధుభ్యశ్శ్రోత్రియేభ్యశ్చ బ్రాహ్మణేభ్యోయథావిధి।
తథా తేషాంసుతానాంచ ప్రకుర్యాన్మౌంజిబంధనం।
తేనానంతఫలంప్రాహు ర్మునయోధర్మవిత్తమాః॥

తా॥ సాధువులును శ్రోత్రియులును అగు బ్రాహ్మణుల కుమారులకు ఉపన
యనము చేయించిన యడల అనంతఫలముగలదని ధర్మవేత్తలైన మునులు చెప్పిరి.

శ్లో॥ తథా తేషాంవిధానంచ కార్తీకేమాసిధర్మవిత్।
కుర్యాత్తస్యఫలంవక్తుం కశ్శక్తోదివివాభువి॥

తా॥ ఆఉపనయనములకు సంకల్పము కార్తీకమాసమందు చేయవలెను అట్లు
చేసినయడల కలిగెడి ఫలమును చెప్పుటకు భూమియందుగాని స్వర్గమందుగాని యెవ్వ
నికి సామర్థ్యములేదు.

శ్లో॥ సోపితీర్థానుగమనం దేవబ్రాహ్మణతర్పణమ్।
యఃకర్మకురుతేవాపి ద్రవ్యదాతుఃఫలంలభేత్॥

తా॥ పరద్రవ్యమువలన తీర్థయాత్రయు దేవబ్రాహ్మణ సంతర్పణము చేసిన
యడల పుణ్యము ద్రవ్యదాతకు గలుగును.

శ్లో॥ మౌంజీవివాహమేకస్య యఃకుర్యాన్మేదినీపతే।
దత్వార్థంకార్తీకేమాసి తస్యానంతఫలంస్మృతమ్॥

తా॥ కార్తీకమాసమందు ధనమిచ్చి యొకబ్రాహ్మణునకుపనయనమువివాహ
మును చేయించిన యడల అనంతఫలము గలుగును.

శ్లో॥ కన్యాదానంతుకార్తీక్యాం యఃకుర్యాద్భక్తితోఽనఘ।
స్వయంపాపైర్వినిర్ముక్తః పితౄణాంబ్రహ్మణఃపదమ్॥

తా॥ కార్తీకమాసమందు కన్యాదాన మాచరించువాడు తాను పాపవిముక్తు
డగును, తనపితరులకు బ్రహ్మలోక ప్రాప్తికలుగును.

శ్లో॥ అత్రైవోదాహరంతీమం పురావృత్తం మహీపతే।
తచ్ఛృణుష్వ [illegible]పిమ్యేవం భక్త్యామైథిలసాదరమ్॥

తా॥ ఓ జనక రాజా! యీవిషయమై పురాతనకథ యొకటిగలదు చెప్పెదను సావధానుడవై వినుము.

శ్లో॥ ద్వాపరే బాహుజః కశ్చి ద్దురాత్మా వంగ దేశగః।
సోపినామ్నా సువీరేతి బహుశౌర్యపరాక్రమః।
రాజ్ఞ స్తస్యమహీపాల భార్యాబాలమృగేక్షణా॥

తా॥ ద్వాపరయుగమందు వంగదేశమందు దుష్టుఁడైన సువీరుడను నొక క్షత్రియుఁడు గలఁడు, చిన్నదైన లేళ్ళయొక్క చూపులవంటి చూపులుగలదియగు యొక స్త్రీ అతనికి భార్యగా నుండెను.

శ్లో॥ సోపికాలాత్తు దాయాద్దై ర్నిర్జితో వనమావిశత్।
అర్థాంగ్యా భార్యయా సాకం విచరన్ గహనే వనే।
దుఃఖేన మహతా యుక్తో నిర్ధనశ్చ మహీపతిః॥

తా॥ ఆరాజు కొంతకాలమునకు దైవయోగమువలన దాయాదులచేత జయించ బడినవాడై రాజ్యభ్రష్టుడై "అర్థో వా ఏష ఆత్మనో యత్పత్నీః" అను శ్రుత్యుక్త ప్రకారముగా భార్య అర్ధాంగి గనుక ఆమెనుకూడా తీసికొని అరణ్యమునకుఁబోయి ధనములేక జీవించుటకు చాలాదుఃఖపడుచుండెను.

శ్లో॥ తత్ర సాగుర్విణీ తస్య భార్యావన్యఫలాశనా।
నిర్మలే నర్మదాతీరే పర్ణశాలాం మహీపతిః।
తతః కాలేప్రసూతా సా కన్యాం కాంత్రసుందరీమ్॥

తా॥ ఆయరణ్యమందు రాజు భార్యయు కందమూలాదులు భక్షించుచు కాలము గడుపుచుండిరి అట్లుండగా భార్య గర్భవతి ఆయెను. నర్మదాతీరమందు రాజు పర్ణశాలను నిర్మించెను ఆపర్ణశాలయందామె సుందరియైన నొక కన్యకను గనెను.

శ్లో॥ సమరత్సయుత్తతో రాజా పూర్వపాపమనుస్మరన్।
వృద్ధింగతా రాజకన్యా సుకృతేన పురాకృతా।
రూపలావణ్యసంపన్నా నయనోత్సవకారిణీ॥

తా॥ రాజు అరణ్యనివాసము వస్త్రాహారము అందు సంతానసంభవము సంతానపోషణకు ధనము లేకుండుట మొదలైనవాటిని తలచుకొని తనపురాకృత పాపమును స్మరించుచు బాలికను కాపాడుచుండెను, తరువాత పూర్వపుణ్యవశముచేత ఆకన్యక వృద్ధినొంది సౌందర్యముతోను లావణ్యముతో నొప్పియున్నదై చూచువారికి నేత్రానందకారిణియై యుండెను.

శ్లో॥ అష్టవర్షాంమనోరమ్యాం దృష్ట్వాకశ్చిన్మునేస్సుతః।
వివాహార్థంమతించక్రే సుమీరంసమయాచత॥

తా॥ ఆచిన్నదానికి యెనిమిది సంవత్సరముల వయస్సు వచ్చినది మనస్సునకు బహురమ్యముగానున్నది యిట్లున్న కన్యకనుజూచి యొక మునికుమారుఁడు సుమీరా! నీకూతురును నాకిచ్చి వివాహము చేయుమని యాచించెను.

శ్లో॥ తతోవాచతతస్సోపి దరిద్రోహంమునేస్సుత।
ద్రవ్యం దేహియథోద్దిష్టం ఉద్వాహంయదికాంక్షసే॥

తా॥ ఆమాటవిని రాజు మునికుమారకా! నేను దరిద్రుఁడను గనుక నేనుకోరి నంత ధనమును నీవిచ్చితివేని యీకన్యను నీకిచ్చెదననెను.

శ్లో॥ ఇతిభూపవచశ్శ్రుత్వా కన్యాసంసక్తమానసః॥
మునిసూనురువాచేదం రాజానంమిథిలేశ్వర॥

తా॥ ఈమాటను విని మునికుమారుఁడు ఆకన్యయందుండు కోరికతో రాజుతో నిట్లనెను.

శ్లో॥ దాస్యామిద్రవిణంభూరి రాజన్ తేహంతపోబలాత్।
తేనతేరాజ్యసౌఖ్యాని భవిష్యంతినసంశయః॥
ఇతిశ్రుత్వావనేరాజా ఓమిత్యాహముదాన్వితః॥

తా॥ ఓరాజా! నేనుతపస్సుచేసి సంపాదించి బహుద్రవ్యమును నీకిచ్చెదను దానితో నీవు రాజ్యమందుండు సుఖములను పొందగలవని మునికుమారుఁడిట్లు చెప్పిన మాటను విని రాజు సంతోషించి ఆలాగునే చేసెదననెను.

శ్లో॥ తపశ్చచారతత్తీరే మునిసూనురుదారధీః।
తతోరాజన్ బలాద్ద్రవ్యం సమాకర్ష్యాహ్యతంద్రితః।
తత్సర్వమర్థంనృపతేః ప్రదదేమునిపుత్రకః॥

తా॥ తరువాత మునికుమారుఁడు అనర్మదాతీరమందే తపమాచరించి బహుద్రవ్యమును సంపాదించి ఆద్రవ్యమంతయు రాజున కిచ్చెను.

శ్లో॥ గృహీత్వార్థంవసూన్ రాజా హర్షాల్లబ్ధమనోరథః।
వివాహమకరోత్కన్యాం మునేస్తాపసజన్మనః॥
స్వగృహ్యోక్తవిధానేన కన్యాముద్వాహయద్వనే॥

తా॥ ఆరాజు ఆధనమంతయు గ్రహించి ఆనందించి తృప్తినొంది ఆమునికుమారునకు తనకూతురునిచ్చి తనయొక్క గృహ్యసూత్రమందు చెప్పబడిన ప్రకారముగా వివాహము అరణ్యమునందు చేసెను.

శ్లో॥ సన్తోధానపితత్త్వార్థం జగామమనుజేశ్వర।
కన్యాద్రవ్యేణనిత్యంవై హ్యాభూత్సోదరపోషకః॥

తా॥ ఆకన్యయు వివాహముకాగానే భర్తవద్దకుచేరెను, రాజుకన్యావిక్రయ ద్రవ్యములో తాను భార్యయు జీవించుచుండెను.

శ్లో॥ పునస్సువీరభార్యాసా ప్రజజ్ఞేకన్యకాంతథా।
ద్వితీయాంతనుజాందృష్ట్వా పునర్లబ్ధ్వాముదాన్వితః॥
ఇతఃవరంయథేష్టంమె ద్రవ్యంభూరిభవిష్యతి॥

తా॥ రాజు భార్య తిరిగి యొక కుమార్తెను కనెను రాజు దానినిజూచి సంతోషించి యీసారియీకన్యకను విక్రయించిన యెడల చాలాద్రవ్యము రావచ్చును దానితో నాజన్మమంతయు గడుచును అని సంతోషించుచుండెను.

శ్లో॥ ఏవంవిచింత్యమానేతు పుణ్యేనమహతాన్నప।
ఆజగామయతిఃకశ్చి త్స్నానార్థంనర్మదాంప్రతి।
పర్ణశాలాంకణేభూపం సభార్యమవలోకయత్॥

తా॥ రాజిట్లు తలచుచుండగా పూర్వపుణ్యవశముచేత నొక యతీశ్వరుడు స్నానార్థమునర్మదానదికివచ్చిపర్ణశాలముందరున్న రాజును, భార్యను, కూతురునుజూచెను

శ్లో॥ తమువాచకృపాసింధు ర్యతిఃకౌండిన్యగోత్రజః।
కిమర్థమత్రకాంతారే కోభవాన్వదసాంప్రతమ్॥

తా॥ చూచి కౌండిన్యసగోత్రుడైన యతీశ్వరుడు దయతో ఓయీనీవెవ్వడవు యీఅరణ్యమందిప్పుడెందుకున్నావు, చెప్పుమని అడిగెను.

శ్లో॥ ఏవంబ్రువంతమాహేదం భూపాలంకరుణానిధిం।
రాజాహంవంగదేశీయ స్సువీరఇతివిశ్రుతః।
రాజ్యార్థంతైశ్చదాయాదై ర్నిర్జితోస్మివనంగతః॥

తా॥ యతి యిట్లు అడిగినమాటలకుని రాజు చెప్పుచున్నాడు, అయ్యా నేను వంగదేశమును పాలించురాజును, నాపేరు సువీరుడు నాదాయాదులు రాజ్యకాంక్షచేత నన్నుజయించి నారాజ్యమును అపహరించిరి. నేను యీవనమందున్నాను.

శ్లో॥ నదారిద్ర్యసమందుఃఖం నశోకఃపుత్రమారణాత్।
నచవ్యథానుగమినేన వియోగఃప్రియావహాత్।
తస్మాత్తేనైవదుఃఖేన వనవాసంకృతంమయా।
శాకమూలఫలాద్యైశ్చ కృతాహారోస్మికాననే॥

తా॥ దారిద్ర్యముతో సమానమైన దుఃఖమును, పుత్రమృతితో సమానమైన శోకము, భార్యావియోగముతో సమానమైనవియోగదుఃఖమును లేవు కాబట్టి ఆదుఃఖముతో శాకమూల ఫలాదులను భుజింపుచు యీవనమందు నివాసముచేయుచు కాలము గడుపుచున్నాను.

శ్లో॥ కాంతారేస్మిన్ కుటీరే జాతా పర్ణాగారేతుకన్యకా।
తాంప్రవృత్తకుమారాయానాం దృష్ట్వా కస్మైవిప్రసుతాయచ।
తస్మాద్భూరిధనంవిప్ర గృహీతం యన్మయా నఘ।
నివసామిసుఖంత్వస్మిన్ కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి॥

తా॥ ఈఅరణ్యమందే పర్ణశాలలో నాకుకుమార్తెగలిగినదిఆచిన్నదానినియౌవ్వనమురాగానే యొకమునికుమారునివలన బహుధనమునుగ్రహించి వానికిచ్చివివాహము చేసి ఆదర్వ్యముతో సుఖముగా జీవించుచున్నాను యింకయేమి వినగోరితివో చెప్పుము.

శ్లో॥ ఇతిభూపవచశ్శ్రుత్వా పునరాహయతిస్తదా।
మూఢవత్కురుషేరాజన్ మహాపాతకసంచయమ్॥

తా॥ ఇట్లు రాజువాక్యమును విని యతి యిట్లనియె, రాజా! యెంతపనిచేసితివి మూఢునివలె పాతకములను సంపాదించుకొంటి వేమోయీ

శ్లో॥ కన్యాద్రవ్యేణయోజీవే దసిపత్రంసగచ్ఛతి।
దేవాన్ ఋషీన్ పితౄన్ శ్చాపి కన్యాద్రవ్యేణతర్పయేత్।
శాపందాస్యంతి తేసర్వే జన్మజన్మన్యపుత్రతామ్॥

తా॥ కన్యాద్రవ్యముచేత జీవించువాడు యమలోకమందు అసిపత్రవనమనునరకమందు నివసించును, కన్యాద్రవ్యముచేత దేవఋషి పితరులను తృప్తిజేయుచున్నవానికి వారు ప్రతిజన్మమందును యితనికి పుత్రులు కలుగరని శాపమును యిత్తురు.

శ్లో॥ యఃకన్యాద్రవ్యకలుషాం గృహీత్వావృత్తిమాశ్రయేత్।
సోఽశ్నీయాత్సర్వపాపాని రౌరవంనరకంవ్రజేత్॥

తా॥ కన్యాద్రవ్యముతో వృత్తిని సంపాదించి అవృత్తివల్ల జీవనముచేయు పాపాత్ముఁడు రౌరవనరకమును బొందును.

శ్లో॥ సర్వేషామేవపాపానాం ప్రాయశ్చిత్తంవిదుర్బుధాః।
కన్యావిక్రయశీలస్య ప్రాయశ్చిత్తంనచోదితమ్॥

తా॥ సమస్తమైన పాతకములకు ప్రాయశ్చిత్తముచెప్పబడియున్నదిగాని కన్యావిక్రయపాపమునకు ప్రాయశ్చిత్తము యెందును చెప్పఁబడియుండలేదు.

శ్లో॥ కార్తీకే శుక్లపక్షేతు ద్వితీయాం కన్యకాం తవ।
కన్యాదానం కురుష్వ త్వం సహిరణ్యోదకేనచ॥

తా॥ కాబట్టి యీ కార్తీక మాసమందు శుక్లపక్షమందు యీ రెండవ కూతురును కన్యాదానపూర్వకముగా వివాహము చేయుము.

శ్లో॥ విజ్ఞాయ తేజోయుక్తాయ శుభశీలాయ ధర్మిణే।
కన్యాదానం తుయః కుర్యాత్ కార్తిక్యాంచ శుభేదినే।
గంగాది సర్వతీర్థేషు స్నానదానేన యత్ఫలం।
అశ్వమేధాదభిర్యాగై రుక్తదక్షిణసంయుతైః।
యత్ఫలం జాయతే రాజన్ తత్ఫలం సోపిగచ్ఛతి॥

తా॥ కార్తీకమాసమందు విద్యా తేజశ్శీలయుక్తుడైన వరునకు కన్యాదానము చేసినవాడు గంగాది సమస్త తీర్థములందు స్నానదానములు చేసెడివాడు పొందెడి ఫలమును యథోక్తదక్షిణాయుతముగా అశ్వమేధాది యాగములను చేసినవాడు పొందెడి ఫలమును బొందును.

శ్లో॥ ఇత్యేవం గదితం శ్రుత్వా రాజా రాజకులేశ్వర।
యతిం ధర్మార్థతత్వజ్ఞం బాహుజః కృపణోబ్రవీత్॥

తా॥ ఇట్లు యతి చెప్పగా విని రాజు సకలధర్మవేత్తయైన యతితో నీచుడై యిట్లనియె.

శ్లో॥ కుతో లోకః కుతో ధర్మః కుతో దానం కుతః ఫలం। సుఖభోగై
ర్వినా విప్ర దేహేస్మిన్ సుఖకాంక్షిణీ। పుత్రదారాదయస్సర్వే
వాసోలంకరణానిచ। గృహక్షేత్రాణి సర్వాణి దేహాద్యాధర్మ
సాధనం॥ ద్వితీయాం మే దుహితరం యోద్రవ్యం భూరిదాస్యతి।
తస్యదాస్యే న సందేహః విప్రగచ్ఛ యథాసుఖమ్॥

తా॥ బ్రాహ్మణుడా యిదియేమి మాట. పుత్రదారాదులు, గృహక్షేత్రాదులు వాసోలంకారాదులు వున్నందుకు దేహమును సుఖపెట్టి భోగించవలెను గాని ధర్మమనగా యేమిటి పుణ్యలోకమనగా యేమిటి దానమనగా యేమిటి, ఫలమనగా యేమిటి, యేలాగు సాధనమైనను సంపాదించి భోగించుట ముఖ్యము, నా యీ రెండవ కూతురును పూర్తిగా ద్రవ్యమిచ్చు వానికిచ్చి ఆ ద్రవ్యముతో సుఖభోగములను బొందెదను నీ కెందుకు నీ దారిని నీవు పొమ్ము.

శ్లో॥ తతో యయౌ స ధర్మాత్మా దాయాం స్నానార్థం నృపపుంగవ।
నృపస్యాస్య గతే కాలే కాంతారే మరణం గతః॥

ఆయయుర్యమదూతాశ్చ పాశైరాబధ్య పాపినం।
యమమార్గాదక్షిణాశాం తతో జగ్ముర్యథాగతమ్॥

తా॥ ఆమాటవిని యతి స్నానముకొఱకు నర్మదానదికిపోయెను. తరువాత కొంత కాలమునకు ఆయుఃక్షయమందె సువీరుఁడు మృతినొందఁగా యమదూతలు పాశములతో సహా వచ్చి రాజునుగట్టి యమలోకమునకు తీసికొని పోయిరి.

శ్లో॥ తత్ర తం సమ్యగాలోక్య యమస్తామ్రారుణేక్షణః।
నరకేషు విచిత్రేషు బబాధరిపునందనః।
తథాసిపత్రఘోరేచ పితృభిస్సహ పాతయత్॥

తా॥ అచ్చట యముఁడు వానిని జూచి కన్నెఱ్ఱ చేసి అనేక నరకములందు యాతనలనుబొందించి అసిపత్రవనమందు రాజును రాజపితరులను గూడ పడవేయించెను. అసిపత్రవనమనగా కత్తులే ఆకులుగాఁగల వృక్షములతో గూడిన చిక్కని వనము.

శ్లో॥ సువీరస్యాన్వయే కశ్చిచ్ఛ్రుతకీర్తిర్మహీపతిః।
సర్వధర్మాంశ్చకారాసౌ తథా క్రతుశతాని చ।
పరిచకార స్వకం రాజ్యం ధర్మేణ మిథిలేశ్వర।
పశ్చాత్స్వర్గం సమాసాద్య సేవ్యమానస్సురేశ్వరైః॥

తా॥ ఈ సువీరుని వంశమందు శ్రుతకీర్తియను వాఁడొకఁడు సమస్తధర్మములను చేసి నూఱుయజ్ఞములు చేసి ధర్మముగా రాజ్యపాలనముచేసి స్వర్గమునకుఁబోయి యింద్రాదులచేత సేవింపబడుచుండెను.

శ్లో॥ సువీరః కర్మశేషేణ పితృభిర్నరకం గతః।
తత్ర వ్యచింతయద్దుఃఖాద్యాతనాహేతుమాత్మనః।
పూర్వపుణ్యప్రభావేన యమం ప్రాహాతినిర్భయః॥

తా॥ ఈ శ్రుతకీర్తి సువీరుని పాతకవిశేషముచేత స్వర్గమునుంచి తాను నరకమందుపడి యమయాతనలనొందుచు యొకనాడు యిదియేమి అన్యాయము పుణ్యముచేసిన నన్ను యమలోకమందుంచినారని విచారించుకొని ధైర్యముతో యమునితో నిట్లనియె.

శ్లో॥ వాక్యం మే శ్రుణు సర్వజ్ఞ ధర్మరాజ మహామతే।
పాపలేశవిహీనస్య కిమియం దుర్గతిర్మమ।
సర్వధర్మా వృథా యాంతి ప్రోక్తాః పూర్వమహర్షిభిః।
దివం విహాయ నరకాగమనం చ న సాంప్రతమ్॥

తా॥ సర్వమును దెలిసిన ధర్మరాజా నామనవి వినుము రెండవతేమాత్రిమహాపాపము చేయని నాకు యీనరకమెందుకు వచ్చినది అయ్యో మహాఋషీశ్వరులు చెప్పినధర్మము లన్నియు వృథాగాపోయినవే యినిగాక స్వర్గసం పన్నునాకునరకపాతమెందుకుగలిగినది

శ్లో॥ ఇతిశ్రుత్వాయమఃప్రాహ శ్రుతకీర్తే మహామతిం । అస్తికశ్చి ద్దురాచారో వంశజస్తు తవాద్యవై ॥ సువీనామ్నానువిరేతి కన్యాద్రవ్యేణజీవితం । తేనపాపేనపితరః పుత్రలోకంగతా అపి । దివశ్చ్యుతాభవంతీహ దుష్టయోనిషుభూతలే!

తా॥ శ్రుతకీర్తి యిట్లు చెప్పిన మాటను విని యముడు చెప్పుచున్నాడు, శ్రుత కీర్తి నీవన్నమాట సత్యమేగాని నీవంశస్థుడు సువీరుడను వాడొకడు దురాచారుడై కన్యాద్రవ్యముచేత జీవించినాడు ఆపాపముచేత వానిపితరులైన మీరు స్వర్గస్థులైనను నరకమందున్నారు తరువాత భూమియందు దుష్టయోనులలందు జన్మించెదరు.

శ్లో॥ ద్వితీయాతనుజాతస్య వర్ధతేమాతృసన్నిధౌ। పర్ణాగారేనృప శ్రేష్ఠ నర్మదాయాస్తటేవనే ॥ మత్ప్రసాదాద్భువంగచ్ఛ దేహేనానేనచానఘ। తత్రతిష్ఠంతిమునయ స్తేషామేతన్ని వేదయ । కన్యాంతాంశ్రితశీలాయ కార్తికేమాసిభక్తితః । కన్యాదానంకురుష్వత్వం సహిరణ్యోదకేనచ॥

తా॥ శ్రుతకీర్తి వినుము ఆసువీరునియొక్క రెండవకుమార్తెవున్నది నర్మదానదీ తీరమందు పర్ణశాలలలో తల్లి వద్దవున్నది దానికింకను వివాహము కాలేదు కాబట్టి నీవు నాప్రసాదమువలన యీదేహముతో అచ్చటికిపోయి అచ్చటవున్న మునులతో యీ మాటను చెప్పి ఆకన్యను యోగ్యుడైన వరునకు కార్తీకమాసమందు యిచ్చి కన్యాదాన విధానముగా పెండ్లిచేయుము.

శ్లో॥ సర్వాభరణసంపన్నాం యఃకన్యాంకార్తికేనఘ। ప్రయచ్ఛతివిధానేన సోపిలోకేశ్వరోభవేత్ ॥

తా॥ కార్తీకమాసమందు సర్వాలంకారయుక్తమైన కన్యనువరునకిచ్చువాడు లోకాధిపతియగును.

శ్లో॥ యదికన్యానజాయేత మాల్యంవాయఃప్రయచ్ఛతి। దాతుర్గోమిధునంమాల్యం కన్యాదానంతదుచ్యతే। కన్యాదానఫలంతస్య భవిష్యతినసంశయః॥

తా॥ అట్లు కన్యాదానము చేయుటకు సంతానము లేనివాడు పరబ్రాహ్మణునకు ధనమిచ్చిన యెడల ధనదాతయును లోకాధిపతియగును. కన్యలు లేనివాడు రెండు పాడియావులను యిచ్చి కన్యను తీసుకుని వరునికిచ్చి వివాహముచేసినయెడల కన్యాదాన ఫలము నొందును.

శ్లో॥ కురుత్వంద్రాక్చవిప్రేభ్యః కన్యామూల్యంవిధానతః।
ప్రీణంతిపితరస్సర్వే ధర్మేణానేనసంతతమ్॥

తా॥ కాబట్టినీవు శీఘ్రముగా పోయి బ్రాహ్మణులకు కన్యామూల్యమును యిమ్ము దానిచేత నీపితరులందరు తృప్తినొంది నిత్యము సుఖానవుందురు.

శ్లో॥ శ్రుతకీర్తిస్తథేత్యుక్త్వా యమునంత్వాగృహంగతః।
నర్మదాతీరసంస్థాంచ కన్యాంకనకభూషణాం।
కన్యాదానంతుకార్తిక్యాం చకారాసౌనృపోత్తమః।
కార్తికేశుక్లపక్షేతు విధినేశ్వరతుష్టయే॥

తా॥ శ్రుతకీర్తి యమునిమాటవిని ఆలాగునని యమునకువందనమాచరించి నర్మదాతీరమందున్న కన్యను సువర్ణాభరణభూషితగాచేసి కార్తికశుక్లపక్షమందు ఈశ్వరప్రీతిగా విధ్యుక్తముగా కన్యాదానము చేసెను.

శ్లో॥ తేనపుణ్యప్రభావేన సువీరోయమపాశతః।
విముక్తస్స్వర్గమాసాద్య సుఖేనపరిమోదతే॥

తా॥ ఆపుణ్యమహిమచేత సువీరుఁడు యమపాశవిముక్తుఁడై స్వర్గముకుఁబోయి సుఖముగా యుండెను.

శ్లో॥ తస్మైవదశవిప్రేభ్యః కన్యామూల్యందదావసౌ।
ప్రయాంతిపితరస్సర్వే పుణ్యలోకంమహీపతే।
పాపానియానిచోగ్రాణి విలయంయాంతితత్క్షణాత్।
తతస్స్వర్గగతోరాజా శ్రుతకీర్తిర్యథాగతమ్॥

తా॥ తరువాత శ్రుతకీర్తి పదిమంది బ్రాహ్మణ బ్రహ్మచారులకు కన్యామూల్యమును యిచ్చెను దానిచేత వానిపితరులందరు విగతపాపులై స్వర్గమునకు పోయిరి, తానును యథాగతముగా స్వర్గముచేరెను.

శ్లో॥ యస్తస్మాత్కార్తికేమాసి కన్యాదానంకరిష్యతి।
హత్యాదిపాతకైస్సర్వై ర్విముక్తోనాత్రసంశయః॥

తా॥ కాఁబట్టి కార్తికమాసమందు కన్యాదాన మాచరించువాడు విగతపాపుఁడగును, ఇందుకు సందేహములేదు.

శ్లో॥ వాణ్యావాసేన ఫలతోనే వివాహార్థం సగేశ్వర।
సహాయం యే ప్రకుర్వంతి తేషాం పుణ్యామసంతకమ్॥

తా॥ కన్యాయూల్యమును యివ్వలేనివారు మాటతోనైనా వివాహమును సహాయము చేసినగాని వారిపుణ్యమునకు అంతములేదు.

శ్లో॥ యఃకార్తికే వ్రతే స్వస్థో విధినా ప్రసమాచరేత్।
సయాతివిష్ణుసాయుజ్యం సత్యం సత్యం మయోదితం।
నాచరేద్యదివా మోహాత్ రౌరవం తేసమశ్నుతే॥

తా॥ కార్తీకమాసమందు కార్తీకవ్రతమాచరించువాడు హరిసాయుజ్యమును పొందును యిదినిజము నామాట సత్యము అట్లు కానిముగా కార్తీకవ్రత మాచరించనివారు రౌరవనరకమును పొందుదురు.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే త్రయోదశోధ్యాయస్సమాప్తః.

## 14. అథ చతుర్దశాధ్యాయారంభః.

వసిష్ఠఉవాచ॥ శ్లో॥ పౌర్ణమ్యాం కార్తికేమాసి వృషోత్సర్గం కరోతియః।
తస్యపాపాని నశ్యంతి జన్మాంతరకృతానిచ॥

తా॥ కార్తీకపూర్ణిమానాడు వృషోత్సర్గమును (ఆంబోతు అచ్చుపోయుట) చేయువానికి జన్మాంతర పాపములు నశించును.

శ్లో॥ యః కార్తికే వృషోత్సర్గం పౌర్ణమ్యాం పితృతృప్తయే।
సంకుర్యాద్విధినా రాజన్ తస్యపుణ్యఫలం శృణు॥
గయాశ్రాద్ధంకృతం తేన కోటివారం నసంశయః।
పుణ్యాదం మానుషేలోకే దుర్లభం కార్తీకవ్రతమ్॥

తా॥ కార్తీకవ్రతము మనుష్యలోకమందు దుర్లభము అనగా సులభముగా ముక్తిని యిచ్చునదని భావము కార్తీకపూర్ణిమనాడు పితృప్రీతిగా వృషోత్సర్గమును చేయువానికి కోటిమారులుగ గయాశ్రాద్ధమును చేసిన ఫలము గలుగును.

శ్లో॥ యఃకోవా స్మత్కులేజాతః పౌర్ణమాస్యాంతు కార్తికే।
ఉత్సృజేద్వృషభం నీలం తేనతృప్తా వయంత్వితి।
కాంక్షంతి నృపశార్దూల పుణ్యలోకస్థితా అపి॥

తా॥ స్వర్గమందున్న పితరులు మనవంశమందు నెవ్వఁడైనను కార్తికపూర్ణమ నాఁడు నల్లని గిత్తను విడుచునా అట్లైనపునము తృప్తిఁబొందుదుము అని కోరుచుందురు.

శ్లో॥ పౌర్ణమాస్యాం కార్తికే మాసి ఆఢ్యో వాప్యథవాపివా।
నోత్సృజేద్వృషభం లోభాత్సయాత్యంధతమోయమాత్॥

తా॥ ధనవంతుఁడుగాని దరిద్రుఁడుగాని కార్తిక పూర్ణిమరోజున వృషోత్సర్గ మును చేయనివాఁడు యమలోకమందు అంధతమిస్రమను నరకమును బొందును.

శ్లో॥ పిండదానాద్గయాశ్రాద్ధాత్ప్రత్యబ్దం ప్రతివత్సరే।
పుణ్యతీర్థాసంగమనాత్తర్పణాచ్చ మహాలయాత్।
కార్తికే పౌర్ణమాస్యాంతు వృషోత్సర్గం వినాగతిః॥

తా॥ కార్తిక పూర్ణిమరోజున వృషోత్సర్గమును చేయక గయాశ్రాద్ధమాచ రించినను ప్రతిసంవత్సరము తద్దినము పెట్టినను పుణ్యతీర్థములు సేవించినను మహాలయము పెట్టినను పితరులకు తృప్తిలేదు.

శ్లో॥ గయాశ్రాద్ధం వృషోత్సర్గం సమమాహుర్మనీషిణః।
ప్రశస్తమూర్జే పౌర్ణమాస్యాం వృషోత్సర్గస్సుఖప్రదః॥

తా॥ గయాశ్రాద్ధమును వృషోత్సర్గమును సమానమని విద్వాంసులు వచించిరి, కాబట్టి కార్తికపూర్ణిమనాఁడు వృషోత్సర్గము సుఖము నిచ్చును.

శ్లో॥ యఃకుర్యాత్కార్తికే మాసి సర్వధర్మాధికం ఫలం।
ఋణత్రయాద్విముచ్యేత కిమన్యైర్బహుభాషణైః॥

తా॥ అనేకమాటలతో పనియేమున్నది కార్తికమాసమందు అన్ని పుణ్యములకంటె అధిక మైనఫలదానము చేయువాఁడు దేవఋణమనుష్యఋణపితౄఋణములనుంచివిముక్తుఁడగును.

శ్లో॥ యోధాత్రీఫలదానంతు పౌర్ణమాస్యాం చ సదక్షిణం।
కురుతే నృపశార్దూల సార్వభౌమో భవేద్ధ్రువమ్॥

తా॥ కార్తికపూర్ణిమనాఁడు దక్షిణతోఁగూడా ధాత్రీఫలమును (ఉసిరిక పండును) దానమిచ్చువాఁడు సార్వభౌముఁడగును అనఁగా అంతభూమికి ప్రభువగును.

శ్లో॥ యఃకుర్యాద్దీపదానంచ పౌర్ణమాస్యాం కార్తికే నఘ।
సర్వపాపవినిర్ముక్తో విష్ణోర్యాంతి పరాంగతిమ్॥

తా॥ కార్తిక పూర్ణిమనాఁడు దీపదానమాచరించువాఁడు విగతపాపుఁడై పరమ పదము నొందును.

శ్లో॥ కర్మణామనసావాచా పాపంయస్సమ్యగాచరేత్।
తస్యపాపానినశ్యంతి కార్తిక్యాందీపదానతః॥

తా॥ కార్తికమాసమందు దీపదానమాచరించువాని మనోవాక్కాయకృత పాపములన్నియు నశించును.

శ్లో॥ లింగదానంపౌర్ణమాస్యాం కార్తిక్యాంశివతుష్టయే।
ఇహసమ్యక్ఫలంప్రాప్య సార్వభౌమోభవేద్ధ్రువమ్॥

తా॥ కార్తికపూర్ణిమనాడు లింగదాన మాచరించువాడు ఈజన్మమందు అనేక భోగముల ననుభవించి యుత్తరజన్మమందు సార్వభౌముడగును.

శ్లో॥ పాపఘ్నంపుణ్యదంప్రాహు ర్లింగదానంమనీషిణః॥
లింగదానమనాదృత్య యఃకుర్యాత్కార్తికవ్రతం।
వజ్రలేపోభవేత్తస్య పాపరాశిర్నసంశయః॥

తా॥ లింగదానమువలన పాపములు నశించును పుణ్యము గలుగును కార్తికమాసమందు లింగదానము చేయక మిగిలిన ధర్మములు చేసినందున పాపములు ఇంతమాత్రమును కరిగిపోవు.

శ్లో॥ అనంతఫలదంప్రోక్తం దుర్లభంకార్తికవ్రతం।
పరాన్నంపితృశేషంచ నిషిద్ధస్యచభక్షణం।
శ్రాద్ధాన్నంతిలదానంచ కార్తికేపంచవర్జయేత్॥

తా॥ కార్తికవ్రతము అనంతఫలప్రదము సామాన్యముగా దొరకనిది కనుక కార్తికమాసమందు పరాన్నమును భుజించుట పితృశేషమును తినకూడని వస్తువులను భక్షించుట, శ్రాద్ధాన్నమును సేవించుట, అనగా భోక్తగానుండుట, తిలదానమును గ్రహించుట, యీఐయిదును విడువవలెను.

శ్లో॥ గణాన్నంవృషలస్యాన్నం దేవలాన్నమసంస్కృతం।
వ్రాత్యాన్నంవిధవాన్నంచ కార్తికేమద్వివర్జయేత్॥

తా॥ కార్తికమాసమందు సంఘాన్నమును, శూద్రాన్నమును, దేవార్చకుల అన్నమును, అపరిశుద్ధాన్నమును, కర్మలను విడిచి చెప్పినవాని అన్నమును విధవాన్నమును భుజించరాదు.

శ్లో॥ అమాయాంపౌర్ణమాస్యాంచ ప్రత్యబ్దేభానువాసరే।
సోమసూర్యోపరాగేచ ఊర్జేననిశిభోజనమ్॥

తా॥ కార్తీకమాసమందు ఏకాదశ్యాం యందును, పూర్ణిమయందును, పితృదినమందును, ఆదివారమందును సూర్యచంద్రగ్రహణములందును, రాత్రిభోజనము నిషిద్ధము.

శ్లో॥ ఏకాదశ్యామహోరాత్రిం వ్యతీపాతేచ వైధృతౌ।
నిషిద్ధదివసే రాజన్ గృహీయః కార్తీకవ్రతే॥
విష్ణోర్దినస్యయత్నేన పూర్వోత్తరదినద్వయే।
మాసనక్తవ్రతాధీనో నకుర్యాన్నిశిభోజనమ్।
నిషిద్ధదివసే ప్రోక్తం ఛాయానక్తం మహర్షిభిః।
నక్తవ్రతఫలం తేన ననక్తం నిశిభోజనమ్॥

తా॥ కార్తీకమాసమందే కాదశినాడు రాత్రింబగల్లును వ్యతీపాత వైధృతి మొదలైన నిషిద్ధదినములందును రాత్రిని భుజించరాదు మాసనక్తవ్రతమును ఆచరించినవాడును నేకాదశికి పూర్వోత్తర దినములందును రాత్రి భుజించరాదు అప్పుడు ఛాయానక్తమును జేయవలెనుగాని రాత్రిభోజనము చేయకూడదు ఛాయానక్తమే రాత్రిభోజన ఫలమిచ్చును. కనుక రాత్రిభోజనము గూడని దినములందు కార్తికవ్రతస్థుడు ఛాయానక్తమునే గ్రహించవలెను ఛాయానక్తమనఁగా తనశరీరము కొలతకు రెట్టింపునీడ వచ్చినప్పుడు భుజించుట, యిగి నిషిద్ధదినములందు గృహిణిని యెల్లప్పుడు యతివిధవలకును విహితము.

శ్లో॥ సర్వపుణ్యప్రదే రాజన్ కార్తీకేమాసియః పుమాన్।
నిషిద్ధదివసేచాన్నం భోజనం కురుతేయది।
తస్యపాపస్యవిస్తారం కథం తే ప్రబ్రవీమ్యహమ్॥

తా॥ సమస్తపుణ్యములను యిచ్చు కార్తీకమాసమందు నిషిద్ధదినములందు భుజించువాని పాతకములు అనంతములగును.

శ్లో॥ తస్మాద్విచార్యయత్నేన కార్తీకవ్రతమాచరేత్।
తైలాభ్యంగం దివాస్వాపం తథావై కాంస్యభోజనం।
శతాన్నిదాం గృహేస్నానం నిషిద్ధేనిశిభోజనం।
వేదశాస్త్రవినిందాంచ కార్తీకేసప్తవర్జయేత్॥

తా॥ కాఁబట్టి విచారించి కార్తీకవ్రతమును ఆచరించవలెను కార్తికమాసమందు తైలాభ్యంగనము, దివానిద్రయు, కంచుపాత్రిలో భోజనము, మతాన్నభోజనము, గృహమందు స్నానము, నిషిద్ధదినములందు రాత్రిభోజనము, వేదశాస్త్రనిందయు ఈయేడును జరుపగూడదు.

శ్లో॥ ఉష్ణోదకేననకర్తవ్యం స్నానంయాత్రైవకార్తీకే।
స్నానం తత్సురయాప్రోక్తం నిశ్చితం బ్రహ్మణాపురా।
పటుర్భూత్వా గృహేస్నానం యఃకుర్యాదుష్ణవారిణా॥

తా॥ కార్తీకమాసమందు శక్తి సామర్థ్యములుండియు గృహమునందు ఉష్ణోదకస్నాన మాచరించిన యెడల ఆస్నానము కల్లుస్నానమని బ్రహ్మదేవుడు చెప్పెను.

శ్లో॥ నదీస్నానంతుకర్తవ్యం తులాసంస్థేదివాకరే।
కార్తికేమాసిరాజేంద్ర ఉత్తమంతంప్రచక్షతే॥

తా॥ తులయందు రవియుండగా కార్తికమాసమందు నదీస్నానము ముఖ్యము

శ్లో॥ తటాకకూపకుల్యానాం జలేవాస్నానమాచరేత్।
వినాగంగాంవినాగోదాం వినాతద్వత్సరిద్వరాం।
తట్టాకకూపకుల్యానాం సుగంగామభివాదయేత్॥

తా॥ అట్లు నదియుండనంతలో తటాకమందుగాని కాలువలందుగాని బావులందుగాని స్నానము చేయవలెను తటాకకూపకుల్యలందు స్నానసమయమున గంగాప్రార్థన చేయవలెను గంగయందును గోదావరియందును మహానదులందును అవసరము లేమ (లేక) గంగాగోదావరి మొదలైన నదులు సన్నిధిలో లేనప్పుడు తటాకాదిస్నానము కర్తవ్యము.

శ్లో॥ సంప్రాప్యకార్తికంమాసం స్నానంయోనసమాచరేత్।
సగచ్ఛేన్నరకంఘోరం చాండాలీంయోనిమాప్నుయాత్॥

తా॥ కార్తికమాసమందు ప్రాతస్స్నానమాచరించనివాడు నరకమందు యాతనలను అనుభవించి తరువాత చండాలుడై పుట్టును.

శ్లో॥ గంగాదిసర్వనదీశ్చ స్మృత్వాస్నానంసమాచరేత్।
తతోభివాదనంకుర్యాత్ సూర్యమండలగంహరిమ్।
కృత్వావిష్ణుకథాందివ్యాం విప్రైస్సార్థంగృహంవ్రజేత్॥

తా॥ గంగాది నదుస్తనదులను స్మరించి స్నానముచేసి సూర్యమండల గతుడైన హరిని ధ్యానించి హరిచరిత్రను విని గృహమునకు వెళ్లవలెను.

శ్లో॥ దినాంతేసర్వకర్మాణి సమాప్యవిధినానృప।
పాదౌప్రక్షాళ్యచాచమ్య పూజాస్థానంప్రవేశయేత్।
పూజయేదీశ్వరంతత్ర షోడశైరుపచారకైః॥
పీఠస్థంపూజయేచ్ఛంభుం కల్పోక్తవిధినానఘ।
పంచామృతవిధానేన ఫలతోయైఃకుశోదకైః॥
స్నాపయేత్పుణ్యసూక్తైశ్చ భక్త్యాగౌరీపతింప్రభుమ్॥

తా॥ పగలు చేయదగిన వ్యాపారములన్నియును చేసికొని సాయంకాలము తిరిగి స్నానముచేసి ఆచమించి పూజాస్థానమందు పీఠముంచి దానియందుశంకరునుంచిపంచా

ఘృతములతోను, ఫలోదకములతోను, కుశోదకములతోను, మహాస్నానము చేయించి షోడశో (౧౬) ఉపచారములతోను బూజింపవలెను.

శ్లో॥ తతశ్చావాహయేద్దేవం శంకరం పరమేశ్వరం।
వృషధ్వజాయధ్యానంచ పాద్యం గౌరీప్రియాయచ।
అర్ఘ్యంలోకేశ్వరాయేతి రుద్రాయాచమనీయకం।
స్నానం గంగాధరాయేతి వస్త్రమాశాంబరాయచ।
జగన్నాథాయోపవీతం గంధం కపాలధారిణే।
అక్షతానీశ్వరాయేతి పుష్పం పూర్ణగుణాత్మనే।
ధూమ్రాక్షాయేతిధూపం నై తేజోరూపాయదీపకం।
లోకరక్షాయనైవేద్యం తాంబూలంలోకసాక్షిణే।
ప్రదక్షిణం భవాయేతి నమస్కారం కపాలినే॥

తా॥ తరువాత శంకరుని ఆవాహనము చేయవలెను తరువాత ౧ వృషధ్వజాయధ్యానం సమర్పయామి ౨ గౌరీప్రియాయపాద్య స......మి 3 లోకేశ్వరాయ అర్ఘ్యం స...యామి ౪ రుద్రాయ ఆచమనీయం స......మి ౫ గంగాధరాయస్నానం స... ...మి ౬ ఆశాంబరాయవస్త్రం స......మి ౭ జగన్నాథాయ ఉపవీతం స......మి ౮ కపాలధారిణేగంధం స......మి ౯ ఈశ్వరాయఅక్షతాన్ స......మి ౧౦పూర్ణగుణాత్మనెపుష్పం స......మి ౧౧ ధూమ్రాక్షాయధూపం స......మి ౧౨ తేజోరూపాయదీపం స......మి ౧౩ లోకరక్షాయనైవేద్యం స......మి ౧౪ లోకసాక్షిణే తాంబూలం స......మి ౧౫ భవాయప్రదక్షిణం స......మి ౧౬ కపాలినేనమస్కారం సమర్పయామి యీ ప్రకారముగా షోడశోపచారములచేత శంకరుని పూజింపవలెను.

శ్లో॥ ఏతైర్నామభిర్భక్త్యా పూజయేద్గిరిజాపతిం।
శంభోర్నామసహస్రేణ మాసమేకంనిరంతరం।
పూజాంతేచార్పయేదర్ఘ్యం మాసస్తవప్రతేన్నృప।
పార్వతీకాంత దేవేశ పద్మజార్చ్యాంఘ్రిపంకజ।
అర్ఘ్యంగృహాణదైత్యారె దత్తంచేదముమాపతే।
అర్చయేచ్ఛంకరంభక్త్యా యస్సధన్యోనసంశయః॥

తా॥ పైన చెప్పిన నామములతో భక్తితో బూజించి మాసమంతయు సహస్రనామములచేత నిత్యము పూజించి పూజావసానమందు (మంత్రము) “ శ్లో॥ పార్వతీకాంత దేవేశ పద్మజార్చ్యాంఘ్రిపంకజ।అర్ఘ్యంగృహాణదైత్యారెదత్తంచేదముమాపతే”

అను మంత్రముతో అర్ఘ్య మిచ్చి యన్నదానము లిట్లు శ్రాద్ధము చేయువాడు ముక్తుఁడగును, సంశయములేదు.

శ్లో॥ తథాపివిత్తానుసారేణ దీపదానం నృప।
దత్వాదానంతువిప్రేభ్యో విత్తశాఠ్యం నకారయేత్॥

తా॥ తనశక్తికొలది దీపదానములను సమర్పించి శ్రాద్ధము చేసి బ్రాహ్మణులకు దాన మివ్వవలెను.

శ్లో॥ ఏవంవిప్రవరైస్సార్థం సత్రంయః కార్తికవ్రతీ।
కురుతేనృపశార్దూల తస్యపుణ్యఫలంశృణు।
అగ్నిష్టోమసహస్రాణి వాజపేయశతానిచ।
అశ్వమేధసహస్రాణాం ఫలంప్రాప్నోత్యసంశయః॥

తా॥ ఈప్రకారము కార్తికమాసమందు బ్రాహ్మణులతో గూడి సత్రవ్రతము చేయువాడు వేయిసోమయాగములు నూరువాజపేయయాగములు వేయిఅశ్వమేధయాగములు చేసిన ఫలమును బొందును.

శ్లో॥ మాసవ్రతంచయఃకుర్యాదిత్యేవం విధినా నృప।
పాపమూలోద్ఘాటనంచ తమాహుర్నారదాదయః॥

తా॥ కార్తికమాసము ఈప్రకారముగా మాసవ్రతమాచరించువాడు పాపములను సమూలముగా పరిహరించికొనునని నారదాదులు చెప్పిరి.

శ్లో॥ మాసవ్రతంమహాత్పుణ్యం సర్వపాపవినాశనం।
సర్వపుణ్యప్రదంస్త్రీణాం కార్తికేనాత్రసంశయః॥

తా॥ కార్తికమందు మాసవ్రతమువలన పుణ్యముగలుగును సమస్త పాపములు నశించును యిందుకు సందేహములేదు.

శ్లో॥ యఃకార్తికేచతుర్దశ్యాం పితౄనుద్దిశ్యభక్తితః।
బ్రాహ్మణాన్భోజయేద్దేవం ప్రీణంతిపితరోఽఖిలాః॥

తా॥ కార్తికమాసమందు చతుర్దశియందు పితృప్రీతికొఱకు బ్రాహ్మణునకు భోజనము పెట్టిన యెడల పితరులందరు తృప్తినొందుదురు.

శ్లో॥ యఃకార్తికేసితేపక్షే చతుర్దశ్యాంనరేశ్వర।
ఔరసఃపితృభక్త్యాయ స్తిలైస్సంతర్పణేద్యది।
ప్రీణంతిపితరస్సర్వే పితృలోకంగతాఅపి॥

తా॥ కార్తికమాసమందు శుక్లచతుర్దశియందు ఔరసపుత్రుడు తిలతర్పణ మాచరించిన యెడల పితృలోకస్థులైన పితరులు తృప్తినొందుదురు.

శ్లో॥ యఃకుర్యాత్ఫలదానంతు చతుర్దశ్యాంతు కార్తికే।
నతస్యసంతతేర్హాని ర్జాయతేనాత్రసంశయః॥

తా॥ కార్తికమాసమందు చతుర్దశినాడు ఫలదాన మాచరించువానిని సంతతికి విచ్ఛేదము గలుగదు సందేహములేదు.

శ్లో॥ యఃకుర్యాత్తిలదానంతు చతుర్దశ్యాంతు కార్తికే।
ఉపోష్యశంకరంపూజ్య సకైలాసేశ్వరోభవేత్॥

తా॥ కార్తికమాసమందు చతుర్దశినాడు ఉపవాసమాచరించి శంకరుని ఆరాధించి తిలదాన మాచరించువాడు కైలాసమునకు ప్రభువగును.

శ్లో॥ సర్వపాపప్రశమనం పుణ్యదంకార్తికవ్రతమ్।
యఃకుర్యాత్సోపిపాపేభ్యో విముక్తోమృతమశ్నుతే॥

తా॥ సమస్తపాపములను పోగొట్టునదియు సమస్తపుణ్యములను వృద్ధిపరచునదియు అయిన కార్తికవ్రతమును చేయువాడు గతపాపుడై మోక్షమొందును.

శ్లో॥ ఇదంపవిత్రంపరమం అధ్యాయంయశ్శ్రుణోత్యతః।
ప్రాయశ్చిత్తంపరంప్రాహుః పాపానాంనాత్రసంశయః॥

తా॥ పవిత్రకరమైన యీఅధ్యాయమును భక్తితో వినువారు సమస్తపాతకములకు ప్రాయశ్చిత్తము చేసుకొన్నవారగుదురు.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే చతుర్దశోధ్యాయస్సమాప్తః.

---

## అథ పంచదశోధ్యాయారంభః.

వసిష్ఠఉవాచ॥ శ్లో॥ రాజన్ కార్తికమాహాత్మ్యం పవిత్రంపాపనాశనం।
సర్వపుణ్యప్రదంభూయో వక్ష్యామిశ్రుణుభక్తితః॥

తా॥ ఓ జనకమహారాజా! తిరిగి కార్తిక మాహాత్మ్యమును జెప్పెదను భక్తితో వినుము. విన్నవారికి పాపములు నశించును పుణ్యము గలుగును.

శ్లో॥ కార్తికేవిష్ణవేగేతు యఃకుర్యాన్నర్తనంనరః।
పాపానివినిహంత్యాశు సవిష్ణోరాలయేవసేత్॥

తా॥ కార్తికమాసమందు హరిముందర నాట్యము చేయువాడు విగతపాపుడై హరి మందిర నివాసి యగును.

శ్లో॥ దీపమాలార్పణంవిష్ణో ర్ద్వాదశ్యాంకార్తికస్యచ।
యఃకుర్యాత్సోపివైకుంఠం ప్రాప్యతత్రప్రమోదతే॥

తా॥ కార్తికమాసమందు ద్వాదశినాడు హరికి దీపమాలార్పణ చేయువాడు వైకుంఠమునకుబోయి సుఖించును.

శ్లో॥ కార్తిక్యాంచసితేపక్షే సాయాహ్నే కేశవార్చనం।
యఃకరిష్యతిరాజేంద్ర సోపిస్వర్గాధిపోభవేత్॥

తా॥ కార్తికమాసమందు శుక్లపక్షమందు సాయంకాలమందు హరినిబూజించువాడు స్వర్గాధిపతియగును.

శ్లో॥ యఃకుర్యాన్నిత్యయాత్రాంచ కార్తిక్యాంవిష్ణుమందిరే।
పదేపదేఽశ్వమేధస్య ఫలంప్రాప్నోత్యసంశయః॥

తా॥ కార్తికమాసమందు యెల్లకాలము నియతముగా విష్ణ్వాలయమునకు దర్శనార్థముపోవువాడు వొక్కొక్క అడుగునను అశ్వమేధయాగఫలమునుపొందునుసందేహములేదు.

శ్లో॥ విష్ణోరాయతనంప్రాప్య విష్ణుంయశ్చావలోకయేత్।
సవైకుంఠపురంగత్వా విష్ణుసాలోక్యమేష్యతి॥

తా॥ కార్తికమాసమందు హరిసన్నిధికిపోయి హరినిదర్శించువాడు విష్ణుసాలోక్యముక్తిని బొందును.

శ్లో॥ కార్తిక్యాంవిష్ణుభవనం యోనగచ్ఛేన్నరాధమః।
సగచ్ఛేద్రౌరవంఘోరం కాలసూత్రంభయంకరమ్॥

తా॥ కార్తికమాసమందు విష్ణ్వాలయము దర్శనార్థము వెళ్లనివాడు రౌరవనరకమును కాలసూత్రనరకమునుబొంది బాధింపబడును.

శ్లో॥ కార్తిక్యాంచసితేపక్షే ద్వాదశీహరిబోధినీ।
తస్యాంయద్యత్కృతంకర్మ అక్షయంజాయతేనృణామ్॥

తా॥ కార్తికశుక్లద్వాదశి హరిబోధినిగనుక ఆరోజునచేయు పుణ్యము కంతములేదు.

శ్లో॥ భక్త్యాయఃకార్తికేమాసి అర్చయేదచ్యుతంనరః।
గంధపుష్పాక్షతైస్సమ్యక్ ధూపదీపైర్మనోహరైః।
భక్ష్యైర్భోజ్యైశ్చనైవేద్యై ర్ద్వాదశ్యాంకార్తికస్యచ।
యఃకరోతిమహీపాల ద్విజైస్సార్థమతంద్రితః।
తస్యపుణ్యస్యవిస్తారం నజానామికథంచన॥

తా॥ కార్తికశుక్లద్వాదశినాడు బ్రాహ్మణులతోగూడిభక్తితో హరిని గంధ

ములతోను, పుష్పములతోను, అక్షతలతోను, [illegible], [illegible], ఆజ్య భక్ష్యనైవేద్యములతోను, పూజించువాని పుణ్యమునకు మితిలేదు.

శ్లో॥ ద్వాదశ్యాంకార్తికేమాసి విష్ణోర్వాశంకరస్యవా।
యఃకుర్యాద్దీపలక్షంతు యథావిత్తానుసారతః।
సర్వపాపవినిర్ముక్తో విమానమధిరుహ్యాచ।
సంస్తూయమానస్త్రిదశైః విష్ణులోకంసగచ్ఛతి॥

తా॥ కార్తీక శుక్ల ద్వాదశీనాడు విష్ణ్వాలయమందుగాని శివాలయమందుగాని లక్షదీపములను వెలిగించి సమర్పించినవాడు విమాన మెక్కి దేవబృందముచేతకొనియాడబడుచు విష్ణులోకమును చేరి సుఖించును.

శ్లో॥ దీపార్పణేహ్యాశక్తశ్చే న్మాసమేకంనిరంతరం।
దినత్రయేష్వవాకార్యం కార్తికేరాజసత్తమ।
ద్వాదశ్యాంపౌర్ణమాస్యాంచ చతుర్దశ్యాంమహామతే॥

తా॥ కార్తీకమాసము నెలరోజులు దీపమును పెట్టలేనివాడు శుక్లద్వాదశినాడును, చతుర్దశినాడును, పూర్ణిమనాడును, మూడురోజులు పెట్టవలెను.

శ్లో॥ యోదీపమర్పయేద్భక్త్యా రాజన్గోదోహనావధి।
తతస్తేనైవపుణ్యేన పూతోభవతినిశ్చితమ్॥

తా॥ కార్తీకమాసమందు దేవసన్నిధిలో ఆవును పాలు పితుకునంతకాలము దీపమును వుంచినయెడల పుణ్యవంతుడగును.

శ్లో॥ కార్తిక్యామథవారాజన్ పరదీపప్రబోధనం।
భక్త్యాయఃకురుతేవిష్ణో స్సోపిపాపాద్విముచ్యతే॥

తా॥ కార్తీకమాసమందు హరిసన్నిధిలో వుంచిన పరునిదీపమును బాగుచేసినవాడు విగతపాపుడగును.

శ్లో॥ నశ్యమానంతుయోదీపం కార్తికేయత్ప్రబోధనం।
దారుణాన్యపిపాపాని తస్యనశ్యంతితత్క్షణాత్॥

తా॥ కార్తీకమాసమందు పరుడు వెలిగించిన దీపము నశించినంతలో దానిని తిరిగి వెలిగించువాడు దారుణములైన పాపములను నశింపచేయును.

శ్లో॥ అత్రైతేతిహాసంవక్ష్యామి పుణ్యాదంకల్మషాపహం।
పురాసరస్వతీతీరే రమ్యాదుర్మలతాయుతే।
విష్ణోర్జీర్ణాలయంతత్ర ఆసీదాకల్పకావధి॥

తా॥ ఈవిషయమునందొక పూర్వపుకథగలదు విన్నంతనే పాపములు నశించును. సావధానముగా వినుము, పూర్వమందు సరస్వతీ తీరమందు సృష్టిమొదలు పూజానైవేద్యములులేక శిథిలించిన విష్ణ్వాలయ మొకటిగలదు.

శ్లో॥ ఆజగామయతిఃకశ్చిత్ స్నానార్థంకార్తికేశుభే।
సస్నాత్వాతత్రతత్తీరే విష్ణోరాయతనంయయా।
సనామ్నాకర్మనిష్ఠేతి సర్వభూతదయాపరః॥

తా॥ కార్తికస్నానార్థము కర్మనిష్ఠుడను యొక యతీశ్వరుడు ఆసరస్వతీ తీరమునకు వచ్చెను.

శ్లో॥ తత్రైకాంతస్థలేయోగీ తపఃకర్తుంమనోదధే।
సమ్యక్సంమార్జ్యయోగీశః విష్ణోరాయతనంతదా।
తతోవిదూరేగ్రామంతు గత్వాతైలంసమానయత్।
దీపపాత్రతథావర్తిం సమర్ప్యాధరిమందిరే॥
దీపద్వాదశకంరాజన్ అర్పయేద్భక్తితోఽనఘ।
సమాధిస్థోబభూవాసౌ మునిస్తత్రమహామతిః॥

తా॥ వచ్చి యిది యేకాంతముగా తపస్సుకనుకూలముగావున్నదనియెంచి ఆజీర్ణాలయమందుధూళినితుడిచిజలమునుప్రోక్షించిదగ్గరనున్నగ్రామముకుబోయినూనెతెచ్చిపండ్రెండు దీపపాత్రలనుదెచ్చి దీపములు వెలిగించి హరికిసమర్పించి యతి సమాధిలోనుండెను.

శ్లో॥ తేనేత్థంక్రియమాణేతు కార్తికేమాసిభూమిప।
కార్తికస్యాంచసితేపక్షే సాయాహ్నేద్వాదశీదినే।
ఆగత్యచవిష్ణుదాఖు రాత్మపోషణలంపటః।
విష్ణుంప్రదక్షిణీకృత్య శనైర్దీపాన్సమాగతమ్॥

తా॥ యతీశ్వరుడిట్లు చేయుచుండగా కార్తికశుక్ల ద్వాదశినాడు రాత్రి ఒక యెలుక ఆహారము కొఱకు తిరుగుచు విష్ణువుకు ప్రదక్షిణముచేసి మెల్లగా దీపముల సన్నిధికి జేరెను.

శ్లో॥ రిక్తపాత్రంసమాలోక్య కేవలంవర్తిసంయుతమ్।
తత్రస్థతైకపాత్రస్థం వర్తింప్రజ్వలితంప్రప।
దృష్ట్వాన్యాత్తథాచాన్య పాత్రస్థంప్రథివీపతే।
వర్తిముజ్జ్వలితాంద్రుష్ట్వా చఖాదాఖుహర్తేర్గృహే।
సజ్వాలాప్రథమావర్తి ర్ద్వితీయేనవినియోజితా।

జ్వాలాఘాతేనసాశీఘ్ర ముజ్జ్వాలాచనరాధిప।
తజ్జ్వాలయోష్ణనైవేద్యం నశశాకవ్యసర్జయేత్॥

తా॥ ఎలుక వచ్చినతోడనే జ్వాలతగ్గిపోయి కేవల వత్తితోగూడియున్న పాత్రనుజూచి దానిదగ్గరను జ్వాలతోగూడిన వత్తినిజూచి అందున్నమానెనుభక్షించి దానిని తీసికొని జ్వాలలేని వత్తినిగూడ గ్రహించెను అంతలో జ్వాలతోయున్న వత్తి సంపర్కమువలన జ్వాలలేని వత్తియు మండెను రెండును మండగా నూనె త్రాగుటకు వీలులేక విడిచెను.

శ్లో॥ వర్తిః ప్రజ్వలిత స్తత్ర విష్ణోరగ్రేతు కార్తికే।
తత్రకాలేసమాయాతే మూషకస్తు హరేర్గృహే।
తస్మిన్నేవదినేరాత్రౌ పూర్వపుణ్యప్రభావతః।
మమారమూషక స్తత్ర దివ్యరూపోబభూవహ॥

తా॥ కార్తికశుక్ల ద్వాదశినాడు హరిసన్నిధిలో యతీశ్వరుడు వెలిగించిన దీపమును నశించిన దానిని ఎలుక తిరిగి వెలిగించినది తరువాత పూర్వపుణ్యవశముచేత ఆరాత్రియే అచ్చటనే మృతినొంది ఎలుక దేహమును వదలి దివ్యదేహధారిఆయెను.

శ్లో॥ యతిఃపశ్చాత్సమాధిస్థో ఉన్మీలితదృశోభవత్।
ఉద్భూతపురుషంయోగీ విచరంతమపశ్యత్॥

తా॥ అంతలోనే యతి సమాధినివిడచి ఆ యపూర్వపురుషుని జూచెను.

శ్లో॥ కోభవానితిపప్రచ్ఛ కస్మాదత్రాగతోభవాన్।
ఇత్థంమునేర్వచశ్శ్రుత్వా వ్యాజహారపునర్వచః॥

తా॥ చూచి నీవెవ్వడవు యిచ్చటికెందుకు వచ్చితివి అని అడిగెను ఆమాటవిని ఉద్భూత పురుషుడు తిరిగి యతితో నిట్లనియె.

శ్లో॥ మూషకోహంమునిశ్రేష్ఠ నిత్యంతృణకణాశనః।
విచరామిచిరంకాల మస్మిన్దేవాలయేనఘ।
మూషకస్యమమేదానీం ముక్తిరాసీత్సుదుర్లభా।
నజానేకేనపుణ్యేన సర్వంత్వంవేత్సితత్వతః।
కోహంపురాకించరితం దుష్కృతంపూర్వజన్మని।
దుర్యోనిఃకేనదోషేణ మయాప్రాప్తమిహాధునా।
వక్తుమర్హసితత్సర్వం సర్వజ్ఞస్త్వంమహామతే।
దాసోస్మితవశిష్యోస్మి కృపాపాత్రోస్మిమాంవద॥

తా॥ పాపగహీతా నేను యెలుకను గడ్డితుంపులను భక్షించుచూనను నిత్యము యీదేవాలయమునందుండు చూనను, యెలుకనైయున్న నాకిప్పుడు దుర్లభమైన మోక్షము సంభవించినది ఇది యేపుణ్యముచేత గలిగినదో నాకు తెలియదు. పూర్వమందు నేనెవ్వడను యేమిపాపమును చేసితిని యేపాపముచేత యీమూషకత్వము నాకు ప్రాప్తించినది యీవిషయమంతయు సర్వజ్ఞులైన మీరు చెప్పతగియున్నారు మీకు నేను దాసుడను శిష్యుడను, దయకుపాత్రుడను.

శ్లో॥ జ్ఞానచక్షుర్విచార్యాథ విస్మితేనాంతరాత్మనా।
ఏవంవదంతముద్భూత పురుషంపునరబ్రవీత్ ॥

తా॥ ఆమాటలువిని యతి జ్ఞాననేత్రముతో సర్వమును విచారించి ఉద్భూత పురుషునితో యట్లని చెప్పదొడంగెను.

యతిరువాచ॥ శ్లో॥ బ్రాహ్మణ స్త్వంపురాకశ్చి జ్జైమినిర్గోత్రసంభవః।
బాహ్లీక స్త్వంహివిఖ్యాతః కుటుంబభరణాతురః॥

తా॥ (యతిచెప్పుచున్నాడు) ఓయీ? నీవు పూర్వమందు బాహ్లీకదేశమందు జైమినిగోత్ర సంజాతుడవు, బ్రాహ్మణుడవు, నిత్యముకుటుంబపోషణ పరాయణుడవు, బాహ్లీకుడని నామమును చెప్పవచ్చును.

శ్లో॥ స్నానసంధ్యాపరిత్యక్తో నిత్యంబ్రాహ్మణనిందకః।
నిత్యంకృషిపరఃకౄరః ధనార్థజ్ఞానవర్జితః॥

తా॥ స్నానసంధ్యలను విడిచి నిత్యము నాశతో వ్యవసాయమునుచేయుచు వివేకములేక బ్రాహ్మణులను నిందించెడివాడవు.

శ్లో॥ దేవపూజాపరిత్యక్తో నిత్యంశ్రాద్ధాన్నభోజనః।
అహోరాత్రంతథాభుక్తం నిషిద్ధదివసేనిశమ్॥

తా॥ దేవపూజలు వదలి నిత్యము శ్రాద్ధభోజనమును తినుచు భోజనము నిషిద్ధదినములందును రాత్రింబగల్లు భుజించువాడవు.

శ్లో॥ పిశాచేభ్యశ్చకాకేభ్యో భుక్తమన్నంత్వయాపురా।
వేదశాస్త్రోదితోమార్గ స్తత్పురానిందిత స్త్వయా॥

తా॥ పిశాచములకు కాకులకు బలియిచ్చిన అన్నమును తినుచు వేదశాస్త్రోక్త మార్గమును నిందించుచుండువాడవు.

శ్లో॥ స్నానసంధ్యాపరాణాంచ తపస్సన్మార్గవర్తినాం।
వినిందితంవిశేషేణ త్వయాహాస్య పురస్సరమ్॥

తా॥ స్నానసంధ్యావందన తపస్సులను చేయువారినిచూచి నవ్వుచునిందించువాడవు.

శ్లో॥ రూపవత్యాశ్చకాంతాయా స్సహాయార్థమహర్నిశం।
శూద్రీంత్వంగృహకృత్యేషు నియోజ్యచనిరాత్మనా॥
సథాసంభాషణస్పర్శ హాస్యపోషణసంయుతః।
శూద్రదాస్యాఃప్రదాయాన్న మపత్యేభ్య స్తథైవచ।
విక్రీత్వాకన్యకాంకస్మై పాదజేభ్యఃప్రయత్నతః।
దధిక్షీరంతథాతక్రం త్వయాక్రీతంతథాఘృతమ్॥

తా॥ నీవు సుందరియైన భార్యయుండెను ఆమెకు సహాయము కొఱకు నిరంతరము శూద్రస్త్రీని యింటిపద్దపనులకు వుంచుకొని మతిహీనుడవై నిరంతరము దానితో మాట్లాడుచు దానిని తాకుచు హాస్యములాడుచు దానిని పోషించుచుండి నీపిల్లలకు దానిచేత అన్నమును పెట్టించుచు కన్యను అమ్ముకొనియు శూద్రులకు చల్ల, పెరుగు, పాలు నెయ్యి అమ్ముకొనియు, ధనార్జనపరుడవై వుంటివి.

శ్లో॥ ఇత్థంత్వయాధనంభూరి సంచితంపూర్వజన్మని।
తద్ద్రవ్యంభువినిక్షిప్య మృతోసిమరణాగమే॥

తా॥ ఈప్రకారముగా బహుద్రవ్యమును సంపాదించి ఆద్రవ్యమును భూమియందు దాచి మృతినొందితివి.

శ్లో॥ కర్మణాతేననరక మనుభూయపునర్భువి।
జాతస్తత్కారణాదాఖు ర్వసకత్వంవిష్ణుమందిరే।
దేవద్రవ్యంముదాత్వంహి అదర్శ సర్వార్థనిందకః।
దినేదినేతుదీపస్థం తైలహారీతుపాపధీః।
తథాపిరాత్రౌకార్తిక్యాం హరదీపప్రబోధనం।
కృతంత్వేనైవపుణ్యేన దివ్యరూపోబభూవహ।
ఇతఃపరంభక్తియుక్తో వైకుంఠంవసవైధ్రువమ్॥

తా॥ ఇట్టిపాతకములచేత నరకమనుభవించి తిరిగి భూమియందు మూషకముగా జన్మించి యీదేవాలయమందుండి దేవద్రవ్యమును హరించుచు దీపపాత్రలోని తైలమును త్రాగుచుంటిని, దైవవశమువలన యీదినమందు నాచేత పెట్టబడిన దీపమునునశించిన దానిని నీవు వెలిగించితివి గనుక యీపుణ్యముచేత మూషకత్వముపోయి దివ్యరూపము గలిగింది ముందును హరిభక్తిగలిగి శాశ్వతముగా వైకుంఠమందుందువు.

శ్లో॥ ఏవంమునేర్వచశ్శ్రుత్వా పరిక్రమ్యప్రణమ్యచ।
ఆజ్ఞాపితోయయాశీఘ్రం నదీంపాపప్రణాశినీం।

త్రయోదశ్యాంచతుర్దశ్యాం పౌర్ణమాస్యాందినత్రయే।
స్నాత్వాతత్రిసరస్వత్యాం కార్తికేమాసిభూపతే।
తత్ర తేనైవపుణ్యేన జ్ఞానసిద్ధిమవాప్యచ।
ప్రతివర్షంచకార్తాసౌ ధర్మంకార్తికసంభవం॥
తేనపుణ్యప్రభావేన విష్ణుసాయుజ్యమాప్తవాన్॥

తా॥ ఈప్రకారముగా యతిచెప్పినమాటనువిని ఉద్యుక్తుడగు నతడు యతికినమస్కరించి ఆజ్ఞపుచ్చుకొని పాపములను నశింపజేయు సరస్వతీ నదికిబోయి త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమ యీమూడుదినములందు స్నానముచేసి ఆమహిమచేత జ్ఞానవంతుడై ప్రతిసంవత్సరము కార్తికవ్రతముచేసి తన్మహిమవలన అంతమందు సాయుజ్యముక్తి బొందెను.

శ్లో॥ తస్మాద్యఃకార్తికేమాసి సితేపక్షేనరేశ్వర।
ద్వాదశ్యాంయేప్రకుర్వంతి స్నానదానాదితత్పరః।
దీపమాలార్పణంపూజాం యఃకుర్యాత్సహరిప్రియః।
సర్వపాపవినిర్ముక్తః పశ్చాన్నిర్వాణమృచ్ఛతి॥

తా॥ కాబట్టి కార్తిక శుక్ల ద్వాదశినాడు భగవత్పరాయణుడై స్నానదాన పూజా దీపమాలార్పణాదికమును జేయువాడు హరికి ప్రియుడై పాతకముక్తుడై సాయుజ్యపదము నొందును.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే పంచదశోధ్యాయ
స్సమాప్తః.

---

అథ షోడశోధ్యాయారంభః.

వసిష్ఠఉవాచ॥ శ్లో॥ అవ్రతేనయేద్యస్తు మాసందామోదరప్రియం।
సగచ్ఛేన్నరకంఘోరం పునరావృత్తివర్జితమ్॥

తా॥ (వసిష్ఠమహాముని తిరిగి చెప్పుచున్నాడు) దామోదరునకు ప్రీతికరమైన యీకార్తికవ్రతమును చేయనివాడు కల్పాంతమువఱకు నరకమొందును.

శ్లో॥ తాంబూలదానంకార్తిక్యాం మాసమేకంనిరంతరం।
యఃకుర్యాద్విజశార్దూల సచసామ్రాజ్యమశ్నుతే॥

తా॥ కార్తికమాసము నెలరోజులు నియమముగా తాంబూలదానము చేయువాడు జన్మాంతరమందు వాస్తవముగా భూమికి ప్రభువగును.

శ్లో॥ ప్రతిపద్దినమారభ్య కార్తికస్యనరేశ్వర।
ఏకైకేనతుయద్దీపం యఃకుర్యాద్విష్ణవేర్పణం।
తస్యపాపానినశ్యంతి సగచ్ఛేద్విష్ణుమందిరమ్॥

తా॥ కార్తికమాసమందు నెలరోజులు పాడ్యమి మొదలు యొక్కొక్కదీపమును హరిసన్నిధిలో వెలిగించినవాడు విగతపాపుడై వైకుంఠమునకుం బోవును.

శ్లో॥ కార్తిక్యాంభానుముద్దిశ్య పౌర్ణమాస్యాంస్నానతత్పరః।
సంతానకాంక్షీ రాజేంద్ర స్నానందానంసమాచరేత్॥

తా॥ కార్తికమాసమందు పూర్ణిమనాడు సంతానమునుకోరి సూర్యునుద్దేశించి స్నానము దానము చేయవలెను అనఁగా అట్లుచేసినయెడల సంతానముగలుగునని భావము.

శ్లో॥ నారికేళఫలందానం విష్ణోరగ్రేతుకార్తికే।
సదక్షిణంసతాంబూలం యఃకుర్యాద్రాజసత్తమ।
నతస్యసంతతేర్హాని ర్నరోగోనచదుర్మృతిః॥

తా॥ కార్తికమాసమందు హరిసన్నిధిలో టెంకాయదానమును దక్షిణతాంబూలసహితముగా చేయువానికి సంతానవిచ్ఛేదముండదు, రోగముండదు, దుర్మరణముండదు.

శ్లో॥ విష్ణోర్దేవాలయాగ్రేతు కార్తిక్యాంపౌర్ణమీదినే।
యస్తంభదీపంకురుతే సవైకుంఠపతిర్భవేత్॥

తా॥ కార్తికమాసమందు పూర్ణిమనాడు హరిముందర స్తంభదీపమును పెట్టువాడు వైకుంఠపతియగును.

శ్లో॥ విష్ణోరగ్రేతుకార్తిక్యాం స్తంభదీపార్పణంనరః।
తస్యపుణ్యస్యవిస్తారం మయావక్తుంనశక్యతే॥

తా॥ కార్తికమాసమందు హరిసన్నిధిలో స్తంభదీపమర్పణ చేసినవానికి గలిగెడి పుణ్యమును చెప్పుటకు నాతరముగాదు.

శ్లో॥ కార్తికేమాసిపౌర్ణమ్యాం స్తంభదీపావలోకనం।
తస్యపాపానినశ్యంతి తమోవదినకరోదయే॥

తా॥ కార్తికమాసమందు పూర్ణిమరోజున స్తంభదీపమును చూచువారి పాపములు సూర్యోదయమందు చీకట్లవలె నశించును.

శ్లో॥ శాలివ్రీహితిలైః పూతం స్తంభదీపంప్రచక్షతే।

స్తంభదీపవిహీనోయః కార్తికేమాసిభూమిప।
నరకాన్ననివర్తంతే నాత్రకార్యావిచారణా॥

తా॥ కార్తికమందు స్తంభమును సమర్పించనివాడునరకమునుంచివిడుదలగాడు స్తంభదీపమును శాలిధాన్యము వ్రీహిధాన్యము నువ్వులును వుంచి దీపము పెట్టవలెను.

శ్లో॥ శిలామయంవాదారుంవా స్తంభంకృత్వాహరేఃపురః।
సంస్థాప్య స్తంభదీపంతు యఃకుర్యాత్సహరిప్రియః॥

తా॥ శిలతోగాని కొయ్యతోగాని స్తంభమునుచేయించి దేవాలయము ముందర పాతి దానిపైన దీపమును పెట్టువాడు హరికి ప్రియుఁడగును.

శ్లో॥ వక్ష్యామ్యత్రపురావృత్తం తత్సమాసేన తేశృణు॥

తా॥ యీ స్తంభవిషయమై పూర్వకథగలదు చెప్పెదను వినుము.

శ్లో॥ మతంగస్యాశ్రమేపుణ్యే నానాద్రుమలతాయుతే।
విష్ణోరాయతనంతస్మిన్నాసీత్తత్పరితోవనమ్॥

తా॥ మతంగమహాముని ఆశ్రమము నానాతరుజాలమండితమై యొకటి గలదు అందొక విష్ణ్వాలయముగలదు ఆయాలయముచుట్టును వనముండెను.

శ్లో॥ మునయస్తు సమాజగ్ముః కార్తికవ్రతకోవిదాః।
సపర్యాంకర్తుమాత్మన్యా తత్రవిష్ణోర్గృహేహరిం।
షోడశైరుపచారైశ్చ దినేషుత్రిదశేషుచ।
పూజాంచక్రుర్విష్ణుగేహే కార్తికేకమలాపతేః॥

తా॥ కార్తికవ్రతపరాయణులై మునీశ్వరు లచ్చటికివచ్చి విష్ణువునుషోడశోపచారములతోను మాసమంతయును పూజించిరి.

శ్లో॥ నిర్మముద్దీప్యమాలాంచ ద్వారిద్వారిహరేఃపురః।
అత్యంతభక్తిసంపన్నా విష్ణుభక్త్యాశుచివ్రతాః॥

తా॥ వారత్యంతభక్తియుక్తులై హరిద్వారములందు దీపమాలలను నిర్మించి సమర్పించిరి

శ్లో॥ తేషుకశ్చిన్మునిస్తత్ర ప్రాహేదంపృథివీపతే।
శ్రుణుధ్వమృషయస్సర్వే కార్తికేతుశివాగ్రతః।
స్తంభదీపంతుయఃకుర్యాత్సగచ్ఛేద్వైష్ణవంపదమ్॥

తా॥ అందులో వక ముని యిట్లుపలికెను మునీశ్వరులారా వినుఁడు కార్తీక మాసమందు శివునిముందర స్తంభదీపమును వుంచువాడు వైకుంఠలోకవాసి యగును.

శ్లో॥ స్తంభదీపం కరిష్యామో వయంవిష్ణుపదేశిత। దినేస్మిన్కార్తి
కేమాసి పౌర్ణమాస్యాంవిశేషతః। సాయాహ్నే వాసుదేవస్య
స్తభదీపోహరేఃప్రియః। ప్రకృష్టఫలదంప్రోక్తం స్తంభదీపం
తు కార్తికే। విష్ణోర్దేవాలయాగ్రేచ స్తంభంయఃకారయిష్య
తి। పౌర్ణమ్యాంకార్తికేమాసి తస్మిన్దీపోహరేఃప్రియః।
తస్యపాపానినశ్యంతి పశ్చాద్విష్ణుపదంవ్రజేత్॥

తా॥ కాఁబట్టి మనము హరిముందర స్తంభదీపమును పెట్టుదము యీదినము కార్తికపూర్ణిమ అయియున్నది యీదినము సాయంకాలము స్తంభదీపదానము హరి కత్యంతప్రియము, స్తంభమును చేయించి కార్తికమాస పూర్ణిమనాడు సాయంకాల మందు దానియందు దీపమును పెట్టువారు పాపములునశించి వైకుంఠలోక మొందెదరు.

శ్లో॥ ఇత్యాకర్ణ్యమునేస్సర్వే తద్ధేత్వాక్యాముదాన్వితాః।
స్తంభదీపార్పణంకర్తు ముద్యోగంచక్రిరేనఘ॥

తా॥ వారందఱు ఆమాటవిని స్తంభదీపమును సమర్పించుటయందు ప్రయత్నముచేసిరి.

శ్లో॥ విష్ణోర్నికేతనస్యాగ్రే వనేతస్మిన్నరేశ్వర।
అపశ్యన్నవిదూరేతు విష్ణోరాయతనాగ్రతః॥
సాధుశాఖావిహీనం తే స్థాణుంతత్రమహీపతే॥

తా॥ ప్రయత్నించి దేవాలయముందరను దగ్గరలో కొమ్మలులేని ఒకవృక్ష మును చూచిరి.

శ్లో॥ తస్మిన్వర్షాన్వితాస్సర్వే కార్తికవ్రతకోవిదాః। విష్ణుధ్యానం
ప్రకుర్వంతః స్తంభదీపంసమర్పయన్। శాలివ్రీహితిలోపేతం
ఘృతపాత్రసమన్వితం। ప్రసన్నహృదయాస్సర్వే స్తంభదీపం
సమర్పయన్। పునర్దేవాలయంప్రాప్తాః రాజన్విష్ణుకథేచ్ఛవః॥

తా॥ కార్తికవ్రత సముత్సాహులైన వారందఱుకలసి ఆస్థాణువునందు శాలి వ్రీహితిలసమేతముగా దీపమును నేతితో వెలిగించి ఆనందించి తిరిగి దేవాలయమునకు వచ్చి హరికథను చెప్పుకొనుచుండిరి.

శ్లో॥ కథాయాంకథ్యమానాయాం తదా దేవాలయాద్బహిః। అభూ
చ్ఛటచటాశబ్ద స్సర్వభూతభయంకరః। సశాంతదీపస్సతథా

బిభిదే సుప్త్కాపాదపః। సభిత్తి స్స్థూలదారూర్ధ్వం హ్యేమూలాగ్రం
మహీపతే। పశ్యతామేవభూతానాం పపాతధరణీతలే। వినిర్య
యౌతత స్తస్మాత్పురుషః పూర్వదేహభృత్॥

తా॥ కథ చెప్పుచునుండగా దేవాలయముందర చటచట అనేశబ్దములు గలిగి స్తంభదీపము నశించి అందఱు చూచుచుండగనే అస్థాణువు అంతయు పగిలి భూమి యందుపడెను అందునుంచి పూర్వదేహమును ధరించిన యొకపురుషుఁడుబయలు వెడలెను.

శ్లో॥ అథజగ్ముర్మునిగణాః కథాం త్యక్త్వాహరేర్గృహాత్।
బభూవుర్విస్మితాస్సర్వే హాహాకారరవాన్వితాః।
తస్మాదుద్భూతపురుషం దృష్ట్వావాక్యమథాబ్రువన్॥

తా॥ అంతమునీశ్వరులు కథను చాలించి దేవాలయమునుంచి బయటకు పోయి చూచి ఆశ్చర్యమొంది అయ్యో అయ్యో అని ధ్వనిచేయుచు యొకపురుషునిచూచి యిట్లనిరి.

శ్లో॥ కోభవాన్కేనదోషేణ స్థాణుర్భూత్వాచిరంవనే।
తద్వదస్వయథాన్యాయం నాతికార్యంవిలంబితమ్॥

తా॥ ఓయీ నీవెవ్వడవు యేదోషముచేత స్థాణువుగానున్నావు ఆవిషయము నంతయు త్వరగా చెప్పుము.

శ్లో॥ ఇతితేషాంవచశ్శ్రుత్వా జాతహర్షాన్వితోనృప।
ననామదండవద్భూమౌ కృతాంజలిపుటోబ్రవీత్॥

తా॥ వారిట్లు అడుగగా వాడు వారికి దండప్రణామమాచరించి సంతోషముతో అంజలిపట్టి యిట్లనిచెప్ప దొడంగె.

శ్లో॥ విప్రోహంవిప్రశార్దూలా విత్తపో రాజ్యపాలకః।
కోశరాజ్యాశ్వమాతంగ రథపాదాతిసంయుతః।
సమస్తభూతిసంపన్నో నిర్దయోదుష్టమానసః॥

తా॥ ఓబ్రాహ్మణోత్తములారా! నేనుపూర్వమందు బ్రాహ్మణుఁడను రాజ్యమును పాలించువాడను ధనము గుఱ్ఱములు, యేనుగులు, రథములు, కాల్బంటులు, మొదలైన సమస్తసంపత్తులు గలిగియు దయాశూన్యుఁడనై దుష్టవర్తనగలవాఁడనైతిని.

శ్లో॥ నాధీతవేదశాస్త్రశ్చ నశ్రుతాహరిసత్కథా।
నచతీర్థానుగమనం నదానంచాణుమాత్రకం।
నసత్కర్మకృతంవిప్రా మయాదుర్బుద్ధినాపురా॥

తా॥ నేను వేదశాస్త్రములను చదువలేదు, పూజించి యగ్ని హోత్రము చేయ లేదు, స్వల్పమైనను దానము చేయలేదు, దుష్టబుద్ధితో పుణ్యకర్మ చేయలేదు.

శ్లో॥ ఉపవిష్టోస్మ్యహంనిత్య మున్నతాసనవిష్టరే।
వేదాఢ్యాః పుణ్యపురుషాః సదాచారాదయాళవః।
సదాశ్రయరతాశ్శుద్ధాః గృహ్ణంమీపేనిరంతరం।
నీచాసనే చోపవిష్టా మత్పాదార్థకాంక్షిణః।
తేషామభిముఖేపాదౌ ప్రసార్యైవసముత్సుకః।
ప్రత్యుత్థానాభివాదౌ చ న తేభ్యశ్చకృతౌ మయా॥

తా॥ నిత్యము నేను వున్నతాసనమందు కూర్చుని వేదవేత్తలును సదాచారవంతు లును, పుణ్యపురుషులును, దయావంతులును, సదాశ్రయకాములును, అగు బ్రాహ్మ ణులను నాయందు నీచాసనములందు కూర్చుండ నియోగించి వారికభిముఖముగా పాద ములను జాచియుండువాడను, వారికెన్నడును యెదురొచ్చి నమస్కారములు చేయ లేదు, వారియిష్టార్థములను యివ్వనూలేదు.

శ్లో॥ నదత్తంపుణ్యకాలేషు తేషాంగానమనుత్తమం।
అచరేద్యదిమేదానం దానందివ్యవివర్జితమ్॥

తా॥ పర్వకాలమందును, వారికెన్నడును, యేదానమును యివ్వలేదు? వకవేళ యెప్పుడైనను దానమివ్వక తప్పనంతట్లో ధనములేకుండా ధారాదత్తను చేయడము తరువాత ధనమివ్వకపోవడము.

శ్లో॥ శృతశీలసమాపన్నా న్విహాసన్నిందితాస్మితాః।
దాస్యామీత్యనృతంవచ్మి న తేభ్యోదదియతేక్వచిత్॥

తా॥ శాస్త్రశ్రవణ సత్స్వభావసంపన్నులువచ్చి రాజును గనుక నన్ను యాచించువారు అప్పుడు వరే యిచ్చెదనని చెప్పుటయేగాని యిచ్చుటలేదు.

శ్లో॥ నిత్యంవిప్రవరేభ్యశ్చ ద్రవ్యంలాత్వార్యసిద్ధయే।
గృహీత్వైవతతఃకార్యం విధేయంచతథామయా॥

తా॥ నిత్యము బ్రాహ్మణులవద్దధనమును పుచ్చుకొని స్వకార్యములను చేసుకొనువాడను

శ్లో॥ ఏవందినాన్యతీతాని మయాదుర్బుద్ధినానృపా।
తేనకర్మవిపాకేన సర్వాంకర్మనిభేదినా।
తతఃకాలేమృతస్సోహం నరకేభుక్తయాతనః॥

తా॥ నేనిట్లు దుర్బుద్ధితో దినములు గడిపితిని అనమ్మృత్యుకాలము చేరవచ్చి నరకమందనేక యాతనలను అనుభవించితిని.

శ్లో॥ ద్విపంచాశత్సహస్రాణి జన్మానిశ్వానయోనిషు।
జన్మాసీదథకాకానా మయుతంజన్మవై పునః।
సరటత్వేయుతంజన్మ విష్ఠాక్రిమిజనిస్తథా।
కోటివారంభూరుహత్వం స్థాణుత్వంచతథానఘ॥

తా॥ తరువాత భూమికి వచ్చి ఏబదిరెండువేలమారులు కుక్కగా జన్మించితిని అనంతరము పదివేలమారులు కాకిగాపుట్టితిని, ఆపల పదివేలు మారులు తొండగా జన్మించితిని, పిమ్మట పదివేలమారులు పురుగుగానుండి విష్ఠాశినైయుంటిని, వెనుక కోటి మారులు వృక్షముగానుంటిని, చివరకు కోటిమారులు స్థాణువు ( మొద్దు ) గా కాలము గడుపు చుంటిని.

శ్లో॥ ఇత్థంపాపగతస్యాపి ముక్తిరాసీత్సుదుర్లభా । ముక్తేస్తు కారణంనాహం వేద్మిభూతదయాపరాః । దర్శనాద్భవతామద్య జాతిస్మరణకారణం। యుష్మాకమిత్థ కథితం పాపంమేపూర్వ జన్మని। ఇత్యుక్త్వాసీత్తతస్తూష్ణీ ముద్భూతపురుషోనృప॥

తా॥ ఇట్లనేక విధములుగా పాపకర్ముడనైన నాకిప్పుడు దుర్లభమైన ముక్తిగలిగినది దీనికి కారణము నాకు తెలియదు గాన సర్వభూతదయావంతులుగాన మీరు చెప్పుదురుగాన మీదర్శనమువలన నాకుజాతిస్మృతిగలిగినది ఓమునీశ్వరులారా? నాపూర్వ పాపమిట్టిదని పలికి మాటాడకుండెను.

శ్లో॥ శ్రుత్వైవంమునయస్తత్ర ప్రోచుస్సర్వేపృథక్ పృథక్।
సత్యంకార్తీకమాసస్య ఫలంప్రత్యక్షముక్తిదం।
కాష్ఠపాషాణదార్వాదే ర్ముక్తిరాయాత్సుదుర్లభా।
తత్రాపిపౌర్ణమీపుణ్యా సర్వపాపప్రణాశినీ॥

తా॥ మునీశ్వరులిట్లువిని వారిలోవారు యిట్లుచెప్పుకొనసాగిరి, "కార్తీకమాస ఫలము యథార్థమైనది ప్రత్యక్షముగా మోక్షమిచ్చునది. రాతికి కొయ్యకుగూడ మోక్ష మిచ్చినది అందును యీపూర్ణిమ పంచమహాపాతకములను నశింపచేయును.

శ్లో॥ సాధుసాధుతథాతస్యాం స్తంభదీపముఖప్రదం।
పౌర్ణమ్యాం కార్తికేమాసి విష్ణోర్దేవాలయాగ్రతః।

పర్రైర్ని యోజితాద్దీపా త్సాయుంశుమ్మ్కతేరూపరి।
స్తాంబర్యాకార్తికేమాసి విష్ణోర్దీపమహాహయేత్ ।
తేసరత్నపహానిస్సార్వ ద్విష్ణు హాచత్ర్మపాపసః॥

తా॥ ఆపూర్ణిక యొక్కయు స్తంభదీపము చాలా సుఖప్రదము కార్తీకపూర్ణిమ నాడు పరులచేసుంచబడిన దీపముల వలన యేండిన మొద్దు ముక్తినొందెను, మొద్దైనను కార్తీకమాసమందు దేవసన్నిధిలో దీపమును సహించిన యెడల పాతకము క్తినొంది దయాళువైన దామోదరుని చేత మోక్షమొందించబడును.

శ్లో॥ ఏవంవివదమానానాం వచశ్శ్రుత్వాపురసర్నృప।
సతూవాచపునశ్చాయ ముద్భూతిపురుషోనఘ॥

తా॥ ఇట్లు వివాదమును చేయువారితో ఉద్భూతపురుషుడు తిరిగి యిట్లనియె.

శ్లో॥ ముక్తిస్తుదుర్లభతరా కేనవైప్రాప్యతేధునా । కేనవాకర్మ బద్ధస్స్యాత్కేన వాపవిముచ్యతే। కేన దేహాదీంద్రియాణి తాని తానిచ దేహినాం। జ్ఞానంకథంభ వేత్పుంసాం శీఘ్రంనిర్వాణ సాధనం । వదధ్వమేతత్సకలం మునయోజ్ఞానకోవిదాః॥

తా॥ జ్ఞానవేత్తలైన మునీశ్వరులారా! దేనిచేత మోక్షముగలుగును, దేనిచేత బద్ధుడగును, దేనిచేతముక్తుడగును, దేనిచేత దేహులకు యింద్రియములుంగలుగును, మోక్ష ప్రాపకమైన జ్ఞానమెట్లుగలుగును యీసర్వమును నాకుచెప్పుడీ.

శ్లో॥ ఇత్యేవముదితాస్తేన తేపిచాంగీరసంమునిం।
అజ్ఞాపయామాసురతో సర్వజ్ఞస్సముని స్తదా।
మునిస్తానవలోక్యాథ తమాహాంగీరసోమునిః॥

తా॥ వాడిట్లు అడగగా మునీశ్వరులు అందులో ఆంగీరసముని వానికి సమాధానము చెప్పుమని నియోగించిరి, ఆయనయు వారితో సరేనని వానితోనిట్లుచెప్పసాగెను.

ఇతి శ్రీ స్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే షోడశోఽధ్యాయ స్సమాప్తః.

శ్లో॥ సత్యానందస్వరూపంధీ సాక్షిణంజ్ఞానవిగ్రహం।
చింతయాత్మతయానిత్యం త్యక్త్వా దేహాదికాంధియమ్॥

తా॥ సచ్చిదానంద స్వరూపుడును, బుద్ధికిసాక్షియు, అయిన వస్తువునె ఆత్మగా తెలుసికొనుము యీదేహాదికమును ఆత్మగా తెలిసికొనకుము.

శ్లో॥ రూపాదిమాన్యతఃపిండో తతోనాత్మఘటాదివత్।
వియదాదిమహాభూత వికారిత్వాచ్చకుంభవత్॥

తా॥ దేహము ఘటమువలె రూపాదిమత్తుగానుండిన పిండమగునుక యిది ఆత్మగాదు యిదిగాక దేహముఘటమువలె ఆకాశాది పంచమహాభూతమువలన బుట్టినదిగనుక ఆత్మగాదు.

శ్లో॥ ఏవమింద్రియదృఙ్నాహ మింద్రియాణీతినిశ్చయః।
మనోబుద్ధిస్తథాప్రాణో నాహమిత్యవధారయః॥

తా॥ ఇట్టుగానే యింద్రియములను ఆత్మగావని తెలుసికొనుము, అట్లైమనస్సును బుద్ధిని ప్రాణములను ఆత్మగా తెలుసికొనకుము.

శ్లో॥ దేహేంద్రియాదయోభావా హానిదాంతుయభాగినః।
యస్యసన్నిధిమాత్రేణ సోహమిత్యవధారయ॥

తా॥ దేహేంద్రియాదులన్నియు యెవనిసన్నిధచేత ప్రకాశించునో వాడే ఆత్మగానెరుగుము అనగా అతడే నే... తెలుసికొనుము అనిభావము.

శ్లో॥ అనాపన్నవికారస్సన్ అయస్కాంతవదేవయః।
బుద్ధ్యాదిచాలయేత్ప్రత్యక్ సోహమిత్యవధారయ॥

తా॥ అయస్కాంతమణి యినుమువలె తాను వికారిగాక బుద్ధ్యాదులను చలింపజేయువాడే నేనని తెలుసికొనుము.

శ్లో॥ అజడాత్మవదాభాంతి యత్సాన్నిధ్యాజ్జడాఅపి।
దేహేంద్రియమనఃప్రాణా స్సోహమిత్యవధారయ॥

తా॥ యెవనియొక్క సాన్నిధ్యమాత్రముచేత జడములై దేహేంద్రియమనఃప్రాణములు జన్మలేని ఆత్మవలె ప్రకాశించునో వాడే నేనని తెలుసికొనుము.

శ్లో॥ స్వప్నజాగరితేసుప్తి భావేభావంలయంతథా।
యోవేత్త్యవిక్రియస్సాక్షి సోహమిత్యవధారయ॥

తా॥ ఎవ్వడు వికారిగాక సాక్షియై స్వప్నమును జాగరమును నిద్రిసున్న వాటియొక్క అత్యంతముగనున్న తెలుసుకొనుచున్నాడో వాడే నేనని తెలుసికొనుము.

శ్లో॥ ఘటావభాసకోదీపో ఘటాదన్యోయథేష్యతే।
దేహావభాసకో దేహీ తథాహంబోధవిగ్రహః॥

తా॥ ఘటమును ప్రకాశింపచేయు దీపమెట్లు ఘటముకంటె భిన్నమో అట్లుగానే దేహమును ప్రకాశింపచేయు బోధరూపుడైన యాత్మయు నేనని తెలిసికొనుము.

శ్లో॥ పుత్రమిత్రాదయోభావా యస్యశేషప్రియాప్రియే।
ద్రష్టాసర్వప్రియతమః సోహమిత్యవధారయ॥

తా॥ ఎవ్వఁడు సర్వప్రియుడై నీయొక్క పుత్రమిత్ర ప్రియాప్రియాది భావములను జూచుచున్నవాడే నేనని తెలిసికొనుము.

శ్లో॥ పరమప్రేమాస్పదతయా సుఖాత్మకమహంసదా।
భూయోదృష్టానినిత్యంతు సోహమిత్యవధారయ॥

తా॥ నిత్యము యెన్నిమార్లు చూచినను పరమప్రేమాస్థానమైనదే నేనని తెలిసికొనుము.

శ్లో॥ యస్సాక్షీలక్షణోబోధ స్త్వంపదార్థస్సఉచ్యతే।
సాక్షిత్వమపిబోధత్వ మవికారితయాత్మనః॥

తా॥ సాక్షియు బోధరూపుడగు వాడే నీవనియెరుగుము సాక్షిత్వమును జ్ఞానరూపత్వమును, అవికారియగుటచేత ఆత్మకేగలవు.

శ్లో॥ దేహేంద్రియమనఃప్రాణా హంకృతిభ్యోవిలక్షణః।
ప్రోక్తావిగతషడ్భావ వికార స్త్వంపదాదిభిః॥

తా॥ దేహేంద్రియమనఃప్రాణాహంకారములకంటె వేరైనవాడును, జనిమత్వ అస్తిత్వ, వృద్ధిగతత్వ, పరిణామత్వ, క్షీణత్వ, నాశంగతత్వములను యారువికారములు లేనివాడును త్వంపదార్థము అనఁగా నీవేనని తెలిసికొనుము.

శ్లో॥ త్వమర్థమేవంనిశ్చిత్య తదర్థంచింతయేత్పునః । అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేనచ॥ నిరస్తాశేషసంసారదోష స్సత్యాదిలక్షణః । అదృశ్యత్వాదిగుణకః పరాకృతమోమలః॥ నిరస్తాతిశయానంద స్సత్యప్రజ్ఞాదిలక్షణః । సత్యస్వలక్షణఃపూర్ణః పరమాత్మేతిగీయతే॥

తా॥ త్వంపదార్థమును యిట్లు తెలిసికొని, ఆకారణమువలన వ్యాపించే స్వభావముచేత, సాక్షాద్విధిముఖముగాను తచ్ఛబ్దార్థమును తెలుసుకొనవలయును. శ్లో॥ అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేనచ। వేదాంతానాంప్రవృత్తిస్స్యా ద్విరాచార్యసుభాషితం॥

తచ్ఛబ్దమునకు బ్రహ్మశబ్దము అతచ్ఛబ్దమునకు బ్రహ్మణ్యము ప్రపంచమర్థము వ్యావృత్తి యనగా యిదిగాదని యిదిగాదని నిరసించుట అనగా యిదిబ్రహ్మగాదిది బ్రహ్మగాదని దేహేంద్రియాదులను నిరసించగా మిగిలినది బ్రహ్మయనిభావము, సాక్షాద్విధి ముఖమనగా సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ అనువాక్యములు అనగా బ్రహ్మసత్యజ్ఞానానంద స్వరూపుడని తెలుసుకొనవలయునని భావము ఆత్మ సంసారలక్షణ విశిష్టముగాదనియు, సత్యరూపమనియు, దృష్టిగోచరముగాదనియు, తమస్సుకు అవలదనియు అనుపమానందరూపమనియు సత్యప్రజ్ఞాది లక్షణయుతమనియు, పరిపూర్ణజ్ఞానమనియు చెప్పబడును, అతద్వ్యావృత్తిరూపముగాను సాక్షాద్విధిముఖముగాను, తెలుసుకొనదగిన ఆత్మస్వరూపమిదియేనని అర్థము.

శ్లో॥ సర్వజ్ఞత్వం పరేశత్వం తథా సంపూర్ణశక్తితా।
వేదైస్సమర్థ్యతే యస్య సోహమిత్యవధారయ॥

తా॥ వేదముల చేత యెవ్వడు సర్వజ్ఞుడనియు, పరేశుడనియు, సంపూర్ణశక్తిమంతుడనియు, చెప్పబడుచున్నాడో వాడే నేనని తెలుసుకొనుము.

శ్లో॥ యజ్జ్ఞానాత్సర్వవిజ్ఞానం శ్రుతిషు ప్రతిపాదితం।
మృదాద్యనేకదృష్టాంతైస్తద్బ్రహ్మేత్యవధారయ॥

తా॥ మృత్తికాది దృష్టాంతముల చేత యేవస్తుజ్ఞానముచేత సమస్తజ్ఞానము గలుగునని శ్రుతులందు చెప్పబడినదో ఆవస్తువే బ్రహ్మయని తెలుసుకొనుము, నేనునదియు బ్రహ్మయనునదియు యేకార్థకములే.

శ్లో॥ జీవాత్మనా ప్రవేశశ్చ నియంతృత్వంచ తాన్ప్రతి।
శ్రూయతే యస్య వేదేషు తద్బ్రహ్మేత్యవధారయ॥

తా॥ వేదములందు యెవ్వనికి "తదనుప్రవిశ్య" ఇత్యాదివాక్యముల చేత జీవాత్మరూపము చేత జగత్ప్రవేశమున్ను ఆజీవులను గురించి నియంతృత్వమున్ను చెప్పబడుచున్నదో వాండే బ్రహ్మయని తెలుసుకొనుము.

శ్లో॥ కర్మణాం ఫలదాతృత్వం యస్యైవ శ్రూయతే శ్రుతౌ।
జీవానాం హేతుకర్తృత్వం తద్బ్రహ్మేత్యవధారయ॥

తా॥ వేదములందు, యెవ్వనికి కర్మఫలప్రదత్వమున్ను జీవకారణకర్తృత్వమున్ను చెప్పబడినదో వాడే బ్రహ్మయని తెలిసికొనుము.

శ్లో॥ తత్త్వంపదార్థౌ నిర్ణీతౌ వాక్యార్థశ్చింత్యతేధునా।
తాదాత్మ్యమత్ర వాక్యార్థస్తయోరేవ యథార్థయోః॥

తా॥ ఈప్రకారముగా "తత్, త్వం" అనుపదములు రెండును నిశ్చయింపబడి నవి తత్ అనగా బ్రహ్మము, త్వం అనగా నీవు అనగా నీవె బ్రహ్మవని భావము చెప్పబడినది. ముందు వాక్యార్థమును చెప్పెదను వాక్యార్థమనగా తత్త్వంపదముల కైక్యమని, చెప్పబడును.

శ్లో॥ ప్రత్యగ్బోధోయఆభాతి సోద్వయానందలక్షణః।
అద్వయానందరూపశ్చ ప్రత్యగ్బోధైకలక్షణః।
ఇత్థమన్యోన్యతాదాత్మ్య ప్రతిపత్తిర్యదాభవేత్।
అబ్రహ్మత్వంత్వమర్థస్య వ్యావర్తేత తదైవహి॥

తా॥ ప్రత్యగాత్మయే అద్వయానందరూపపరమాత్మ, పరమాత్మయే ప్రత్యగాత్మ యీప్రకారముగా అన్యోన్యతాదాత్మ్య మెప్పుడుగలుగునో అప్పుడే త్వంపదముకు అర్థము బ్రహ్మ గాదనుభ్రాంతి నశించును తాదాత్మ్యమనగా అదియే యిదియని యర్థము అనగా ఐక్యము.

శ్లో॥ తత్త్వమస్యాదివాక్యేచ తాదాత్మ్యప్రతిపాదనే। లక్ష్యౌతత్త్వం
పదార్థౌద్వా ఉపాదానపరివర్జనే। హిత్వాతేశబలేవాక్యే
వాక్యార్థపరిబోధనే। ముఖ్యార్థేతేవినాభూతే ప్రతీతిర్లక్షణో
చ్యతే। తత్త్వమస్యాదివాక్యేషు లక్షణాభాగలక్షణా। సోయ
మిత్యాదివాక్యస్థ పదయోరివనోపరా॥

తా॥ తత్త్వమసిఅనగా తత్, త్వం, అసి, యీవాక్యార్థమునకు తాదాత్మ్యము చెప్పవలెను. అప్పుడు వాచ్యార్థములైన కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వవిశిష్టులైన జీవేశ్వరులను వదలి లక్ష్యార్థములైన ఆత్మలనే గ్రహించినయెడల తాదాత్మ్యముసిద్ధించును, ముఖ్యార్థమునకు బాధగలిగినప్పుడు లక్షణావృత్తిని ఆశ్రయించవలెను. యీలక్షణావృత్తిమూడు విధములు అందులో యిచ్చట భాగలక్షణను గ్రహించవలెను అనగా కొంతను విడచి కొంతను స్వీకరించుట భాగలక్షణయనబడును తత్త్వమసియందు సర్వజ్ఞత్వకించిద్జ్ఞత్వములను వదలి కేవలజ్ఞానాత్మత్వ మాత్రమునె గ్రహించినయెడల అభేదము సంభవించును తత్ అది, త్వం, నీవు అసి, అయితివి అనగా నీవె బ్రహ్మవు అయితివి అని భావము సోయందేవదత్త ఇత్యాదిస్థలములందును యిట్లే బోధచేయబడును.

శ్లో॥ అహంబ్రహ్మేతివాక్యార్థ బోధోయావద్దృఢీభవేత్।
శమాదిసహితస్తావ దభ్యసేచ్ఛ్రవణాదికమ్॥

తా॥ నేనుబ్రహ్మనను వాక్యార్థబోధస్థిరపడువరకు శమదమాదిసాధనసంపన్ను డై శ్రవణమననాదుల నాచరించవలెను.

శ్లో॥ శ్రుత్వాచార్యప్రసాదేన దృఢోబోధోయథాభవేత్। నిరస్తాశేషసంసార నిదానః పురుషస్తదా ॥ కించిత్కాలమనారబ్ధం కర్మవిత్తస్యసంక్షయే। నిరస్తాతిశయానందం వైష్ణవంపరమంపదం॥ పునరావృత్తిరహితం కైవల్యంప్రతిపద్యతే॥

తా॥ ఎప్పుడు శ్రుతివలనను గురుకటాక్షముచేతను తాదాత్మ్యబోధస్థిరపడునో అప్పుడు సంసారమూలను అంతయు నశింపచేయును, కొంతకాలము మాత్రము ప్రారబ్ధకర్మను అనుభవింపుచునుండి ప్రారబ్ధక్షయమందు పునరావృత్తి రహితమైన మోక్షపదమొంది నిరతిశయానందముతో నుండును.

శ్లో॥ తస్మాదాత్మవివేకార్థ మాదౌకర్మసమాచరేత్ । వినాయచ్ఛ్రవణేనైవకర్మకర్తుంనరోచరేత్।పుమాన్గురుం; ప్రసాద్యైవ శ్రుత్వాతస్మాత్ప్రయత్నతః। తతోవిచ్ఛిన్నవృత్తాంతః కృతే కర్మణ్యథావిధి। తత్కర్మఫలమత్యంతం తత్తుష్ట్యైవిష్ణవేనఘ। కర్మణానుకృతేనైవ ప్రాప్యజన్మాన్యనేకశః । తతోమోక్షమవాప్నోతి యోగయుక్తోవిశేషతః । విముక్తకర్మబంధో భూన్నాత్రకార్యావిచారణా॥

తా॥ కాబట్టి ముందు చిత్తశుద్ధికై కర్మచేయువలెను, అకర్మవిధినంతయుగురువువలన తెలుసికొని చేసి తత్ఫలమును హరికి సమర్పించి విగతపాపుడై తరువాత ఆపుణ్యముచేత మంచిజన్మమెత్తి శ్రవణాదులనభ్యసించి విజ్ఞానియై కర్మబంధనమును తెంచుకొని మోక్ష మొందును యిందుకు సందేహములేదు.

శ్లో॥ ఇత్థంయత్నేనసంపృష్ట మబ్రవీదంగిరోమునిః॥ భూయోపిసఉవాచేత్థం మహాసంతోషధీర్నృప॥

తా॥ అంగీరస మునీశ్వరుడిట్లు చెప్పగావిని సంతోషించి తిరిగివాడడుగుచున్నాడు.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే సప్తదశోఽధ్యాయస్సమాప్తః.

---

అథ అష్టాదశోధ్యాయారంభః.

ఉద్భూతపురుషఉవాచ। శ్లో॥ మునేస్వనుగృహీతోస్మి త్వత్తోహంతు మహామతే లబ్ధజ్ఞానోస్మివిప్రేంద్ర ప్రసాదాత్తవదర్శనాత్॥

తా॥ (ఉద్భూతపురుషుఁడడుగుచున్నాడు) మునీశ్వరా! నేననుగ్రహింపఁబడితిని నీదర్శనప్రసాదములవలన జ్ఞానవంతుఁడనైతిని.

శ్లో॥ పితాభ్రాతాగురుస్త్వంహి శిష్యోహంతవసువ్రత । మమాపి దుర్భగస్యాథ స్థాణుభూతస్యసాంప్రతం।క్వచదుష్కృతపాపో హం క్వచేయంసద్గతిర్మమ।క్వచాహంకార్తికఃపుణ్యః క్వచాహందుష్కృతాలయః । క్వచ తేషాందర్శనంచ క్వచాయం విష్ణుసన్నిధిః। సుకృతస్యఫలంవిప్ర సత్యంప్రారబ్ధకర్మణః॥

తా॥ ఓమునివర్యా నాకు నీవె తండ్రివి, నీవెసోదరుడవు, నీవెగురువవు, నేనునీకు శిష్యుఁడను దరిద్రుఁడనై మొద్దుగానున్న నాకిప్పుడునీవుగాక గతియెవ్వరైరి. పాపవంతుఁడనైన నేనెక్కడ యిలాగంటి సద్గతియెక్కడ పాపములకు స్థానమైన నేనెక్కడ పుణ్యమైన కార్తికమాసమెక్కడ, యీమునీశ్వరులెక్కడ, యీవిష్ణుసన్నిధియెక్కడ ప్రారబ్ధసుకృతమున్నయెడల తప్పక ఫలించునుగదా నాకిద్దియే పూర్వపుణ్యమున్నది దానంజేసి యిట్లింతయు లభించెను.

శ్లో॥ పునర్బోధయమాంప్రీత్యా కృపాచేదస్తితేమయి।కథంకర్మాణి మనుజైః క్రియంతెవిధినామునె। కథంతేషాంఫలంతద్వత్కథంతదుపదేశకం। కఃకాలఃకానికర్మాణి కిముద్దిశ్యసమాచరేత్ పునస్సమ్యక్సమాచక్ష్వ శ్రోతుమిచ్ఛామ్యహంశుభం। త్వద్వాగ్వజ్రాయుధోత్పాతాత్పాపశైలఃపపాతమే। పునః కర్మాణిమాంబోధ మహాసిత్వంమహీపతే॥

తా॥ అయ్యా! నాయందు దయయుంచి యింకాచెప్పుము మనుష్యులువిధిగా కర్మలెట్లుచేతురు, ఆకర్మలకు ఫలమెట్లుగలుగును వాటియుపదేశ మెట్లుచేయుటకు ముఖ్యకాలమెద్ది, కర్మలెవ్వి, యేమికోరిచేయవలెను, యీవిషయమంతయు వినగోరినాను గనుక చెప్పుము నీవాక్యమను వజ్రాయుధముచేత నాపాపపర్వతము హతమాయెను.

అంగీరసఉవాచ॥ శ్లో॥ సాధుసాధుత్వయాపృష్టం యన్మామద్భుతమానవ। సర్వలోకహితార్థంతు యత్త్వయోక్తమిదంశుభం। శ్రుణుష్వావధానేన యత్పృష్టంతద్బ్రవీమ్యహమ్।

తా॥ (అంగీరసముని చెప్పుచున్నాడు) ఓయీ నీవడిగినప్రశ్న చాలాబాగున్నది లోకహితముకొఱకు నీవడిగితివి గనుక నీవడిగినప్రశ్నకు సమాధానమును చెప్పెదను వినుము.

శ్లో॥ అనిత్యం దేహమాసాద్య విస్మృత్యాత్మనమక్షధీః। నద్వంద్వ మాత్మనఃక్వాపి సర్వ దేహస్యజాయతే। తస్మాత్సం దేహాభాజాయః క్రియాత్కర్మప్రవర్తకః। తత్కర్మణాజ్ఞానసిద్ధిః జ్ఞానాదాత్మప్రకాశనమ్॥

తా॥ అనిత్యమైన ఈదేహమును ఆశ్రయించి యింద్రియకాముడైఆత్మనుమఱచి దేహాదులనే ఆత్మయనితలచవలదు ఆత్మకెప్పుడు సుఖదుఃఖాది ద్వంద్వములులేవు అవి దేహాదిధర్మములైయున్నవి కాఁబట్టి ఆత్మవిషయక సందేహవంతుడు కర్మ చేయవలెను దానితో చిత్తశుద్ధిగలిగి తద్వారా జ్ఞానమునుబొంది దానిచేత ఆత్మను యథార్థముగా తెలుసికొనవలెను.

శ్లో॥ స్నానాదిసర్వకర్మాణి త్వయివిద్యోతితానిచ।
భక్త్యాసమాచరేత్కర్మ దేహీసమ్యగ్విధానతః॥

తా॥ దేహధారియైనవాడు తనకు విధించబడిన స్నానాదిసర్వకర్మలను భక్తితో విధిగా చేయవలెను.

శ్లో॥ వర్ణాశ్రమవిభాగాదీ న్స్నాతికాన్యథావిధి।
తేషాంయత్కర్మవిహితం జ్ఞాత్వాపశ్చాత్సమాచరేత్॥

తా॥ వర్ణాశ్రమవిభాగమును విడువక తనకేకర్మ చెప్పబడినదో విచారించి తెలిసికొని తరువాత చేయవలెను.

శ్లో॥ స్నానేనరహితంకర్మ హస్తిభుక్తకపిత్థవత్।
ప్రాతస్స్నానంద్విజాతీనాం శస్తంచశ్రుతిచోదితమ్॥

తా॥ స్నానముచేయక చేయు కర్మ. యేనుగుభక్షించిన వెలగపండువలె నిష్ఫలమగును బ్రాహ్మణులకు ప్రాతస్స్నానము వేదోక్తమైయున్నది.

శ్లో॥ ప్రాతస్స్నానేహ్యశక్తశ్చే త్పుణ్యంమాసత్రయోత్తమం।
తులాసంస్థేదివకరే కార్తిక్యాంతుమహామతే।
మకరస్థేరవౌమాఘే వైశాఖేమేషగేరవౌ॥

తా॥ నిరంతరము ప్రాతస్స్నానమాచరించలేనివాడు తులాకార్తీకమందును, మకరమాఘమందును, మేషవైశాఖమందును స్నానముచేయవలెను.

శ్లో॥ మాసత్రయేషుపుణ్యేషు ప్రాతస్స్నానందినేదినే।
యఃకుర్యాత్సహరేర్లోకం ప్రయాతిపరమాంగతిం।
కాలస్తుప్రాత్రరేవాస్య తథామాసత్రయంశుభమ్॥

తా॥ ఈమూఁడు మాసములందును ప్రాతఃకాలమందు స్నానము చేయువాఁడు వైకుంఠమునకు బోవును.

శ్లో॥ చాతుర్మాస్యాదిపుణ్యేషు కాలేషువిహితంచరేత్।
సోమసూర్యోపరాగేచ తథైవాన్యదినేషుచ।
కాలాంతరేవిజానీయా త్కాలేకర్మఫలప్రదమ్॥

తా॥ చాతుర్మాస్యాది పుణ్యకాలములందును చంద్రసూర్య గ్రహణములందును స్నానము ముఖ్యము యిందు గ్రహణములందు గ్రహణకాలమందె స్నానము ముఖ్యము

శ్లో॥ స్నానంసంధ్యాజపోహోమ స్తథాసూర్యాభివాదనం।
అవశ్యంతద్ద్విజాతీనాం యస్స్నానంనసమాచరేత్।
సయాతినరకంఘోరం కర్మభ్రష్టోభిజాయతే॥

తా॥ బ్రాహ్మణులకు ప్రాముఖ్యమైనది స్నానము సంధ్య, జపము, హోమము, సూర్యనమస్కారము, తప్పక చేయతగినవి స్నానమాచరించనివాఁడు ఘోరనరకమందు యాతనలనొంది తుదకు కర్మభ్రష్టుగా జన్మించును.

శ్లో॥ తస్మాత్కార్తికమాసస్య యఃకాలఃపురుషార్థదః।
నకార్తికసమోమాసః నకాలఃకార్తికాత్సమః॥

తా॥ కాఁబట్టి పుణ్యకాలము కార్తికమాసము యీకార్తికము ధర్మార్థకామమోక్షముల నిచ్చును. యీకార్తికముతో సమానమైన మాసములేదు యింతకంటె పుణ్యకాలములేదు.

శ్లో॥ నవేదసదృశంశాస్త్రం నతీర్థంగంగయాసమం।
నకులేనసమంబ్రాహ్మ్యాత్ నసుఖంభార్యయాసమం।
నధర్మేణసమంమిత్రం నజ్యోతిశ్చక్షుషాసమం।
నకార్తికసమోమాసః నదేవఃకేశవాత్పరః॥

తా॥ ఏప్రకారము వేదముతో సమానమైన శాస్త్రములేదో, గంగతో సమానమైన తీర్థములేదో, బ్రాహ్మణ్యముతో సమానమైన కులములేదో, భార్యతో సమానమైన సుఖములేదో, ధర్మముతో సమానమైన మిత్రములేదో, నేత్రముతో సమానమైన జ్యోతిస్సులేదో, కేశవునితో సమానమైన దేవుఁడులేఁడో, అట్లు కార్తికమాసముతో సమానమైన మాసములేదు గదా.

శ్లో॥ యఃకుర్యాత్కార్తికేమాసి ధర్మాన్కర్మవిదుత్తమః।
క్రతుకోటిఫలంప్రాప్య సవిష్ణోరాలయేవసేత్॥

తా॥ కర్మస్వరూపమును తెలిసికొని కార్తీకమాసమందు ధర్మములను చేయువాఁడు కోటియజ్ఞఫలమును బొంది వైకుంఠమందుండును.

ఉద్భాతః॥ శ్లో॥ చాతుర్మాస్యమితిప్రోక్తం యత్త్వయాపూర్వకంమమ।
కేనప్రకాశితంపూర్వం కిముద్దిశ్యసమాచరేత్ ।
కింఫలంకాగతిర్మేద్య తత్సర్వంవక్తుమర్హసి॥

తా॥ (ఉద్భాతపురుషుఁ డడుగుచున్నాఁడు) అయ్యా! చాతుర్మాస్య వ్రతమని పూర్వము చెప్పియున్నారు. అది పూర్వము యెవనిచేత చేయఁబడినది? ఆవ్రతవిధియేలాగు యీవ్రతమునకు ఫలమేమి? దానినిచేయువాఁడు పొందెడిఫలమేమి? ఆచరించు మనుష్యుఁ డేలోకమునకు పోవును? యీవిషయమంతయు సవిస్తరముగా చెప్పుము.

ఆంగీరసః॥ శ్లో॥ బంధుర్భవాన్మనుష్యాణాం యత్పృష్టంతుసుఖప్రదం।
తత్సర్వంతేభిధాస్యామి సావధానమనాశ్శృణు॥

తా॥ (ఆంగీరసుఁడు చెప్పుచున్నాఁడు) ఓయీ నీవు యీమనుష్యులకు బంధువుగానున్నావు నీప్రశ్నలన్నియు లోకోపకారార్థములుగానున్నవి సమాధానమును చెప్పెదను సావధానుఁడవై వినుము.

శ్లో॥ ఆషాఢేపూర్వపక్షస్యదశమ్యాంచజనార్దనః। శేతేనముత్రివ్యాజేన శ్రియాసాకంపయోనిధౌ। కార్తీకేశుక్లపక్షేస్యాద్ద్వాదశీహరిబోధినీ। చాతుర్మాస్యమితిప్రోక్తంవిష్ణునుప్తిసుఖప్రదమ్॥

తా॥ విష్ణుమూర్తి లక్ష్మితోఁగూడా ఆషాఢశుక్ల దశమిదినంబున పాలసముద్రమందు నిద్రయనుమిషతో శయనించును, తిరిగి కార్తీకశుక్ల ద్వాదశీ రోజున లేచును యిదిచాతుర్మాస్యము అనఁగా నాలుగు మాసములు.

శ్లో॥ సత్యంధ్యాయతితన్మధ్యే సవై యాతిపదంవిభోః।
విష్ణునుప్తిప్రదేయస్మిన్ పుణ్యేమాసచతుష్టయే।
యద్యదాచరతేయస్తు తత్సర్వంసఫలంభవేత్ ॥

తా॥ యీనాలుగు మాసములు విష్ణుమూర్తికినిద్రాసుఖమునిచ్చునవి. అనఁగా హరి యెనిమిదిమాసములు వ్యాపారముతోనుండి నాలుగుమాసములు విరమించి సుఖాసీనుఁ డయుండును. విష్ణువునకు నిద్రాసుఖమిచ్చునది గనుక యిది పుణ్యకాలము ఈపుణ్యకాలమందు హరిని ధ్యానించువాఁడు విష్ణులోకమును పొందును. ఈనాలుగు మాసములలోను చేసిన పుణ్యకార్యములు అనంతమగును.

శ్లో॥ కారణంతత్రవక్ష్యామి నారదేహారిణోదితం। పురాకృతయుగే పుణ్యే వైకుంఠేవిష్ణుమందిరే । సేవ్యమానస్సురగణైః కిన్న

రోరగఖేచరైః। హాస్యాంకస్సితయాలక్ష్మ్యాస్పార్థంపంచమ
ఖాసనే। ఉపవిష్టస్సేవ్యమాన స్వభృత్యైస్స్వగణైర్హరిః॥

తా॥ దీనికి కారణమును చెప్పెదను వినుము. యీవిషయమందు నారదునకు హరి చెప్పిన గాధకలియున్నది. పూర్వమందు కృతయుగమందు వైకుంఠలోకమందుహరిలక్ష్మి తోగూడా సింహాసనమందు కూర్చుని సురకిన్నరఖేచరోరగ గణములచేతను స్వగణభృత్యులచేతను సేవింపబడుచుండెను. ఖేచర=ఆకాశసంచారులు, ఉరగ=సర్పములు)

శ్లో। ఇతిస్థితేహరౌతత్ర నారదోభగవత్ప్రియః।
ఆజగామహరేర్లోకం కోటిసూర్యప్రభాన్వితమ్॥

తా॥ హరి యిట్లుండగా భగవద్భక్తుడైన నారదముని కోటిసూర్యకాంతిగల వైకుంఠలోకమును గూర్చి వచ్చెను.

శ్లో॥ తత్రసింహాసనాసీనం చతుర్బాహుంమనోహరం।
సాధుపద్మపలాశాక్షం నారదస్సవ్యలోకయత్॥

తా॥ నారదమునివచ్చి సింహాసనాసీనుడై నాలుగుభుజములు గలిగి పద్మముల వంటి నేత్రములతో ప్రకాశించెడి విష్ణుమూర్తిని పలాశం= మోదుగ, జూచెను.

శ్లో। ననామపాదయోస్తస్య జాతహర్షాన్వితోమునిః।
హరిర్దేవఋషింద్రుష్ట్వా నారదంసార్ధవాసినం।
విహస్యవాక్యమాహేదం నజానన్నివకేశవః॥

తా॥ చూచి అమితానందయుక్తుడై నారదుడు విష్ణుమూర్తియొక్క పాదములకు మ్రొక్కెను, హరియు నారదునిజూచి నవ్వుచు తెలియనివాడివలె యిట్లనియె.

భగవానువాచ। శ్లో॥ కుశలంతవవిప్రేంద్ర యత్రయత్రగమిష్యసి।
ఋషీణాంసర్వధర్మాణి కింనుసాధూనినారద।
సర్వోపద్రవహీనాని విహితానిమనీషిణాం।
మానవాస్సర్వధర్మేషు నియుక్తాస్తేపృథక్పృథక్।
తత్సర్వంవదదేవర్షే సదస్యస్మిన్మునీశ్వర॥

తా॥ ఓనారదా! నీవు సంచరించు స్థలములందు సర్వత్రకుశలమా? ఋషులధర్మములు బాగుగానున్నవా, యుపద్రవములు లేకుండానున్నవా, మనుష్యులు వారివారి ధర్మములందున్నారా? యీవిషయమునంతయు యీసభలో చెప్పుము.

శ్లో॥ ఇత్థంహరేర్ముకుందస్య వచశ్శ్రుత్వాసనారదః।
హరిమాహప్రసన్నాత్మా విహస్యవిశ్వమంగళమ్॥

తా॥ నారదుఁడు ఆమాటను విని ఆనందించి నవ్వుచు హరితో యిట్లనియె.

నారదఉవాచ॥ శ్లో॥ హరేదృష్టంమయాభూమౌ వైర్వేముక్తత్రియీ
పథః। భగవన్మునయోవాపి కేచిన్మౌనవసంగతాః। సువి
స్మృత్యోదితంకర్మ ముక్తాస్స్యుః కేన తేప్రభో॥

తా॥ ఓస్వామీ! నేను భూమంతయు తిరిగి చూచినాను వేదత్రియమందుచెప్ప బడిన మార్గము విడువబడినది కొందఱు మునీశ్వరులు గ్రామ్యముఖలోలురైరి, తమతమ కర్మలను యావత్తువిడిచి యుండిరి. వారు దేనిచేత ముక్తులగుదురో నాకు తెలియకున్నది.

శ్లో॥ అభక్ష్యభక్షణరతాః కేచిత్త్యక్తవ్రతాఃపరే। కేచిదాచార
సంపన్నా స్తథాహంకారవర్జితాః। కేచిత్సన్మార్గనిరతాః కేచి
న్నిందాపరాయణాః।తస్మాత్త్వం పాలయస్వత్వం భగవన్నృ
షిమండలం। గురుశిక్షాముపాయేన దేవదేవసుకర్మణా॥

తా॥ కొందరు తినగూడని వస్తువులను తినుచున్నారు, కొందఱు వ్రతములను విడిచినారు, కొందఱు ఆచారవంతులుగానున్నారు, కొందఱు అహంకారవర్జితులు గానున్నారు, కొందఱు మంచిమార్గవర్తనులుగా ఉన్నారు, కొందరు నిందచేయు వారుగానున్నారు, కాఁబట్టి యోదేవ! యేదైన నొకయుపాయముచేత శిక్షించి యీ ఋషీశ్వరులను రక్షించుము.

శ్లో॥ శ్రుత్వా దేవఋషేర్వాక్యం భగవాన్భక్తవత్సలః।
పాలకస్సర్వలోకానా మేకఏవజనార్దనః।
హరిఃఖగేంద్రమారుహ్య సలక్ష్మ్యాభువమాగమత్॥

తా॥ నారదునిమాటవిని భక్తవత్సలుఁడును, సమస్తలోకపాలకుఁడును, అయిన హరి లక్ష్మితో సహా గరుత్మంతు నధిష్ఠించి భూలోకమునకు వచ్చెను.

శ్లో॥ యత్రిసాహస్రిసంఖ్యాకం మునీనాంమండలంవిభుః।వృద్ధబ్రా
హ్మణరూపేణ సంచరన్సర్వమేదినీం। సర్వజంతుహృదిస్థోపి
మాయానాటకవిగ్రహః। యతయుతసుపుణ్యేషు క్షేత్రతీర్థ
గిరిష్వపి విపినేష్వపిపుణ్యేషు ఆశ్రమేష్వవిశేషతః॥

తా॥ విష్ణుమూర్తి వృద్ధబ్రాహ్మణరూపధారియై వేలసంఖ్యగల బ్రాహ్మణు లున్న స్థలములకు వచ్చి సర్వప్రాణిహృదయగతుఁడై నప్పటికి మాయానాటకధారియై పుణ్యక్షేత్రములందును. తీర్థములందును, పర్వతములందును, అరణ్యములందును, ఆశ్రమములందును, తిరుగుచు సమస్తభూమియందు తిరుగుచుండెను.

శ్లో॥ దృష్ట్వా కేచిద్ద్విజవరా మానవాభక్తితత్పరాః। ఆతిథ్యంచక్రిరే కేచిత్కేచిత్తంజహసుఃపరే॥ ననమంతితథా కేచిత్కేచిన్మానవశంగతాః। కేచిద్గర్వవశంప్రాప్తాః కామాంధాస్తత్ర కేచన। కేచిత్తత్రక్రియాలోలాః కేచిదేకవ్రతాఃపరే। కేచిత్తత్రనిషిద్ధేషు దినేష్వన్నపరాయణాః। హరివాసరవిభ్రష్టాః తథాభోజ్యేష్వపిప్రియాః। కేచిదాచారసంపన్నాః కేచిదాత్మనిలాలసాః॥

తా॥ ఇట్లు సంచరించుచున్న విష్ణుమూర్తిని జూచి కొందరు భక్తితో అతిథి సత్కారములను చేసిరి, కొందరు నవ్విరి, కొందరు నమస్కారము చేయరైరి కొందరు అభిమానవంతులైరి, కొందరు గర్వముతో నుండిరి, కొందరు కామాంధులై యుండిరి, కొందరా యాయా క్రియాకలాపములను మానిరి, కొందరేకవ్రతపరాయణులై యుండిరి, కొందరు నిషిద్ధదినములందు అన్నమును తినువారుగా నుండిరి, కొందరేకాదశ్యుపవాస మాచరించనివారుగా నుండిరి, కొందరు తినగూడని వస్తువులను తినుచుండిరి, కొందరాచారవంతులుగా నుండిరి, కొందరాత్మచింత చేయుచుండిరి.

శ్లో॥ తాన్దృష్ట్వా భగవాన్విష్ణుర్ద్విజరూపీజనార్దనః।
ఉపాయంచింతయన్నగాత్సపునర్మునిమండలం।
నైమిశంసుమహారణ్యం పుణ్యంమునివరప్రియమ్॥

తా॥ బ్రాహ్మణరూపధారియైన భగవంతుఁడు అట్టివారిని చూచి మంచిమార్గముకు తెచ్చు యుపాయమును ఆలోచించుచు నైమిశారణ్యమందున్న ముని బృందముల సన్నిధికి వచ్చెను.

శ్లో॥ హిత్వాමునివరంరూపం పూర్వవత్ఖగవాహనః।
కౌస్తుభాభరణశ్శ్రీమచ్ఛంఖచక్రవిరాజితః।
సాకంస్వభక్తనికరైస్సభార్యోజగదీశ్వరః॥

తా॥ వచ్చి బ్రాహ్మణరూపమును వదలి పూర్వమువలె గరుడారూఢుఁడై కౌస్తుభ శంఖచక్రములను ధరించి లక్ష్మితోను స్వభక్తులతోను గూడి ప్రకాశించుచుండెను.

శ్లో॥ ఏవందివ్యమయందృష్ట్వా జ్ఞానసిద్ధాదయోమలాః సశిష్యాస్సుశ్రావుణ్యాస్సర్వేవిస్మితమానసాః। విష్ణుంవైకుంఠనిలయం స్వాశ్రమేస్వాగతంహరిం। అతసీపుష్పసంకాశంవిద్యుద్వర్ణపటావృతం। కోటిసూర్యప్రభాభాసం స్ఫురన్మకరమండలం। అనేక

రత్నసంయుక్తం కిరీటేనవిరాజితం। అనేకాదిత్యసంకాశమమే యమమరేశ్వరం। స్వయంప్రసన్నమధ్యక్ష మాద్యందృష్ట్వా మునీశ్వరాః॥ జ్ఞానసిద్ధాదయస్సర్వే మునయస్సంస్థితవ్రతాః॥ హరేస్సమీపమాజగ్ముస్సర్వేజాతసుబుద్ధయః॥

తా॥ అచ్చటనుండు జ్ఞానసిద్ధులు మొదలైన మునులు వైకుంఠమునుంచి తమ యాశ్రమమునకు వచ్చిన అవిసెపువ్వుతో సమానమైనకాంతిగలవాడును, మెరుపువంటి వస్త్రముగలవాడును, కోటిరవిభాసమానుడును, మకరకుండలవిరాజితుడును. అనేకరత్న గ్రథితకిరీటప్రకాశమానుడును, అనేకసూర్యకాంతివంతుడునుమనోవాచామగోచరుడును దేవతాపతియు, స్వయంభువును, ప్రసన్నుడును, అధిపతియు, ఆద్యుడు అయిన విష్ణుమూర్తిని జూచి ఆశ్చర్యమొంది ఆనందించి శిష్యానుతాది పరివారముతో హరిసన్నిధికి వచ్చిరి.

శ్లో॥ ప్రణామంచక్రిరనఘాః పాదయోఃపరమాత్మనః॥ అగతాశ్చ సముద్భూతాఃతిష్ఠంతిశ్చపురోభువి।జ్ఞానసిద్ధాదయస్సర్వేమున యఃప్రాంజలిస్థితైఃతుష్టువుస్తత్రసంతుష్టాస్సర్వజ్ఞంజగదీశ్వరం॥

తా॥ వచ్చి హరిపాదములకు నమస్కారముచేసి హరిముందర నిలిచి అంజలి బద్ధులై హరిని వక్ష్యమాణరీతిగా స్తుతించిరి.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే అష్టాదశో౽ధ్యాయ స్సమాప్తః.

---

## అథ ఏకోనవింశో౽ధ్యాయారంభః.

జ్ఞానసిద్ధఉవాచ॥ శ్లో॥ విదురధికవిధిజ్ఞా వేదవేద్యంసుగుహ్యాం । నిగమ హృదయవాసం నిశ్చలంనద్వితీయం । హిమకరరవిశర్వ బ్రహ్మముఖ్యైర్నరేంద్రైః స్తుతచరణయుగంతేనామి భూయస్సురమ్యమ్॥

తా॥ (జ్ఞానసిద్ధుఁడు స్తుతిచేయుచున్నాడు) వేదవేత్తలు మిమ్ము వేదవేద్యునిగా నున్ను వేదాంతములందుండు వారినిగానున్ను, గుహ్యమైనవారినిగానున్ను, నిశ్చలునిగా నున్ను, అద్వితీయునిగాను, తెలిసికొనుచున్నారు, చంద్రసూర్య శివబ్రహ్మాదులచేతను, రాజులచేతను స్తుతించబడుచు, రమ్యమైన మీపాదపద్మములకు నమస్కారము.

శ్లో॥ భవాన్నవాచాంవిషయో ఒసినిత్యంభవార్చితాంఘ్రి ర్భవభీతిహంతా। భవార్ణవస్థైస్సతతం భవాద్యైస్తుత్యో భవద్భూధరభూతరూపైః॥

తా॥ మీవాక్యములకు చెప్పశక్యముగాదు, శివపూజాధురంధరులు సంసార భయమును తీసివేయు సమర్థులు, జన్మసంసారసముద్రమందున్న శివాదులచేత నిత్యము కొనియాడబడువారు పర్వతాదిరూపములను ధరించిన మహానుభావులు.

శ్లో॥ భూతానిభూతానితథైవసంతి భవ్యానిసర్వాణి చరాచరాణి। భవద్విభూతిఃపరమాపరస్తాత్పరో భవానీ పతిపూజితాంఘ్రిః॥

తా॥ పంచమహాభూతములు చరాచరరూపములై అన్నిభూతములునుమీవిభూతి విస్తారమే, శంకరసేవితపాదా! మీరు పరముకంటె పరుడవు.

శ్లో॥ త్వమీశ్వర స్త్వయ్యఖిలం విభాతిమాయామయంస్రక్ఫణికల్పమీశ। చరాచరంవిశ్వమనేకబీజం భూతైర్మహద్భిస్సహమాయయాచ॥

తా॥ నీవే యీశ్వరుడవు యీచరాచరరూపమైన ప్రపంచమంతయును దానికి కారణమైన మాయతోకూడా మీయందుతోచుచున్నది. అదియెట్లున్నదంటే తాడు పామువలె తోచుచున్నది అనగాలేనిదని భావము.

శ్లో॥ ఆద్యాంతధ్యాం తేచభవాన్ సమగ్రంవిశ్వావతస్థఃభవతీహమధ్యే అన్నస్యయజ్ఞస్య చ ... స్మరారె చతుర్విధస్యాపివిచిత్రరూప॥

తా॥ ఓకృష్ణా! నీవుఆదిమధ్యాంతములందుప్రపంచమందంతటనుయున్నావు,భక్ష్య భోజ్య, లేహ్య, చోష్య, రూపచతుర్విధాన్నరూపుడవు నీవే యజ్ఞస్వరూపుడవు నీవే.

శ్లో॥ స్తుత్వాత్వదీయంపరమం సుఖంతుసంజీవ్యసచ్చిత్సుఖరూపమేతత్। ప్రతీయతేయద్విదిదం। జగచ్చసుచంద్రికాయాంతుహరేపయోబ్ధిః॥

తా॥ నీసంబంధియు పరమసుఖప్రదమును అయిన సచ్చిదానంద స్వరూపమును చూచిన తరువాత యీజగము వెన్నెలయందు సముద్రమువలె తోచును.

శ్లో॥ఆనందవారాంనిధిరీశ్వరత్వంత్వమేవతద్వ్యాప్తిసర్వతోసి।సర్వాకరంసర్వపురాణ సారంత్వత్తస్సమస్తం త్వయిలీయతేచ॥

తా॥ ఆనందసముద్రము నీవేను, నీవే యీశ్వరుడవు, నీవేజ్ఞానస్వరూపుడవు, సమస్తమునకు నీవే యాధారము, సమస్తపురాణసారమునీవే యగుదువు; నీవలననే సమస్తము జనించును, నీయందేలయించును.

శ్లో॥ ఆత్మస్వరూపోఽసిజనార్దనత్వం సర్వాత్మనాంహృదయస్థోఽసిదేవ। దివ్యాత్మనస్తేన్ముఖస్యాపి దృశ్యోఽసి మాంస దృశాంత్వమత్ర॥

తా॥ నీవు ప్రాణుల హృదయమందుండువాడవు, ఆత్మస్వరూపుడవు అఖిల వంద్యుడవు, మనస్సుచేతను చూడశక్యముగాని నీవు మాంసమయములైన నేత్రముల కెట్లు గోచరమగుదువు.

శ్లో॥ నమోనమస్తేశ్వర తే నమోస్తు నారాయణ స్త్వం కురుమా కృతార్థం। తద్దర్శనంమాంవిఫలం మమాస్తు నమోముఠారె పురుషాయతుభ్యమ్॥

తా॥ ఓకృష్ణా నీకు నమస్కారము, ఓఈశ్వరా! నీకు నమస్కారము, ఓనారా యణా నీకు నమస్కారము, నన్ను ధన్యునిచేయుము మీదర్శన ఫలమివ్వవలెను, ఓపరమ పురుషా నీకు పునః నమస్కారము.

శ్లో॥ త్వంమాంసదాపాహిసురేశ్వరేశ నమోఽప రేశాఖిలలోకవంద్య। ఏవంకృతేహంచకృతకృత్యో తేపికించిత్వంయాతినాశమ్॥

తా॥ ఓదేవేశ నన్ను నిరంతరము పాలించుము, నీకు నమస్కారము సమస్త లోకములయందు పూజించతగిన మీకు నేను మ్రొక్కెద. యిందువలన నాజన్మ సఫలమగుగాక నీకేమియు కొఱతపడదు.

శ్లో॥ కృపానిధానంతుభవాన్వదాన్యః శోచ్యస్తథాహంచభవార్ణవస్థః।సంశుద్ధపాహీశ్వరలోకవంద్యసంసారసింధౌపతితంమురారే॥

తా॥ నీవు దాతవు, కృపాసముద్రుడవు, నేనుసంసారసముద్రమునమగ్నుడనైదుఃఖిం చతగియున్నాను, కాబట్టి సంసారసింధువందు పడియున్న నన్ను రక్షించుమా, శుద్ధ చరితా ముకుందా.

శ్లో॥ నమస్త్రైలోక్యనాథాయ నమస్త్రైలోక్యవాసినె।
అనంతాయాదిబీజాయ విష్ణవె వేధసెనమః॥

తా॥ త్రిలోకనాథా నమస్కారము, త్రిలోకవాసీ నమస్కారము, అనంతా, ఆదికారణా, పరమాత్మా, నమస్కారము.

శ్లో॥ హంసాయహంసపతయె నమఃపూర్ణసదాత్మనె।
గుణాతిగాయగురవె నమస్తె కరుణానిధే॥

తా॥ పరమాత్మరూపుడవు, పరమహంసపతియు, పూర్ణాత్ముడవును, గుణాతీతుడును, గురువును, కృపావంతుడును, అగు కృష్ణా నీకు నమస్కారము.

శ్లో॥ నిత్యానందసుధాబ్ధివాసినే స్వర్గాపవర్గప్రదాయ నానాభేదవివర్జితాయ సుతరాం తేజస్స్వరూపాయచ । సాధుహృద్గృహాత్సరోరుహదళేష్వంతస్థితాయాత్మనే । గోవిందాయ సురేశ్వరాయ హరయేకృష్ణాయతుభ్యంనమః॥

తా॥ నిత్యానందసుధాబ్ధినివాసివి, స్వర్గమోక్షప్రదుడవు, భేదరహితుడవు, తేజోరూపుడవు, సాధుహృదయసముద్రశయనుడవు, హృదయసరోజదళస్థితుడవు(లేక) సాధుహృదయపద్మనివాసివి, ఆత్మరూపుడవు, దేవేశుడవును, అయినఓకృష్ణానీకునమస్కారము

శ్లో॥ విశ్వోత్పత్తివిపత్తిగుప్తిపతయే వైకుంఠవాసాయ తే। వ్యాసాద్యైర్నతపాదపద్మవిబుధైరానమ్రయుక్తంధరైః। స్తుత్వాతేపదభక్తినావ మధికం త్వోరుహ్యాజన్మార్ణవం తీర్త్వాత్వాం సమమాపురార్తిహరసం తేజోమయం తేహరే॥

తా॥ ప్రపంచమును పుట్టించి పోషించి సంహరించువాడా! నీకునమస్కారము, వైకుంఠనిలయా! వ్యాసాదులచేతకొనియాడబడు పాదములుగల కృష్ణా నీకు నమస్కారము, విద్వాంసులు నీకు నమస్కారాదులు చేసి నీపాదభక్తియను పడవచేత సంసార సముద్రమును దాటి తేజోమయమైన నీరూపమును పొందుదురు.

శ్లో॥ నానాబోధసుతర్కవాక్యనిచయైర్నానాపురాణాగమైః । నానాశాస్త్రవిచారనీతిసహితైర్నత్వాం విదుర్మానవాః । త్వద్భక్త్యాచనిరంజనద్యుతిబలాత్త్వత్పాదపద్మంహరే। పశ్యంత్యాత్మని కేవలమేన సతతంత్వద్భక్తిశ్చోత్తమమ్॥

తా॥ అనేక బోధలచేతను, తర్కవాక్యములచేతను, పురాణములచేతను, శాస్త్రములచేతను, నీతులచేతను, మనుష్యులు నిన్ను చూడలేరు, నీపాదభక్తియను కాటుకను ధరించి నీరూపమును చూచి దానినే యాత్మగా భావించి తరించుదురు.

శ్లో॥ హస్తీంద్రధ్రువపాలకాయ విభవే ప్రహ్లాదసంరక్షిణే। మార్కండేయవిభీషణోద్ధవపరిత్రాత్రేయశస్సంపదే। త్వన్నామగ్రహణేన పాతకచయం తూర్ణంచనశ్యత్యహో । దిష్ట్యాయదుకృష్ణ దేవతత్వత్పదయుగం ప్రాప్నోతితుభ్యంనమః॥

తా॥ గజేంద్ర, ధృవ, ప్రహ్లాద, మార్కండేయ, విభీషణ, ఉద్ధవముఖభక్తులను కాపాడిన ఓహరీ నీకు నమస్కారము, నీనామమును కీర్తించినంతలో సమస్తపాతకములు నశించును ఆశ్చర్యము వక్కాణు నీనామసంకీర్తన మాచరించువాడు నీసన్నిధికి చేరును.

శ్లో॥ కేశవాయనమస్తేస్తు నమోనారాయణాయచ। గోవిందాయ నమస్తేస్తు విష్ణవేజిష్ణవేనమః। మధుసూదనాయదేవాయ మహేశాయమహాత్మనే త్రివిక్రమాయనిత్యాయవామనాయ నమోస్తుతే। శ్రీధరాయనమస్తేస్తు హృషీకేశాయతేనమః। నమస్తేపద్మనాభాయ నమోదామోదరాయచ। సంకర్షణ నమస్తుభ్యం పాహ్యస్మాన్ కరుణానిధే॥

తా॥ ఓకేశవా, నారాయణా, గోవిందా, విష్ణూ, జిష్ణూ, మధుసూదనా, దేవా, మహేశా, మహాత్మా, త్రివిక్రమా, నిత్యరూపా, వామనా, శ్రీధరా, హృషీకేశా, పద్మనాభా, దామోదరా, సంకర్షణా. నీకువందనములు ఓకృపానిధీమమ్ము లనురక్షించుము.

శ్లో॥ స్తుతనంతమిత్థంభగవాన్ జ్ఞానసిద్ధిమువాచహ। ఈషత్స్మితాబ్జవదనో విష్ణుర్లోకమంతవల్లభః॥

తా॥ ఇట్లు స్తుతిచేయుచున్న జ్ఞానసిద్ధునితో భగవంతుడు చిరునవ్వుతో యిట్లనియె.

శ్రీభగవానువాచ॥ శ్లో॥ తుష్టోహంజ్ఞానసిద్ధేద్య వరంవరయసువ్రత। త్వయాకృతేనస్తోత్రేణ ప్రసన్నంచమనోమమ॥

తా॥ ఓజ్ఞానసిద్ధా! నీస్తోత్రమునకు సంతోషించినాను. నామనస్సు నీవిషయమై ప్రసన్నమైనది వరమిచ్చెదను కోరుకొనుము.

జ్ఞానసిద్ధఉవాచ॥ శ్లో॥ త్వత్పదం దేహిగోవింద కృపాచేదస్తితేమయి। నకాంక్షయేహమధిక మితోన్యంవరముత్తమమ్॥

తా॥ (జ్ఞానసిద్ధుడడుగుచున్నాడు) గోవిందా నాయందు దయయున్న యెడల నీస్థానమును యిమ్ము యింతకంటె వేరు వరముకోరను.

భగవానువాచ॥ శ్లో॥ తథాభవిష్యతిమునే శృణుచాన్యంసుఖప్రదం। లోకేకేచిద్దురాచార మాశ్రయంత్యస్తబుద్ధయః। కల్పయేహంవ్రతంతేషాం శ్రుత్యుక్తమఘహారకం। శృణ్వంత్వత్రస్థితాస్సర్వే వాక్యంమేఘౌఘసంకరమ్॥

తా॥ (భగవంతుడు చెప్పుచున్నాడు) సిద్ధాసిద్ధ సేవకులారా కోరినట్లగును కాని యింకొకమాటచెప్పెదను వినుము లోకమందు కొందరు దురాచారవంతులయియున్నారు బుద్ధిహీనులయినారు, వారిపాపములు నశించి వారికి ముక్తికలిగెడి యుపాయమును చెప్పెదను వినుము. ఓ మునీంద్రులారా [illegible] వినుడు నేచెప్పెడిమాట ప్రాణులకు సుఖదాయకము.

శ్లో॥ అహమాషాఢమాసస్య దశమ్యాంశుక్లపక్షకే। నిద్రాంకరో మిఫణీంద్రే లక్ష్మ్యాసహపయోనిధౌ । ఉద్బుధ్యేహంతథై వోర్జే శుక్లద్వాదశివాసరే॥

తా॥ నేను ఆషాఢశుక్ల దశమినాడు లక్ష్మితోగూడ సముద్రమందు నిద్రించె దను తిరిగి కార్తికశుక్ల ద్వాదశినాడు మేల్కొనెదను.

శ్లో॥ మమసుప్తిప్రదేప్యస్మి భూమ్యాంమాసచతుష్టయే । యస్తు వ్రతాదిచారైశ్చ యశ్శక్త్యామాముపాసతే। తేషాంపాపాని నశ్యంతి సన్నిధిర్మేభవేచ్చిరమ్॥

తా॥ కాబట్టి నాకు నిద్రాసుఖమును యిచ్చెడి యీమాసచతుష్టయమందుశక్తి వంచనచేయక వ్రతాదులనాచరించువారికి పాపములునశించును నాసన్నిధియుగలుగును.

శ్లో॥ నకుర్యాద్యదియోలోకే వ్రతంమాసచతుష్టయం। మత్సుప్తి కారణేపుణ్యే సయాతినిరయాలయమ్॥

తా॥ నాకు నిద్రాసుఖప్రదమైన యీమాసచతుష్టయమందు వ్రతమాచరించని వాడు నరకమందుపడును.

శ్లో॥ కుర్వంతుమునయస్సర్వే లోకేమద్భక్తిమాశ్రితాః। మదాజ్ఞ యామునిశ్రేష్ఠాః వ్రతమిష్టార్థదాయకం । నకరోతియదా మూఢశ్చాతుర్మాస్యవ్రతంశుభం । బ్రహ్మఘ్నగతిమా ప్నోతి కిమన్యైర్బహుభాషణైః॥

తా॥ ఓమునీశ్వరులార్యా? నాయాజ్ఞమీద నాభక్తిమంతులై యిష్టార్థదాయక మైన యీవ్రతమును మీరు తప్పక చేయండి యింకా అనేక మాటలతో యేమిపనియు న్నది యెవ్వడు మూఢుడై యీచాతుర్మాస్యవ్రతమును చేయడో వాడు బ్రహ్మహంతృ ఫలమును బొందును.

శ్లో॥ నిద్రాలస్యజడాద్యైశ్చ దుఃఖజన్మజరాదిభిః। లాభాలాభైస్త థాన్యైశ్చ నచాస్తిమనుజైర్భయం॥ యేమద్భక్తిపరాలోకే

యేవై సద్ధర్మవర్జితాః। తేషాంభక్తిపరీక్షార్థం సుప్తివ్యాజ
మువాశ్రయే॥

తా॥ నాకు నిద్రగాని మాంద్యముగాని, జాడ్యముగాని, దుఃఖముగాని, జన్మ జరాదులుగాని, లాభాలాభములుగాని లేవు అనఁగా యీనిద్రాదులకు భయపడి నేను సముద్రమందు శయనించలేదు, నాభక్తిగలవారు యెవ్వరో, భక్తిలేనివారుయెవ్వరో, పరీక్షించి చూతమని నిద్రయనుమిష పెట్టుకుని శయనించెదను.

శ్లో॥ విహితాం యేమమాజ్ఞాంచ యేకుర్వంతిమమప్రియం।
తేషాంపాపానినశ్యంతి మనోవాక్కాయజానిచ॥

తా॥ కాఁబట్టి నాయాజ్ఞను అనుసరించి నాకిష్టమైన యీచాతుర్మాస్య వ్రత మును చేయువారు గతపాపులగుదురు.

శ్లో॥ స్తోత్రంయఃపఠతేపుణ్య మిదంసంధ్యాత్రయేనరః।
మద్భక్తిరచలాచాస్తు సవై కుంఠేచిరంవసేత్॥

తా॥ నీచే చేయఁబడిన యీస్తోత్రమును నిత్యము త్రికాలములందు పఠించు వారికి నాభక్తిస్థిరమై అంతమందు నాలోకమందుచేరి సుఖింతురు.

శ్లో॥ ఇత్యుక్త్వాభగవాన్ కృష్ణ స్సలక్ష్మ్యాక్షీరసాగరం।
ఆషాఢస్యదశమ్యాంతు శుక్లాయాంప్రయయౌహరిః।
శేతేసుధానిధావిష్ణుః ఫణితల్పేసుఖప్రదే॥

తా॥ హరి యిట్లుచెప్పి లక్ష్మితో సహా ఆషాఢశుక్ల దశమినాడు పాలసముద్ర మందు నిద్రించుటకొఱకు వెళ్ళి ఆదిశేషుని తల్పమందు శయనించెను.

శ్లో॥ విష్ణువాక్యమిదంపుణ్యం కథితం తేమహామతే।
సర్వవ్రతోత్తమంపుణ్యం చాతుర్మాస్యఫలప్రదమ్॥

తా॥ (అంగీరసుఁడు చెప్పుచున్నాఁడు) ఓయీనీవడిగినప్రశ్నకు సమాధానము యిది యీచాతుర్మాస్యవ్రతము అన్నివ్రతములలోను యుత్తమోత్తమైనది.

శ్లో॥ పాపీయాంసోదురాత్మానః సాధవోవాహరిప్రియాః।
వ్రతంసమాచరేత్సమ్యక్ ప్రాప్తేమాసచతుష్టయే॥

తా॥ పాపవంతులుగాని, దురాత్ములుగాని, సాధువులుగాని, హరిభక్తాగ్రే సరులై, యీచాతుర్మాస్యవ్రతమును చేయవలెను.

శ్లో॥ బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యా శ్శూద్రాశ్చాపితథాపరే।
పతయఃస్త్రీజనాస్సర్వే వ్రతస్థావిష్ణుతుష్టయే॥

తా॥ బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, యితరులు అందరు యీవ్రతము చేయవలెను.

శ్లో॥ అథర్తావాసభర్తావా తథాకాషాయవాసకాః।
అవశ్యకమిదంభద్రం వ్రతంసమ్యక్సమాచరేత్॥

తా॥ యీచాతుర్మాస్యవ్రతమునుపుం, స్త్రీగాని, విధవగాని, శ్రమణిగాని, తప్పక చేయవలెను

శ్లో॥ నాచరేద్యదియోమోహాత్ తథాచేదంవ్రతంశుభం।
బ్రహ్మఘ్నగతిమాప్నోతి శుచిత్వంనైవవిద్యతె॥

తా॥ మోహముచేత చాతుర్మాస్యవ్రతమును చేయకుండినయెడల శుచిత్వము లేక బ్రహ్మహంత ఫలమును బొందును.

శ్లో॥ మనోవాక్కాయశుద్ధేన సపర్యాంవిష్ణవెన్వహం।
యఃకరోతిసధన్యోభూత్సుప్తే దేవెజనార్దనె॥

తా॥ మనోవాక్కాయములను శుద్ధముచేసికొని చాతుర్మాస్యమందు ప్రతిరోజు హరిని పూజించినవాడు ధన్యుడగును.

శ్లో॥ యోనకుర్యాద్వ్రతంపుణ్యం విష్ణోస్సుప్తిసుఖప్రదె।
సురాపగతిమాప్నోతి కోటిజన్మస్వసంశయః॥

తా॥ చాతుర్మాస్యవ్రత మాచరించనివాడు కోటిజన్మములందు కల్లుత్రాగు పొందెడి గతిని బొందును సందేహములేదు.

శ్లో॥ చాతుర్మాస్యవ్రతంపుణ్యం తుష్టయేపరమాత్మనః।
నకుర్యాద్యదివామోహాత్సగోత్రస్యగతింలభేత్॥

తా॥ పరమాత్మతుష్టికై చాతుర్మాస్యవ్రతమాచరించనివాడుగోహంతఫలమునుబొందును.

శ్లో॥ వ్రతంసమాచరేన్నిత్యం యేనకేనాపిమానవః।
సోపిక్రతుశతంపుణ్యం ప్రాప్యపశ్చాద్ధరింవ్రజేత్॥

తా॥ యీప్రకారముగా వీలుంచేసుకొని చాతుర్మాస్యవ్రత మాచరించనివాడు నూరుయజ్ఞముల ఫలమొంది అంతమందు విష్ణులోకముచేరును.

శ్లో॥ ఇత్యాకర్ణ్యహరేర్వాక్యం చాతుర్మాస్యవ్రతంశుభం।
జ్ఞానసిద్ధాదయస్సర్వే కృత్వావిష్ణుపదంయయుః॥

తా॥ జ్ఞానసిద్ధాదులిట్లు హరిమాటను విని చాతుర్మాస్యవ్రతమునుచేసి వైకుంఠ లోక నివాసులైరి.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే ఏకోనవింశోధ్యాయః సమాప్తః.

## అథ వింశోధ్యాయ ప్రారంభః

—(0)—

**రాజోవాచ॥ శ్లో॥ పునఃకార్తీకమహాత్మ్యం వదస్వమునిపుంగవ।**
**సర్వపాపప్రశమనం సర్వసౌభాగ్యకారణమ్॥**

తా॥ (జనకమహారాజు అడుగుచున్నాఁడు) మునీంద్రా సర్వపాపములను నశింపచేయు నదియు సౌభాగ్యప్రదమగు కార్తికమాహాత్మ్యమునుయింకావినకోరికగలదుగాన చెప్పుము

**వసిష్ఠఉవాచ॥శ్లో॥శృణురాజన్ ప్రవక్ష్యామి మహాత్మ్యంకార్తికస్యచ।**
**అగస్త్యస్యాత్రిణాప్రోక్తం సంవాదంపరమాద్భుతమ్॥**

తా॥ (వసిష్ఠముని చెప్పుచున్నాఁడు) రాజా వినుము కార్తీకమాహాత్మ్యమును గుఱించి అగస్త్యమునికిని అత్రిమహామునికిని జరిగిన సంవాదమున్నది, అది చాలా ఆశ్చర్యకరమైనది.

**అత్రిరువాచ॥ శ్లో॥ కార్తికస్యమాహాత్మ్యం శ్రుణుష్వమునిపుంగవ।**
**లోకత్రయోపకారాయ వక్ష్యామిహరిసత్కథామ్॥**

తా॥ (అత్రిమహాముని చెప్పుచున్నాఁడు) అగస్త్యమునీంద్రా లోకత్రయోపకారము కొఱకు కార్తీకమాహాత్మ్యబోధకమైన హరికథను చెప్పెదను వినుము.

**అగస్త్యఉవాచ॥ శ్లో॥ ధర్మధర్మభృతాంశ్రేష్ఠ వాసుదేవాంశసంభవ।**
**సద్ధర్మశ్రవణేకాలే కార్తికఃకీర్తితస్సకృత్ ।బ్రూహితం**
**విస్తరాత్ప్రోతుకామాయసాంప్రతమ్ ॥**

తా॥ (అగస్త్యుడడుగుచున్నాఁడు) విష్ణ్వంశసంభూతుడవైన యోఅత్రిమునీశ్వరా! సద్ధర్మకీర్తన కాలమందు కార్తీకమాసము స్మరించబడినది. ఆధర్మమును విన కోరినాను గాన త్వరగా చెప్పుము.

**అత్రిరువాచ। శ్లో॥ సాధుసాధుమహాపుణ్యా పరిప్రశ్నోయంపాపనాశనః ।**
**త్వయాసముదభూత్సాధు వాసుదేవకథాశ్రయం।**
**తదహం తేభిధాస్యామి శృణుత్వంకుంభసంభవః॥**

తా॥ (అత్రిముని చెప్పుచున్నాఁడు) ఓఅగస్త్యమునీంద్రా! బాగుబాగునీప్రశ్న పాపనాశనకరము నీవు హరికథా సందర్భమును జ్ఞాపకము చేసితివి చెప్పెదను వినుము.

**శ్లో॥ నకార్తీకసమోమాసో నశాస్త్రంనిగమాత్పరం।**
**నారోగ్యసమముత్సాహం నదేవఃకేశవాత్పరః॥**

తా॥ కార్తీకమాసముతో సమానమైన మాసములేదు, వేదముతో సమానమైన

శాస్త్రములేదు, ఆరోగ్యముతో సమానమైన యుల్లాసములేదు, హరితో సమానమైన దేవుఁడులేడు.

శ్లో॥ స్నానందీపదానంచ పూజనంచమధుద్విషః।
కార్తికవ్రతధర్మేణ నరఃప్రాప్నోతికాంక్షితమ్॥

తా॥ కార్తికమాసమందు స్నానము దీపదానము హరిపూజయు సలుపువాఁడు యిష్టార్థమును బొందును.

శ్లో॥ విష్ణుభక్తిర్వివేకార్థో యశఃకీర్తింఫలంఖలు।
ఆపుర్లక్ష్మీంచవిజ్ఞానం సర్వత్రవిజయప్రదమ్॥

తా॥ విష్ణు భక్తివలన కలియుగమందు వివేకమును, ధనమును, యశస్సును, ప్రతిష్ఠను, లక్ష్మిని, విజ్ఞానమును, సర్వత్రవిజయమును, పొందుదురు.

శ్లో॥ అత్రాప్యుదాహరంతీమ మితిహాసంపురాతనం।
పురాత్రేతాయుగేరాజా సూర్యవంశసముద్భవః।
అయోధ్యాధిపతిశ్శ్రీమాన్ పురంజయఇతిశ్రుతః॥

తా॥ ఈవిషయమును గురించి పూర్వచరిత్రమున్నది త్రేతాయుగమందు అయోధ్యాధిపతియు సూర్యసంభూతుఁడును అగు పురంజయుఁడను రాజు గలఁడు.

శ్లో॥ సశాసకియత్కాలం ధర్మసంచయసంశ్రయః। ఐశ్వర్యవానయంనష్టమతిర్దుష్టపరాక్రమః సర్వశాస్త్రభృతాంశ్రేష్ఠస్సత్యశౌచవివర్జితః। దేవబ్రాహ్మణభూహర్తా ద్వేష్యోవిప్రజనేషుచ। లోభీక్రూరమతిశ్చోర స్స్వర్ణస్తేయజనప్రియః॥

తా॥ ఆపురంజయుఁడు కొద్దికాలము ధర్మమార్గమందు ప్రవర్తించి తరువాత ఐశ్వర్యవంతుఁడై బుద్ధినశించి దుష్టపరాక్రమయుక్తుఁడై మహాశూరుఁడై సత్యమును శౌచమును విడిచి దేవబ్రాహ్మణభూములను అపహరించి బ్రాహ్మణులతో ద్వేషించిలోభియు హింసకుఁడును అయి బంగారమును దొంగిలించువారికి యిష్టుఁడైయుండెను.

శ్లో॥ ఏవమంతరితేకాలే చాధర్మనిరతేనృపే।తతస్సామంతరాజానః కాంభోజకురుజాదయః। మిళిత్వాబహవోభూపాః సర్వేతే హరివిక్రమాః। నాగాశ్వరథపత్తిభి శ్చతురంగబలాన్వితాః అయోధ్యానగరీంప్రాప్తాః పరితఃపత్తనాద్బహిః॥ శిబిరంపరితశ్చక్రే తుపంమాత్మికాఇవ॥

తా॥ రాజు ఈప్రకారముగా అధర్మపరాయణుఁడుకాఁగా ఆతని సామంతరాజులు

కాంభోజ కురురాజాదులు అనేకమంది సింహబలులుగూడి గుఱ్ఱములు, యేనుగులు, రధములు కాల్బంటులు, అను నాలుగు రకముల సేనలతోవచ్చి అయోధ్యాపట్టణము చుట్టును చెరకు పానకమును తేనెటీగలువలె చుట్టుకొనిరి.

శ్లో॥ పురంజయఃపురాత్తూర్ణం నిశ్చక్రామబలాన్వితః।
తురంగతుంగమాతంగ స్యందనైరభిసంవృతః॥

తా॥ పురంజయుడు విని శీఘ్రముగా చతురంగబలములతోను పట్టణము నుంచి బయిటకు వచ్చెను.

శ్లో॥ పురంజయోత్కరగుణం ధ్వజేనోత్తంభితంరథం। దివ్యందిగ్విజయంసూర్య దత్తంశస్త్రాస్త్రపూరితం।సురధాంగసమోపేతం స్యందసంవాజిపూజితం।సమారుహ్యాంపరంశీఘ్రం ధృతబాణశరాసనః। సమస్తబలసంయుక్తః సోశ్వోభరరధసద్బసైః ప్రవివేశ పురద్వారా దమిత్రశిబిరాంగణం। జగర్జఘనవద్వీర ప్రకృతచాపగుణస్స్వనః।భేరీతూర్యనినాదైశ్చ శంఖగోముఖకోటిభిః॥

తా॥ పురంజయుడు ధనుర్బాణయుతమును, ధ్వజయుతమును, స్వయంప్రకాశమానమును, అనేకదిగ్విజయములను చేసినదియు శస్త్రాస్త్రపూరితమును,మహాచక్రసంయుతమును, మంచిగుర్రములతో గూడినదియునైన, సూర్యదత్తరధమునుయెక్కి, ధనుర్బాణములను ధరించి సాది, నిషాది, రధి, పత్తి, రూప, చతురంగబలములతోను, పురద్వారమునుంచి శత్రుసైన్యములో ప్రవేశించి భేరీతూర్యనాదములను శంఖగోముఖనాదములను చాపటంకారధ్వనులను పక్కమారుగా ఉరుముల చప్పుడువలె ధ్వనిచేయించెను.

ఇతి శ్రీ స్కాందపురాణే కార్తికమహాత్మ్యే వింశోధ్యాయ సమాప్తః.

---

## అథ ఏకవింశాధ్యాయారంభః.

అత్రి॥ శ్లో॥ యోద్ధుంప్రత్యాగతంవీక్ష్య రాజనోరక్తలోచనాః। శస్త్రాస్త్రైశ్శరైశ్శార్ఙ్గచ్యుతైస్తీక్ష్ణైశ్చముద్గరైః। ముసుండుభిర్భిండివాలైః ఖడ్గైర్భల్లాతకైరపి।పట్టసైర్ముసలైశ్శూలైశ్చక్రైస్తోమరయుష్టిభిః। కుంభైః కుశాగ్రైర్గదైః క్షేపణై రాయుధాదిభిః। యుయుధుస్తేమునెనోన్యం రణజ్ఞాఖహాన్నృపాః॥

తా॥ ఇట్లు యుద్ధమునకు పురంజయునిచూచి యుద్ధప్రవీణులైన ఆరాజులు కోపరక్తాక్షులై శస్త్రములతోను, అస్త్రములతోను, బాణములతోను, వాడియైన గుదియలతోను, ఇనుపకట్లలాటీకర్రలతోను, హస్తాగ్రముఘనములైన గదియలతోను, కత్తులతోను, భల్లాతకములతోను, పట్టసములతోను, శక్తులతోను, శూలములతోను, తోమరములతోను, కుంభాయుధములతోను, గొడ్డళ్లతోను, కర్రలతోను, ఆయుధముల విక్షేపములతోను, యుద్ధముచేసిరి.

శ్లో॥ తురంగాతురగై స్తద్వ త్పాదినస్పాదిభి స్తథా। కరిణః కరిభి స్తద్వ ద్రథస్థాశ్చరథాధిపైః। శూరాశ్శూరై స్సాయుధైశ్చ ద్వంద్వయుద్ధం వితేనిరే। భటాస్సంభరయంత్యుగ్రా రమ న్యోన్యంచపరాక్రమైః॥

తా॥ గుఱ్ఱపు రౌతులతో గుఱ్ఱపురౌతులును యేనుఁగు రౌతులతో యేనుగు నెక్కువారును, రథికులతో రథికులును కాల్బంటులతో కాల్బంటులును, శూరులతో శూరులును, ఆయుధములతో యుద్ధముచేయుచు భటులన్యోన్యము క్రూరవాక్యములను పలుకుచుండిరి.

శ్లో॥ మునే కాంభోజరాజశ్చ స్యందనస్థోరువిక్రమః। బద్ధ్వాపరికరం గాఢం ధృత్వాస్వకవచందృఢం। కోలాహలధ్వనింకుర్వన్ ధృతబాణశరాసనః। బాణాన్విముంచన్నసదర్ రథేనైవాశుగామినా। రాజ్ఞఃపురంజయస్యాసా వభిసమ్ముఖమాగతః। ముమోచబాణత్రిశతం కాంభోజస్సపురంజయమ్॥

తా॥ ఓ అగస్త్యమునీంద్రా! అంతట కాంభోజ మహారాజు వస్త్రాదులను పదిల పఱచిగట్టి కవచమును ధరించి పరాక్రమించి మంచిరథ మెక్కి ధనుర్బాణములనుధరించి కోలాహలధ్వనిని చేయుచువడిగాపురంజయునివద్దకువచ్చిమూడువందలబాణముల వేసెను

శ్లో॥ గత్వాతేచ్ఛత్రదండంచ సమభిందన్ ధ్వజంరథం। తతస్తుకోప కాంభోజ శ్శరై ర్వ్యాధ్యత్పునః పంచభి స్తీక్ష్ణధారాభి రంగ ప్రత్యంతవేదిభిః। తతశ్చాపవినిర్ముక్తా వీకసేనభుజోజితః। పురంజయస్యందనస్య వాజినోంగలయంచ్ఛయుః॥

తా॥ ఆబాణములుపోయి పురంజయుని ఛత్రమును, ధ్వజమును, రథమును, నఱికి నవి, తరువాత కాంభోజుడు తిరిగి కొన్నిబాణములతో పురంజయుని కొట్టి అయిదు బాణములతో పురంజయుని రథముయొక్క తురగములను ఛేదించెను.

శ్లో॥ పురంజయశ్చకోపాశు మహేంద్రఇవభూపతిః। ఆస్ఫాలితభుజః కోపాత్ కృత్వాజ్యానినదంరుషా। బ్రహ్మ్యంచదశకంతీక్ష్ణం చాపేసంయోజ్యసజ్యచ। ముమోచవీరసేనస్య కాంభోజాధిపతేర్హృది॥

తా॥ తరువాత పురంజయుడు కోపించి ఇంద్రుడువలె విక్రమించి భుజాస్ఫాలనముచేసి నారిబిగించి బ్రహ్మమంత్రములతో పదిబాణములను ప్రయోగించి కాంభోజుని హృదయమందు కొట్టెను.

శ్లో॥ తత్రబాహుబలాధ్మాతాః బాణాఃపన్నగసన్నిభాః। కాంభోజరాజప్రత్యంగం భిత్వాతద్ధృదిశోణితం। పపుఃపశ్చాత్సయోధేషు నైనిర్గమనోత్సుకాః॥

తా॥ పురంజయుని బాహుబలముచేత వేయబడిన యాబాణములు సర్పములవలెపోయి కాంభోజరాజు హృదయమును భేదించి నెత్తురును త్రాగి తృప్తులైభటుల వద్దకు పోవుటకు యిచ్ఛయించతేదు.

శ్లో॥ వక్షస్సుకీలితాన్ బాణాన్ తస్యోద్బలాదుత్పాట్యపాణినా। తానేవచాపేసంయోజ్య బాణాన్ తంప్రత్యువాచహ॥

తా॥ అప్పుడు రొమ్ములో గుచ్చుకున్న బాణములను కాంభోజుడు హస్తముతో లాగి ఆబాణములనే ధనస్సుయందుగూర్చి పురంజయునితో నిట్లనియె.

శ్లో॥ త్వయోత్సృష్టంబాణపూగం తవదాస్యేనృపాత్మజ। సంగృహాణాశుగానాశు సపారక్యప్రియావయమ్॥

తా॥ క్షత్రియా వినుము నీచే వేయబడిన బాణములను తిరిగి నీకే యిచ్చెదను నేను పరులసొమ్ము యందాసక్తిగలవాడనుకాను.

శ్లో॥ ఇత్యుక్త్వావిససర్జాథ కాంభోజోథపురంజయం। ప్రత్యాగత్యశరాస్తస్య సూతంచఛత్రంధనుర్గుణం। చిచ్ఛిదుర్ధనుషోమధ్యం రథస్థమధిసంగరే॥

తా॥ ఇట్లు పలికి కాంభోజుడా బాణములను విడువగా నవి వచ్చి పురంజయుని సారధిని ఛత్రమును నారిని ధనస్సును త్రుంచినవి.

శ్లో॥ గృహీత్వాన్యధనుర్చాపో గాఢందృఢగుణంమునే। శరాశనె శరాన్యోజ్య కంకపత్రైరలంకృతాన్ । ఆకర్ణాంతంసమాకృష్య కాంభోజంతుమహారుషా। రాజశార్దూలోపిసంగ్రామె

ధీరోభవరణంపురు । బాణానందశకంయస్మా దస్మదీయంత్వ
యార్పితం। సవే త్తికుజనోలోకే అర్పణాస్యార్ప ణేవిధిం। అర్ప
యిష్యామి తేబాణ వింశతించార్పణాత్పు రా॥

తా॥ పురంజయుడు మఱియొక ధనస్సును గ్రహించి నారిగట్టి రెక్కలతో గూడిన బాణములను పుచ్చుకొని ధనుస్సునచేర్చి నారిని చెవు వరకులాగి కోపముతో కాంభోజునితో నిట్లనియె రాజా? కూరుడవౌదువుగాని యుద్ధమందు ధైర్యములో నుండుము నాచేత యివ్వబడిన బాణములనే తిరిగి నాకిచ్చినావు నీవంటి నీచులకు ప్రతి దానవిధి తెలుసునా, నేనిప్పుడు నీకు వేరుబాణములను యిరువదింటినియిచ్చుచున్నాను

శ్లో॥ ఇత్యుక్త్వావిససర్జాసౌ కాంభోజంసపురంజయః। చాపచ్యుతా
శ్శరా స్తస్య వలక్షోల్లంఘినోముసె । కాంభోజకవచం
కాయం భిత్వాదూరంవినిర్యయుః॥

తా॥ ఇట్లు పలికి పురంజయుడు బాణములను విడిచెను ఆబాణములు గురిగా కాంభోజుని కవచమును త్రుంచి వక్షస్థలమును భేదించి దూరము పోయినవి.

శ్లో॥ ఆయోధనంఘోరమాసీ త్తుములంరోమహర్ష ణం।బాణై శ్చా
పగుణోన్ముక్తైర్ఖడ్గైరుద్వేగకారిభిః।నికృ త్తభుజబాహ్వంఘ్రి
కంధరాః పేతురద్భుతాః॥

తా॥ అప్పుడు భయంకరమైన యుద్ధముజరిగెను సైనికులు అన్యోన్యశరాఘాతములచేత భుజములు తెగి బాహువులుఊడిపాదములు మొండెములై మెడలువిరిగిభూమియందుపడిరి.

శ్లో॥ హ స్తినోగతహస్తాశ్చ వాజినోగతపుచ్ఛకాః। పేతుర్గతా స్తత్ర
భిన్నగాత్రాశ్చైవరణాజిరే। రథాశ్చబాహవోభగ్నా స్సచ
క్రాస్సహావాజిభిఃశరై రశనిసంకాశై రన్యోన్యరథముపశ్చ్యుతైః॥

తా॥ అన్యోన్యశరాఘాతములచేత యేనుగుల తొండములూడినవి, గుఱ్ఱముల తోకలు తెగినవి, కాల్బంటులు హతులైరి,రథములుచక్రములతో సహాచూర్ణములాయెను.

శ్లో॥ కేచిచ్ఛిన్నశిరస్త్రాబహవో శూరాఃకృత్తోరుకంధరాః। ధృతచాపో
ధృతగుణో భటః పటుతరోరణే । శరనిర్భిన్నసర్వాంగః
ప్రాహాన్యంసుభటంయుధి॥

తా॥ కొందరు తొడలు తెగి నేలబడిరి కొందరు కంఠములు తెగికూలిరి, బాణ ములచేత శరీరమంతయు గాయములు పడిన యొక భటుడు ధనస్సును ధరించి నారి బిగించి అన్యభటునితో యిట్లనియె,

శ్లో॥ నివృత్తస్యనివృత్తస్య తిష్ఠతిష్ఠమమాగ్రతః । మామామాపృష్ఠ
పదంత్వంహి కురుసూరోసిభోదురితమ్॥

తా॥ మళ్లీమళ్లీ నాముందరయుందు యుండుము నీవీపును నాకు చూపకుము,
నీవు శూరుడవుగదా యిట్లుచేయవచ్చునా.

శ్లో॥ ఆకర్ణ్యయోధగదితం నిష్ఠురంప్రతిభటఃపటుః। ధృతచాపోధృత
గుణః కృతనారీఘనస్వనః।ముంచన్సింహధ్వనింరోషా చ్ఛర
సంధానకౌతుకః ముమోచభటమాలక్ష్యతథాప్రతిభటోమునే॥

తా॥ ఇట్టి నిష్ఠురమాటను విని ప్రతిభటుడు ధనుర్బాణములను ధరించి టంకార
ధ్వనిచేయుచు సింహగర్జనములను చేయుచు బహునేర్పుగా. బాణములను ప్రతిభటుని
మీద ప్రయోగించెను.

శ్లో॥ ఆదానేశరసంధానే చావర్తననివర్తనే । ఖస్థానాంసంశ
యోజాతః పాణిలాఘవచాపలమ్॥

తా॥ ఆకాశమందుండి చూచెడి దేవతలు బాణములు తూణీరమునుంచి తీయుటను
అనుసంధించి వేయుటను గుర్తించలేకరి బహుసేర్పుతో బాణములను వేయుచున్నారు.

శ్లో॥ నిరంతరంచబాణానాం వృష్టిరాసీద్రణాంగణే। ఏవమన్యోన్య
యోధానాం శూరాణాంచైవసర్వశః। స్వర్ణపుంఖాన్‌శరాన్
తీక్ష్ణాన్ శాణోల్లీఢాన్‌భటోభటం । నామాంకితాంకితాన్
ముంచన్ ఆలక్ష్యాన్యోన్యమంజసా। అర్ధచంద్రనిభైర్బాణై
రారాచైరప్యయోముఖైః । ఖడ్గైశ్చపట్టిసైఃకుంతై ర్వివ్య
ధుస్తేపరస్పరమ్॥

తా॥ ఆయుద్ధమందు సూది దూరసందు లేకుండా బాణవర్షము కురియుచున్నది
ఇట్లన్యోన్యము శూరులును, భటులును, బంగారపు కట్లతో గూడినవియు, స్వయముగా
వాడిరైనవియు, సానపెట్టబడినవియు, స్వనామచిహ్నితములు అయిన అర్ధచంద్ర
బాణములతోను యినుప నారసములతోను, యినుప అలుగులుగల బాణములతోను
ఖడ్గములతో పట్టసములతోను యీటెలతోను కొట్టుకొనిరి.

శ్లో॥ నిహతాఃసాదిభిఃకేచిత్ సాదినోగజరక్షకైః। పాదకారథికై
రుగ్రైః రథికాఃపాదచారిభిః । నికృత్తోరుభుజాదండ ఛిన్న
భిన్నాంగమస్తకాః॥

తా॥ గుర్రపురౌతులు కొందరిని చంపిరి గుర్రపురౌతులను యేనుగుబంట్లు చంపిరి

రథికులు కాల్బంట్లను చంపిరి కాల్బంట్లు రథికులను చంపిరి. యిట్టి యోధుల భుజములు శిరస్సులు అంగములు తెగి పడుచుండిరి.

శ్లో॥ అరుణాంబుజలస్రావా తత్రాభూద్రుధిరానదీ। మేఘచ్ఛన్నాంతరిక్షస్థా దేవనార్యోబ్రువాత్కృచాః। మామకోయంమామకోయం ఇతిజల్పంతివైమునే। శూరాశ్శూరేణనిహతా దివ్యాంబరవపుర్ధరాః। దేవానీతవిమానేన ప్రపద్యంతేసురాలయం॥

తా॥ అచ్చట నెత్తురుతో యొక నది ప్రవహించెను ఆకాశమందు మేఘాచ్ఛాదితులై అప్సరస్త్రీలు లావైనసమూహములతో వచ్చుచుండివచ్చి చూచి వీడునావాడు వీడు నావాడని పలుకుచుండగా శూరహతులైన శూరులు యుద్ధమందు మృతినొంది దివ్యాంబరధారులై విమానము లెక్కి దేవతలు సేవించుచుండగా స్వర్గమునకుపోయి దేవస్త్రీ సంభోగాది సుఖములను బొందిరి.

శ్లో॥ సూర్యమండలభేత్తారో రణేచాభిముఖేహతాః। స్త్రాయమానాప్సరోభిశ్చ సిద్ధగంధర్వసేవితాః। సురనారీసమేతాశ్చ ప్రయాస్యంతిసురాలయమ్॥

తా॥ యుద్ధమందు హతులైనవారు సూర్యమండలమును భేదించుకుని దేవస్త్రీలతో గూడుకొని గంధర్వాప్సరసలచేత కొనియాడబడుచు స్వర్గమునకు పోవుదురుగదా.

శ్లో॥ భూభుజైర్బహుభిశ్శూరైః। తద్భృత్యైరణకోవిదైః। కాంభోజప్రముఖైస్సర్వైః రణరంగాభిమానిభిః। బభూవతుములం యుద్ధం దుష్కరంరోమహర్షణమ్॥

తా॥ కాంభోజుడు మొదలైన రణకోవిదులైన శూరులతోను యితర రాజులతోను సుభటులతోను చాలాభయంకరమైన యుద్ధము జరిగినది.

శ్లో॥ పరాజితఃపరంతత్ర సానుగైఃసపురంజయః। ప్రవివేశపురంతూర్ణం దినాంతేస్తంగతేరవౌ॥

తా॥ ఇట్టి యుద్ధమందు పురంజయుడు వోడిపోయి సపరివారముగా సాయంకాలమందు పట్టణము ప్రవేశించెను.

శ్లో॥ రణభూమింపరిత్యజ్య ప్రాపుఃప్రాంతెనృపాలకాః। శిబిరప్రవరంచక్రుః వటమంటపరంజితమ్॥

తా॥ రాజులును యుద్ధభూమిని వదలి కొంచము దూరములో డేరాలు వేయించి వాటి యందుండిరి.

శ్లో॥ భూతప్రేతపిశాచైశ్చ భేతాళైర్గ్రబుకాదిభిః । కంకైః కఠోర వదనైః రణభూమిర్విరాజితే॥

తా॥ యుద్ధభూమి భూతప్రేత పిశాచభేతాళములతోను నక్కలతోను కంక గృధ్రాదులతోను ప్రకాశించుచుండెను.

శ్లో॥ త్రయోదశాక్షౌహిణీభి ర్యుక్తః కాంభోజవల్లభః । కూ్రరం యుద్ధరంగాగ్రే హతమక్షౌహిణీత్రయమ్॥

తా॥ కాంభోజరాజుకు పదమూడు అక్షౌహిణీల సేనయున్నది మూడు అక్షౌహిణీలసేన హతమైనది.

శ్లో॥ అచింతయదసౌరాజా రణభంగంపురంజయః। స్వస్యరాష్ట్రం సమాక్రాంత మమిత్రనరపాలకైః॥

తా॥ పురంజయుఁడు తాను యుద్ధమందోడుటకును తన రాజ్యము శత్రురాజుల చేత ఆక్రమింపబడుటకును చింతించుచుండెను.

శ్లో॥ ఏవంచింతయతస్తస్య ప్రమ్లానాస్యస్యభూపతేః । పురోహిత స్సుశీలాఖ్యః సర్వవిద్యావిశారదః । పురంజయమువాచేదం చింతాధిక్కృతలోచనమ్॥

తా॥ ఇట్లు చింతించుచు ముఖము వాడిపోయి చింతతో యేమియుతోచకున్న పురంజయునితో సమస్తవిద్యాపారంగతుఁడైన సుశీలుఁడను పురోహితుఁడిట్లు పలికెను.

శ్లో॥ జేతుంయదిచ్ఛసేరాజన్ అమిత్రనివహోవృతం। వీరసేనస్యసేనాంచ సేవాయాంలాలసోభవ॥

తా॥ ఓరాజా ! శత్రుబృందముతో సహా వీరసేనమహారాజును జయించకోరితివేని విష్ణుమూర్తిని సేవచేయుము.

శ్లో॥ ఇదానీంకార్తికేమాసి పౌర్ణమీపుణ్యసాధినీ । ఊర్జేపూర్ణ కలానాథ దినేచాగ్న్యర్క్షసంయుతే। హితంబ్రవీమినృపతే తస్మాదవ్యధికంతవ। తత్కాలసంభవైః పుష్పైః కేశవంకార్తి కేర్చయ। దీపప్రజ్వాలనంవిష్ణోర్ద్దీపదానంచ కేశ్వర। నర్తనం కురుకృష్ణేతి గోవిందేత్యాలయేహరేః॥

తా॥ యిప్పుడు కార్తిక పూర్ణిమయినది నిండుపూర్ణిమ కృత్తికానక్షత్రము గాఁబట్టి యిది అలభ్యయోగము యీకాలమందున్న పుష్పములతో హరినిపూజించుము.

విష్ణుసన్నిధిలో దీపములు పెట్టుము హరిముందర గోవిందా నారాయణ మొదలైన నామములను పాడుచు నాట్యమును చేయుము.

శ్లో॥ తవోపజాయతేనూను స్సత్యంశంకరభాషితం । రాజన్నేవం కృతేపుణ్యే కార్తీకే కేశవప్రియే । స్వభక్తరక్షణార్థాయ సర్వాపద్భ్యోజనార్దనః । సుదర్శనంసహస్రాంశుం సంప్రేష యతిసాదరం । ఊర్జేఊర్జితపుణ్యానా మూర్జితంకీర్తనుపణ్ణా యేత్। భూపాపజయమాసీత్తే అధర్మాచరణాత్తవ । అనువర్తస్వతద్ధర్మం బ్రాహ్మణోప్యసిచసర్వదా । విష్ణుభక్తోభవ నృప। కార్తికోక్తంవ్రతంచర। కార్తీకవ్రతశీలానా మాయు రారోగ్యసంపదః । పుత్రలాభఃకోశవృద్ధిః సర్వత్రవిజయో నిశం। సత్యంభవతిరాజేంద్ర తత్కుర్వావిలంబితమ్॥

తా॥ అట్లుచేసితివి వేని నీకు కుమారుడు జనించును యిదినిజము శంకరుడిట్లుచెప్పియున్నాడు, కార్తీకవ్రతమాచరించితివేని హరి తన భక్తులను ఆపత్తులు లేక రక్షించుటకు తన చేయియందుగలచక్రమును పంపును కార్తీకమాసమందు చేసిన పుణ్యమహిమను చెప్పుట కెవ్వనితరమౌను, నీకు అధర్మ వర్తనమువలన అపజయము గలిగినది యికముందు సద్ధర్మవరుడవుగమ్ము అట్లైన కొనియాడతగినవాడవగుదువు ఓరాజా కార్తిక వ్రతమాచరింపుము, హరిభక్తుడవుకమ్ము కార్తీకవ్రతమువలన ఆయువు ఆరోగ్యము సంపదలు, పుత్రులు, ధనవృద్ధి, జయముగలుగును, నామాటనమ్ముము త్వరగాజరుపుము

ఇతి శ్రీ స్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే ఏకవింశోధ్యాయ స్సమాప్తః.

---

అథ ద్వావింశాధ్యాయారంభః.

అత్రిరువాచ॥ శ్లో॥ సుశీలస్యవచశ్శ్రుత్వా రాజాహృష్టమనామునే । హరిదేవాలయంగత్వా కార్తీకేభ్యర్చ్యకేశవం। ఉపచారైష్షోడశభిః ప్రసూనఫలపల్లవైః। ప్రదక్షిణ నమస్కారైర్నటచర్యాదిభిఃక్రమాత్। అభ్యర్చ్య ప్రతిమాంలోహీం స్వామిరూపానుయాయినీం। ప్రదక్షిణన్నమస్కారైస్సహితఃకృతదర్శనః॥

తా॥ (అత్రిమహాముని తిరిగి చెప్పుచున్నాఁడు) ఇట్లు సుశీలునిమాట విని పురంజయుడు విష్ణ్వాలయమునకుపోయి పుష్పములతోను ఫలములతోనుచిగురుటాకులతోను దళములతోను షోడశోపచారపూజలతోను హరిని పూజించి ప్రదక్షిణ నమస్కారములను నాట్యమునుచేసి హరిమూర్తిని బంగారముతో చేయించి ప్రదక్షిణనమస్కారాదులచే పూజించెను.

శ్లో॥ ఏవంతంపూజ్యగోవింద మూర్జేపూర్ణకలాధరే। నిర్గతోనిశి రాజేంద్ర శ్వేతచ్ఛత్రమండలే। గోవిందభృత్యఃప్రత్యాగాత్ ప్రిస్ఫురత్సూర్యమండలే। గోవిందకృతధీస్సమ్యక్ యోద్ధుం విప్రపురంజయః॥

తా॥ పురంజయుడు కార్తీకపూర్ణిమనాడు రాత్రి హరిని పూజించి గోవిందభృత్యుడై హరినామస్మరణచేయుచు ప్రాతఃకాలమందు తిరిగి యుద్ధమునకుబయలుదేరెను.

శ్లో॥ ఆరూఢస్యందనోధన్వీ ఖడ్గతూణీధనుర్జయీ। కంఠలంబితసంలగ్న తులసీస్రగ్విశోభితః। ప్రస్ఫురద్బాహుయుగ్మేతు కంచుకాంకితమస్తకః। ప్రయాణమకరోదాశుపురంజయజయప్రదం॥

తా॥ ఇట్లు పురంజయుడు రథమెక్కి ధనుర్బాణములను కత్తిని తూణీరమును ధరించి కంఠమందు తులసీమాలను ధరించి కవచమును ధరించి తలగుడ్డపెట్టుకునిత్వరగా బయలుదేరి వచ్చెను.

శ్లో॥ బహిఃపురంజయఃపుర్యా నారీకేంకారమద్భుతం। ఆకర్ణ్య స్వబలంయాత మాలోక్యాభ్యాయయుర్నృపాః॥

తా॥ వచ్చి నారీటంకారధ్వనిని చేసెను ఆధ్వనివిని రాజులందరు యుద్ధమునకై తిరిగి వచ్చిరి.

శ్లో॥ ముంచంతోబాణవర్షాంచ గర్జంతస్సింహగర్జనం। పేతుః పురంజయబలే మత్తభావేనభూమిపమ్॥

తా॥ వచ్చి సింహధ్వనులుచేయుచు బాణవర్షములను కురియుచు పూర్వపుకలి జయంతమను తలంపుతో పురంజయుని పైకిధుమికిరి.

శ్లో॥ చక్రుర్యుద్ధంమహాఘోరం జఘ్నంతస్తేపరస్పరం। బాణైరళనిసంకాశైః ఖడ్గైర్వజ్రాయుధోపమైః। గజైరైరావతైర్వాజిభిర్వ్యగగనగామిభిః। స్యందనైరాశుగమనై రన్యోన్యజయకాంక్షిభిః।బభూవతుములంయుద్ధ మత్యంతంరోమహర్షణం

తా॥ పిమ్మట పరస్పరము పిడుగులవంటి బాణములతోను, వజ్రమువంటికత్తులతోను, ఐరావతమువంటి యేనుగులతోను, ఆకాశమునకు యెగురు గుఱ్ఱములతోను, త్వరగా నడిచెడి రథములతోను, అన్యోన్య జయకాంక్షతో భయంకరమైన సంకుల యుద్ధము జరిగెను.

శ్లో॥ కాంభోజప్రముఖాస్సర్వే రాజానోయుద్ధదుర్మదాః। గతవాహాఃగతగజాః గతబాణశరాసనాః। ప్రవిశీర్ణతనుత్రాణాఃవిద్ధదేహాంఘ్రిమస్తకాః। వినష్టరథపాదాతి గజాశ్వాయుధయూథపాః। పురంజయభటైస్సార్థం త్రాహిత్రాహీతివాదినః॥

తా॥ ఆయుద్ధమందు రాజులందఱు మదములుడిగి గుఱ్ఱములు హతములై యేనుగులు ధరణిగూలి బాణశరాసనములు జారిపడి కవచములు శీర్ణములై అంగములు ఖండితములై రథ, గజ, సాది, పదాదులు అదృశ్యులై పురంజయుని భటులను మనుష్యులను రక్షించుడు రక్షించుడు అని ప్రార్థించుచుండిరి.

శ్లో॥ కాంభోజస్యబలంభగ్నమాలోక్యాత్మపరాజయం । పురంజయజయప్రాప్తిం మత్వారాజానరాధిపః। స్వసహాయబలైశ్శేషైః పలాయనపరాయణః । రాజాస్వాత్మపురంప్రాప కాంభోజోభగ్నసంగరః॥

తా॥ కాంభోజరాజు తనసైన్యమంతయు హతమగుటచూచి పురంజయునకిప్పుడు జయమని తలంచి యుద్ధమును చాలించి మిగిలిన సేనలతో తనపురముచేరెను.

శ్లో॥ పురంజయోజయత్సర్వాం జయలక్ష్మీకటాక్షతః॥

తా॥ పురంజయుడు జయలక్ష్మీప్రసాదమువలన జయమొందెను.

శ్లో॥ హరిర్మిత్రంభవేచ్చైవ అధర్మోధర్మతాంవ్రజేత్ ।అనుకూలె జగన్నాథే విపరీతెవిపర్యయః॥

తా॥ హరి అనుకూలముగా ఉండినయెడల శత్రువుమిత్రమగును, అధర్మముధర్మమగును, ఆహరియే ప్రతికూలముగానుంటే మిత్రుడేశత్రువగును, ధర్మమెఅధర్మమగును.

శ్లో॥ కార్తీకోక్తంవ్రతంకుర్వన్ కేశవంక్లేశనాశనం । శరణ్యం శరణంగత్వా సర్వాపద్భ్యస్సుఖంవ్రజేత్॥

తా॥ కార్తీకవ్రతమును చేయుచు సమస్తక్లేశములను నశింపచేయువాడును సమస్త ప్రాణులకు రక్షకుడును అగు హరిని సేవించిన యెడల సమస్త దుఃఖములు తొలగిపోవును.

శ్లో॥ విష్ణుభక్తోమహాతేజా స్సత్యమత్యంతదుర్లభం। తతా౽పిదుర్ల భంమన్యే కార్తికోక్తవ్రతేమనః॥

తా॥ విష్ణుభక్తి సదురుటయే దుర్లభము అందును కార్తికవ్రతమందు యిచ్ఛ వుండుట మరీదుర్లభము.

శ్లో॥ కించగోవిందభక్తాయే కార్తికవ్రతనిష్ఠితాః। జ్ఞేయాస్తేవైష్ణవాశ్శుద్ధాః కలౌధర్మవిచక్షణైః॥

తా॥ కలియుగమందు హరిభక్తులై కార్తికవ్రత పరాయణులైనవారు శుద్ధ వైష్ణవులని తెలిసికొనవలెను.

శ్లో॥ కార్తికవ్రతవేత్తారో నారాయణపరాయణాః।అపిశూద్రాదయోవాపిజ్ఞేయాస్తేవైష్ణవోత్తమాః।అపిద్విజాతయోహ్యన్యే నచభక్తాఅధోక్షజేతఏవశూద్రతుల్యాశ్చవేదాఢ్యాఅపికుంభజ॥

తా॥ కార్తికవ్రతమును చేయుచు హరిభక్తిగలిగిన శూద్రులు వైష్ణవోత్తము లన బడుదురు, బ్రాహ్మణులై వేదములుచదివినను హరిభక్తిలేనివారు శూద్రసమానులగుదురు

శ్లో॥ వేదాభ్యాసీవిష్ణుభక్తః కార్తికవ్రతతత్పరః। సఏవవైష్ణవశ్రేష్ఠః తస్మిన్నివసతేహరిః॥

తా॥ వేదాభ్యాసముచేసి హరిభక్తిగలిగి కార్తికవ్రత పరాయణుడైనవాడు వైష్ణవోత్తముడు అట్టివానియందు హరి నివసించును.

శ్లో॥ సంసారందుస్తరంఘోరం తర్తుమిచ్ఛతియోనరః।
యోవాకోవాపిజాతీయః సవిష్ణోభక్తిమాశ్రయేత్।
సంసారాబ్ధేర్మనేన్యావం తారయిష్యతితత్క్షణాత్॥

తా॥ ఏజాతివాడుగాని దుస్తరసంసార తరణేచ్ఛగలిగినేని హరిభక్తి చేయ వలెను అట్లైనచో వాడిని విష్ణుమూర్తి అప్పుడె తరింపజేయును.

శ్లో॥ కింవర్ణయామివిప్రేంద్ర హరిభక్తిపరాక్రమః। పరాశరప్రభృతయో వసిష్ఠాద్యామహర్షయః। అంబరీషాదయోభూపాః తథైవసగరాదయః। భక్తిమేవహరేర్నిత్య మాశ్రిత్యాయుః పరాంగతిమ్॥

తా॥ అగస్త్యమునీంద్రా! హరిభక్తిపరాక్రమమునేమని వర్ణింతును పరాశరాదులు వసిష్ఠాదులు అంబరీషాదులు సగరాదులు హరిని ఆశ్రయించి తరించినారు.

శ్లో॥ తద్విష్ణోర్భక్తిమాన్విప్రః తద్భక్త్యానిత్యసువ్రతః। స్వతంత్రో
వ్యస్వతంత్రశ్చ విష్ణుపూజాపరోభవేత్ ॥

తా॥ హరిభక్తియందు నిత్యవ్రతముగలవాడై తాను స్వతంత్రుడైనను అన్య తంత్రుడైనను హరిపూజాసక్తుడు గావలయును.

శ్లో॥ భక్తప్రియోహరిర్నిత్యం యేభక్తాశ్చహరిప్రియాః। స్వభక్త
రక్షణంకుర్వన్ ఇహాముత్రసుఖప్రదః॥

తా॥ హరిభక్తప్రియుడు భక్తులు హరికి ప్రియులు హరి తనభక్తులకు ఐహికా ముష్మిక సుఖములను యిచ్చి కాపాడును.

శ్లో॥ ఆస్తేసర్వత్రభగవాన్ విష్ణుర్విశ్వామరేశ్వరః।తద్భక్తియోగ
యుక్తస్య వైష్ణవస్యమహాత్మనః। కార్తీకస్యవ్రతంమన్యే
సులభంమునిసత్తమ॥

తా॥ భగవంతుడును సమస్త చరాచరప్రభువును అగు హరి అంతయు నిండి యున్నాడు, అట్టి హరియందు భక్తిగలవానికి కార్తీకవ్రతము సులభమని తలచెదను.

శ్లో॥ నకార్తీకవ్రతంలోకే నవిష్ణుసదృశోవిభుః। నసూర్యసదృశ
స్తేజో నాశ్వత్థసదృశోద్రుమః॥

తా॥ కార్తీకవ్రతముతో సమానమైన వ్రతమును, హరితో సమానమైనప్రభు వును, సూర్యునితోసమానమైన తేజోవంతుడును,రావిచెట్టుతోసమానమైనచెట్టునులేవు.

శ్లో॥ తస్మాత్కార్తీకమాసస్య వ్రతమిష్టార్థదాయకం। సర్వోత్త
మోత్తమోవిప్ర మయాతేత్వనుకీర్తితం। సర్వగుహ్యతమం
శాస్త్రం సర్వవేదేషుసమ్మతమ్॥

తా॥ కాబట్టి కార్తీకవ్రతము యిష్టార్థములనిచ్చును, సర్వవ్రతోత్తమోత్త మము, యిది సర్వశాస్త్రసారము సర్వవేద సమ్మతము.

శ్లో॥ యఇదంశృణుయాన్నిత్య మధ్యాయంకార్తీకస్యచ। సముక్త
పాతకస్సద్యో దేహాంతేయాతిమాధవమ్॥

తా॥ కార్తీకమహాత్మ్య బోధకమైన యీఅధ్యాయమును నిత్యము వినువాడు విగతపాతకుడై అంతమందు హరిని చేరును.

శ్లో॥ యశ్శ్రాద్ధకాలేపఠతి కార్తీకవ్రతవైభవం। పితరస్తృప్తి
మాయాంతి హ్యాకల్పంమునిసత్తమ॥

తా॥ యీఅధ్యాయమును శ్రాద్ధకాలములందు పఠించినయెడల పితరులకు అ...
తమువలన తృప్తికలుగును.

ఇతి శ్రీ స్కాందపురాణే కార్తికమాహాత్మ్యే ద్వావింశోధ్యాయ
స్సమాప్తః.

---

## అథ త్రయోవింశాధ్యాయారంభః.

అగస్త్యఉవాచ॥ శ్లో॥ అత్రేపురంజయఃపశ్చా జ్జయశీలోమహామనాః॥
కిమాచరతిధర్మజ్ఞ తన్మేకథయసాంప్రతమ్॥

తా॥ (అగస్త్యముని అడుగుచున్నాఁడు) అత్రిమునీంద్రా! పురంజయుడు యుద్ధమందు జయమొందినతరువాత యేమిచేసెనో నాకు తెలియచెప్పుము.

అత్రిరువాచ॥ శ్లో॥ అయోధ్యానగరేరమ్యే తథావిగతకంటకే।తస్మిన్
పురంజయోరాజా సహస్రాక్షపరాక్రమః । సర్వశస్త్ర
భృతాంశ్రేష్ఠ స్సత్యవాదీసదాశుచిః । దాతాభోక్తా
ప్రియంవక్తా రూపవానమితద్యుతిః। సర్వేషామేవయజ్ఞా
నాం యష్టాసౌబ్రాహ్మణప్రియః। ధనుర్వేదేచవేదేచ
శాస్త్రేచనిపుణఃకృతీ।నారీరత్నప్రియోనిత్యం పౌర్ణమా
సీందువజ్జనైః। మార్తాండఇవదుష్ప్రేక్ష్య శ్శత్రుమం
డలశిక్షకః। వైష్ణవస్సత్వసంపన్నః జితషడ్వర్గకోనృపః।
కార్తికవ్రతధర్మేణ నిర్దగ్ధీకృతకల్మషః॥

తా॥ (అత్రిమునీశ్వరుఁడు చెప్పుచున్నాఁడు) శత్రుబాధా రహితమైనఅయోధ్యా పట్టణమందు పురంజయ మహారాజు సమస్త ధనుర్ధారిశ్రేష్ఠుఁడై ఇంద్రతుల్యపరాక్రమ వంతుడై సత్యవాదియు సదాశుచియు దాతయు, భోక్తయు, ప్రియవాదియు, రూపవంతుడును, అమితకాంతియుతుడును, సమస్తయజ్ఞకర్తయును, బ్రాహ్మణప్రియుడును, ధనుర్వేదమందు, వేదములందు శాస్త్రములందు, ప్రవీణుడును, పూర్ణిమచంద్రుడు జనులకువలె స్త్రీప్రియుడును, సూర్యుడువలె చూడశక్యముగానివాడును, శత్రువులను శిక్షించువాడును, హరిభక్తిపరాయణుడును, బలయుతుడును, కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములను జయించినవాడును, కార్తికవ్రతముచేత పాతకము లన్నియు నశింపచేసికొనినవాడును, అయియుండెను.

శ్లో॥ తస్యబుద్ధిస్సముత్పన్నా విష్ణోరారాధనే నృప । కథమారాధయిష్యామి దేవదేవంజనార్దనం । కస్మిన్దేశే తథామాసి కస్మిన్ క్షేత్రేసుఖప్రదే। చింతాసంయుక్తమనసం నృపమాహాశరీరవాక్॥

తా॥ ఇట్లున్న పురంజయునకు విష్ణుసేవయందు బుద్ధిజనించి హరిని యెట్లారాధింతును యేదేశమం దేమాసమం దేక్షేత్రమందు సుఖముగా నారాధింతును ఇట్లనిచింతించుచున్న రాజాతో ఆకాశవాణి యిట్లనియె.

శ్లో॥ కావేరీంగచ్ఛభో భద్ర కార్తిక్యాంకమలాపతిం । శ్రీరంగాఖ్యంపరంధామ వైకుంఠంరంగమందిరం । తమారాధయగోవిందం భక్తకాంతంభవచ్ఛిదం।ఇత్యుక్త్వావిరరామాథ శ్రుత్వా తద్గిరమాదరాత్॥

తా॥ ఓ పురంజయా ! శీఘ్రముగా కావేరికి పొమ్ము. అచ్చట శ్రీరంగమను దివ్యక్షేత్రమున్నది, అచ్చట శ్రీరంగనాథుడు వసించియున్నాడు, కాబట్టి సంసారచ్ఛేదమును చేయువాడగు శ్రీరంగనిలయుని సేవించుమనిచెప్పి యూరకుండెను.

శ్లో॥ హిత్వాయోధ్యాంయయౌరాజా కావేరీ మధ్యవర్తినం । నాగాశ్వరథపత్తిభిస్స్వాత్మనోనుగమైస్సహ । క్షేత్రాణ్యాలోకయన్యాతి తీర్థాన్యాయతనానిచ॥

తా॥ ఆమాటవిని రాజు అయోధ్యా పట్టణమును విడిచి తన చతురంగబలములతోను అనేక క్షేత్రములను తీర్థములను చూచుచు కావేరీమధ్యమున్న శ్రీరంగముచేరెను.

శ్లో॥ కావేరీమధ్యనిలయం భుజగాభోగశాయినం । ఊర్జేమాసిసపర్యాంచ విధివద్విశ్వమంగళం మాసమేకంవ్రతంచక్రే చక్రాపాంగభుజద్వయమ్॥

తా॥ చేరి కార్తీకమాసమంతయు నచ్చటవుండి శేషశాయియైన శ్రీరంగస్వామిని పూజించుచు కార్తీకవ్రతమును చేసెను.

శ్లో॥ గాయన్కృష్ణేతికృష్ణేతి గోవిందేతినిరంతరం। వాసుదేవేత్యనంతేతి ప్రబ్రువన్వైష్ణవాగ్రణీః।స్నానందానంజపోహోమః దేవతాప్రీణనంతతః । భక్త్యాచారాధ్యవిధివత్ ప్రసన్నం నాగశాయినం। మాసాంతేమునిశార్దూల వ్రతపూర్తింవిధాయచ। తతోన్యవర్తయద్రాజా స్వాంపురీంవైష్ణవోత్తమః॥

తా॥ కృష్ణకృష్ణాయని గానముచేయుచు గోవిందా, వాసుదేవా అని నిరంతరము కీర్తించుచును విష్ణుపూజాపరాయణుండై స్నానదానజపహోమములు దేవాభిషేకములు చేయుచు నాగశాయిని విధియుక్తముగా ఆరాధించి మాసమిట్లు వ్రతముసల్పి మాసాంతమందు ఉద్యాపనచేసి తన పట్టణమును గురించి బయలుదేరెను.

శ్లో॥ ఆలోకయన్ యయౌ సమ్యక్ స్వరాష్ట్రంచ సమృద్ధిమత్ ।
అయోధ్యానామనగరీ సర్వరాష్ట్రైరలంకృతా। హృష్టపుష్ట
జనాకీర్ణా దృఢప్రాకారతోరణా। దృఢయంత్రార్గళద్వారా
పరిఖాభిరలంకృతా । హస్త్యశ్వరథసంపూర్ణా రథబృంద
సమాకులా । గృహగోపురసంస్థాభి ర్వీథీభిస్సమలంకృతా ।
నానావర్ణ పతాకైశ్చ చలద్భిర్మందవాయునా। నానాయోధ
జనాకీర్ణా నానాజనపదైర్యుతా॥

తా॥ మధ్యనున్న దేశములనుజూచుచు సమృద్ధమైన తనదేశముకుపోయి అందున్న అయోధ్యాపట్టణమును జూచెను. ఆ అయోధ్య యెట్లున్నదంటె అనేకరాష్ట్రములకు అలంకారభూతమైనట్టిది సంతోషముతోను, పుష్టితోనుగూడిన జనులుగలిగినదియు, దృఢముగానున్న ప్రాకారములు తోరణములు గలిగినదియు దృఢముగానున్న యంత్రములు గడియలు గలిగినదియు అగడ్తలు గలిగినదియు గుఱ్ఱములతోను, యేనుగులతోను రథములతోను నిండియున్నది, గృహగోపురములవెంట వీధులు గలిగినదియు, అనేక వర్ణములుగల పతాకములుగలదియు, వాయువుచేత చలింపజేయబడుచున్న పతాకములు గలదియు అనేక భటసంయుతయు అనేక దేశవాసులతో గూడినదియు.

శ్లో॥ జ్ఞాతారస్సర్వశాస్త్రాణాం భేత్తారశ్శత్రువాహినీం।
దాతారస్సర్వరత్నానాం భోక్తారస్సర్వసంపదా॥

తా॥ అచ్చట బ్రాహ్మణులు సర్వశాస్త్రవేత్తలు, క్షత్రియులు శత్రుసైన్యభేదకులు, వైశ్యులు సర్వరత్నదాతలు, శూద్రులు సర్వసంపదలను అనుభవించువారు

శ్లో॥ స్త్రియస్తత్రమునిశ్రేష్ఠ దృశ్యంతేసుమనోహరాః। హంసవారణగామిన్యః కర్ణాంతాయతలోచనాః। పృథుశ్రోణ్యః కృశోదర్యః పీనోన్నతపయోధరాః। సువస్త్రాభరణోపేతాః సర్వాలంకారభూషితాః॥

తా॥ అచ్చట స్త్రీలు సుందరులు హంసలవలెను, యేనుగులవలెను, నడుచువారును, చెవులవరకునుండు విశాలనేత్రములుగలవారు, గొప్పపిరుదులుగలవారు, సన్నని

నడుములుగలవారు, బలిసి లావుగానున్న స్తనములుగలవారును, మంచి వస్త్రములుగల వారును, సమస్తభూషణ భూషితులును.

శ్లో॥ వారముఖ్యాశ్చదృశ్యంతే గీతినృత్యవిశారదాః। రూపలావణ్య సంయుక్తాః సర్వాః ప్రముదితాస్సదా । క్రీడంత్యశ్చమదోన్మత్తాశ్చత్వరేషుసభాసుచ । ప్రేక్షణాలాపకుశలాః సర్వాభూషితగాత్రికాః॥

తా॥ అచ్చటి వేశ్యలు సంగీతమందు నృత్యమందు నిపుణులును, సౌందర్యముతోను లావణ్యముతోను గూడియున్నవారును, నిత్యమానందయుక్తలు, మదోన్మత్తులును సమస్త స్త్రీగుణభూషితలై చూచుటలోను మాట్లాడుటలోను, బహునేర్పరులై సభలలోను, రాజమార్గములలోను, రచ్చలలోను, ఆటలాడుచుండువారు.

శ్లో॥ అన్యాశ్చతత్రదృశ్యంతే గుణాఢ్యాశ్చకులస్త్రియః।
సర్వాభరణసంపన్నాః పాతివ్రత్యపరాయణాః॥

తా॥ అచ్చటి కులస్త్రీలు గుణవంతులై సర్వాభరణభూషితలై పాతివ్రత్య పరాయణలై యుండిరి.

శ్లో॥ స్వస్వధర్మరతాస్సర్వే తత్తద్వర్ణాశ్రితాజనాః।
పురంప్రతీక్ష్యతద్రాజా ముమోదమునిపుంగవ॥

తా॥ ఓ అగస్త్యమునీంద్రా! అచ్చటి మనుజులందరు తమతమ వర్ణాశ్రమ ధర్మములందు స్థిరముగా నున్నారు. పురంజయుడిట్లున్న పట్టణమునుజూచి సంతోషించెను. "యథారాజా తథాప్రజాః" అని న్యాయమునుబట్టి రాజు న్యాయవర్తి ఆయి నంతలో ప్రజలు న్యాయముగ నుండె యున్నారు.

శ్లో॥ ప్రత్యాగతంనృపంపౌరాః ప్రత్యుద్యయురనేకశః।
లాజైరవాకిరన్సర్వే ర్పుష్పవతింకుసుమాదిభిః॥

తా॥ పౌరులందరు రాజు వచ్చుటవిని వేలవేలుగూడి యెదుర్కొనిరి. రాజు మీద పేలాలు పుష్పములు చల్లిరి.

శ్లో॥ ప్రవిశ్యపట్టణంరాజా స్వాంతఃపురముపాగమత్।
పశశాసమహారాజః సుధర్మేణవసుంధరామ్॥

తా॥ రాజు పట్టణము ప్రవేశించి తన యింటియందు సుఖానప్రవేశించి అది మొదలు ధర్మయుక్తముగా భూమిని పాలించెను.

శ్లో॥ పుత్రపౌత్రసమాయుక్త స్సర్వభాగ్యసమృద్ధిమాన్ । పురంజయాఖ్యః పుత్రేచ రాజ్యభారంనివేశ్యచ । కాంతారవాస

మకరోత్ కాంతాభిస్సపురంజయః । వైష్ణవంయోగమా సాద్య కార్తీకవ్రతనైష్ఠికః । తత్రైవమునిశార్దూల విష్ణులోకమవాప్తవాన్॥

తా॥ తరువాత కుమారులు, మనవలు గలవాడై అనేక భోగముల ననుభవించి చివరకు కుమారునికి రాజ్యభారమును వప్పగించి తన భార్యతోకూడా వనమునకుపోయి వానప్రస్థాశ్రమ మవలంబించి కార్తీకవ్రతమును విడువక చేయుచు హరిభక్తిస్థిరముగా చేసి దానిచేత వైకుంఠలోకివాసియై సుఖముగానుండెను.

శ్లో॥ అగస్త్యకార్తీకః పుణ్యః సర్వేష్టార్థప్రదాయకః । కార్తిక ధర్మాన్సులభాః కేశవస్యప్రియావహాః । అవశేనాపియః కృత్వా సయాతిపరమాంగతిమ్॥

తా॥ అగస్త్యమునీంద్రా ? కార్తీకవ్రతము నిండా మహిమగలది యీ కార్తీక ధర్మము హరికి ప్రియంకరము యెట్లన్నా, వీలుచేసుకొని కార్తీకవ్రతమును చేయువాడు పరమపదము బొందును.

శ్లో॥ సర్వసౌఖ్యప్రదంపుణ్యం మవశ్యంకలినాశనం।
కార్తీకస్యవ్రతమిద మకృత్వాయాత్యశోభనమ్॥

తా॥ సమస్త సౌఖ్యములను యిచ్చునదియు కలికల్మష నాశకారియునైన కార్తీకవ్రతమును చేయని మనుష్యుడు దుఃఖమును బొందును.

శ్లో॥ యశ్శృణోతీదమధ్యాయం విష్ణుభక్త్యశ్శుచివ్రతః।
నిర్ధూయపాతకంసర్వం సయాతిపరమాంగతిమ్॥

తా॥ హరిభక్తియుక్తుడై శుచితో యీ అధ్యాయమును వినువాడు సమస్త పాతకములను నశింపచేసికొని పునరావృత్తిరహితమైన మోక్షమును బొందును.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే త్రయోవింశోఽధ్యాయ స్సమాప్తః.

---

అథ చతుర్వింశోధ్యాయారంభః,

అత్రిః॥ శ్లో॥ కార్తీకస్యవ్రతమిదం శ్రోతుకామాయతేమయా కథ యామికథాంపుణ్యాం వైష్ణవీంచసుఖప్రదాం । శృణు

త్వంసావధానేన శ్రవణాదఘనాశనం। యస్యాస్త్యాసక్తి
ధీర్విప్ర కార్తికస్యహరేర్వ్రతే॥

తా॥ (అత్రిమునీశ్వరుఁడు తిరిగి చెప్పుచున్నాఁడు) అగస్త్యమునీంద్రా నీకు కార్తికవ్రతమందును, హరిభక్తియందును, ఆసక్తియున్నది. గాన కార్తిక మహాత్మ్యము యింకా చెప్పెదనువినుము సావధానముగా విన్నయెడల పాపములునశించు.

శ్లో॥ ఊర్జగస్నానఫలదా ద్వాదశీహరిబోధినీ।
యత్ఫలంసర్వతీర్థేభ్యః తత్ఫలంద్వాదశీతథా॥

తా॥ కార్తికమాసమందు శుక్లద్వాదశి హరిబోధిని యీ ద్వాదశి సమస్త తీర్థ స్నానఫలమిచ్చును.

శ్లో॥యత్ఫలంసర్వయజ్ఞేభ్యస్తదసౌ హరిబోధినీ।భక్తిర్భవతిగోవిందే
ఏకాదశ్యాంతథైవచ।తస్మాదాధిక్యఫలదాద్వాదశీవిష్ణువల్లభా॥

తా॥ సమస్త యజ్ఞములను చేసిన ఫలమును బోధిని యిచ్చును, యిదిగాక యీ ద్వాదశి హరియందును యేకాదశియందును భక్తినియిచ్చును కాఁబట్టి ద్వాదశి హరికి ప్రియమైనది.

శ్లో॥ సూర్యేందుగ్రహణాధిక్యా ఏకాదశ్యాశ్శతాధికా । సమస్త
పుణ్యఫలదా ద్వాదశీవిష్ణువల్లభా । ద్వాదశ్యాంయత్కృతం
పుణ్యం తత్కోటిగుణితంభవేత్ ॥

తా॥ ద్వాదశి సూర్యచంద్రగ్రహణములకంటె అధికము, యేకాదశికంటె నూరెట్లు యెక్కువది సమస్తపుణ్యమును యిచ్చునది ద్వాదశినాడుచేసిన పుణ్యము కోటిరెట్లగును.

శ్లో॥ యదిస్వల్పాభవేత్పుణ్యా ద్వాదశీపారణోచితా।
త్యాగానర్హావిద్యమానా సర్వేషామపి దేహినాం॥

తా॥ ద్వాదశి పుణ్యదినముగనుక కొంచముగా వున్నను పారణ కుపయోగించవలెనుగాని ద్వాదశిని విడిచి పారణచేయగూడదు.

శ్లో॥ వ్రతాన్యన్యానిసంత్యజ్య ద్వాదశీలేశమవ్యధి।
ద్వాదశ్యాంపారణంకార్యం నత్యజేత్పుణ్యకాంక్షిభిః॥

తా॥ ఇతర నియమములను అన్నిటిని విడిచి ద్వాదశి స్వల్పకాలమందు పారణ చేయవలెను, కాని పుణ్యముకోరువారు ద్వాదశిని విడువఁగూడదు.

శ్లో॥ ఏకాదశ్యాముపోష్యాథ ద్వాదశ్యాంపారణాంభవేత్।
ద్వాదశ్యాంవిద్యమానాయాం పారణాహానిసర్వదా॥

తా॥ ఏకాదశియందుపవాసమాచరించి మరునాడు ద్వాదశికాలము అతిక్రమించక పారణ చేయవలెను.

శ్లో॥ ఇదంజానన్పురావిప్ర అంబరీషాభిధోనృపః।
మహాభాగవతోనైవ ద్వాదశీంపారణేజహౌ॥

తా॥ యీ విషయమును తెలిసియే పూర్వమందు పరమభాగవతుడైన అంబరీష మహారాజు పారణకు ద్వాదశిని విడువలేదు.

శ్లో॥ ఉపోష్యైకాదశీంపుణ్యా మంబరీషోనృపోత్తమః।
విజ్ఞాయద్వాదశీమల్పాం పారణాంకర్తుముద్యతః॥

తా॥ అంబరీష మహారాజు ఒకప్పుడు ఏకాదశిరోజున యుపవాసముచేసి మరునాడు ద్వాదశి స్వల్పముగా వుండుటను తెలిసికొని అలోగానే పారణచేయుటకు యత్నించెను.

శ్లో॥ తంయయాచేమునిర్విప్ర దూర్వాసోమునిసత్తమః।
ఆతిథ్యవ్యపదేశేన పారణాహారిపుణ్యదా॥

తా॥ అంతలో దూర్వాస మహాముని వచ్చి ఆతిథ్యమిష చేత భోజనమును యాచించెను.

శ్లో॥ నృపేణోక్తస్తథాహేతి, అంగీకృత్యచపారణం।
ద్వాదశీపారణార్థంతు కార్తికేమునిసత్తమ॥

తా॥ అంబరీషుడు సరేనని ద్వాదశీపారణకు దూర్వాసుని రమ్మనెను.

శ్లో॥ అనుష్ఠానాయగతవాన్ అంగీకృత్యచపారణం।
తస్మిన్దినేథవేత్స్వల్పా ద్వాదశీపారణోచితా॥

తా॥ దూర్వాసుఁడు పారణకు ఆజ్ఞపుచ్చుకొని అనుష్ఠానముకొరకు వెళ్లెను. ఆనాడు ద్వాదశి అతిస్వల్పముగా నుండెను.

శ్లో॥ అంబరీషస్తురాజర్షిస్సంకటేసముపస్థితే।
ఇత్థంవిచారయామాస హరిభక్తోతిచింతితః॥

తా॥ దూర్వాసుఁడు రాకపోయెను. ద్వాదశి పోవుచున్నది. యిట్టిసంకటము సంభవించినది. అప్పుడు హరిభక్తుడైన అంబరీషుడిట్లు విచారపడసాగెను.

శ్లో॥ బ్రాహ్మణఃతాపసశ్రేష్ఠః పారణార్థంనిమంత్రితః। మయానా
గాగతస్సోపి ద్వాదశీచాతివర్తతే। ద్వాదశ్యతిక్రమాద్ధర్మ

స్సత్యంసత్యంకథంభవేత్। బ్రాహ్మణాద్భోజనంపూర్వ మథ రోమ్మగృహమేధినః॥

తా॥ బ్రాహ్మణుఁడు అందులో మునీశ్వరుఁడు భోజనమున కంగీకరించబడి యున్నాఁడు కాని యిప్పటికి రాలేదు ద్వాదశి పోవుచున్నది ద్వాదశోల్లంఘనము దోషము గృహస్థునకు బ్రాహ్మణునికన్న ముందు భోజనముకూడదు.

శ్లో॥ బ్రాహ్మణోవహ్నిసదృశః కుపితఃపూర్వభోజనాత్।
శాపందద్యాన్మమతథా శుభంకింస్విభవిష్యతి॥

తా॥ బ్రాహ్మణునికంటె ముందు భుజించిన యెడల కోపించి అగ్నితో సమానుఁడై శాపమిచ్చును గనుక యేమేల్మిగా యిప్పుడు కుశలము గలుగును.

శ్లో॥ అనతిక్రమణీయస్స్యాద్వ్యర్థైవహరివాసరః।
ఉపోషణేద్వాదశీచ పారణేతద్వదీరితా॥

తా॥ ఉపవాసమందెట్లు యేకాదశి విడువరాదో అట్లె పారణయందు ద్వాదశి విడువరాదు.

శ్లో॥ హరిభక్తిపరిత్యాగో ద్వాదశీత్యాగతోభవేత్। యతోనుపోషితోభూయా త్కృత్వాసమ్యగుపోషణం। పూర్వం ద్వాదశసంఖ్యాకే పురుషోహరివాసరే। పాపముల్లంఘనె పాపాత్ నైవత్యాజ్యంమనీషిణా॥

తా॥ ద్వాదశిని విడిచినయెడల హరిభక్తిని విడిచినవాడనగుదును, యేకాదశినాఁడుపవాసము చేయక యేదోషమునకు పాత్రుఁడనగుదునో ద్వాదశిని విడిచినయెడల అట్టి దోషమే సంభవించును యిదిగాక ద్వాదశీపారణాతిక్రమణము పన్నెండు యుపవాసముల ఫలమును పోగొట్టును.

శ్లో॥ హరేర్దినస్యపుణ్యత్వా న్నైవత్యాజ్యంమనీషిణా।
సచాప్యుల్లంఘితోయస్స్యాత్ పుంసఃసుకృతసంచయః॥

తా॥ హరివాసరము పుణ్యదినము కాన విడువరాదు. దానిని విడిచినేని పురుషునకు పుణ్యసంచయము చేకూరదు.

శ్లో॥ భూరిజన్మాంతరకృతం దివసేనమధుద్విషః॥ హరేర్దినపరిత్యాగాత్ ప్రతీకారవివర్జితః। పుంసఃప్రణాశ్యతేపాప మేకస్యాపి బహూన్యకిం॥

తా॥ అనేకజన్మములందుచేసిన పుణ్యము హరివాసరమును విడిచినయడల నశిం చును హరివాసరమును విడిచినయడల గలిగెడి పాతకమును నివృత్తిలేదు అనేక మాట లతో పనియేమున్నది యిద్ది నిజము.

శ్లో॥ హరిభక్తిఃపరిత్యక్తా త్యజ్యతాంహరివాసరం । పుంసాంమమ తతోభీతి ర్మహతీవిద్యతేయది। హరిభక్తిపరిత్యాగా ద్విహితాపారణావది॥

తా॥ హరివాసరమును విడిచినయడల హరిభక్తియుండదు హరిభక్తిని విడుచుట యందు నాకు మహాభయమున్నది కాబట్టి యిట్టి సంకటమందు హరిభక్తిని విడుచుట కంటె పారణమే ముఖ్యము.

శ్లో॥ విప్రశాపాన్న మేభీతిః కల్పదుఃఖప్రదాఅపి। ద్వాదశ్యాస్తుపరిత్యాగేత్యక్తాస్స్యుహరివాసరాః।త్యక్తాతతోంతతోభక్తిర్హరేర్న్యూనాభవిష్యతి।హరిభక్తిపరిత్యాగాద్విప్రశాపోవరోమమ॥

తా॥ బ్రాహ్మణ శాపమువలన నాకేమియు భయములేదు శాపమువల్ల కల్పాంతము దుఃఖము రానిమ్ము ద్వాదశిని విడిచితినేని హరివాసరము (ఏకాదశులు) విడువబడినవి అగును హరివాసరమును విడిచినయడల హరిభక్తిలోపించును గనుక హరిభక్తిని విడుచుడకంటె బ్రాహ్మణశాపమే కొంచెము మంచిది.

శ్లో॥ అపితత్త్యాగరూపేణ మయాత్యక్తాభవేత్సనః । తథాకృతే మయానూనం హరిస్త్రాతాభవిష్యతి॥

తా॥ కాబట్టి హరిభక్తికి లోపము తెచ్చుటకంటె బ్రాహ్మణునికంటె ముందు భోజనముచేసి ద్వాదశిని పోనివ్వక తద్వారా హరివాసరమును పోనివ్వక తద్వారా హరిభక్తిని నిలుపుకొనుటమంచిది అట్లైనయడల హరియేఆపత్తులు రాకుండా కాపాడును

శ్లో॥ అంబరీషోవిచింత్యైవం మనసైవమహాత్మనా।
బ్రాహ్మణాన్వేదపురుషాన్ పప్రచ్ఛేదంనృపోత్తమః॥

తా॥ అంబరీషుడు యిట్లు మంచి మనస్సుతో నిశ్చయించుకొని వేదవేత్తలైన బ్రాహ్మణులను యిట్లని అడిగెను.

శ్లో॥ దుర్వాసానాగతోద్యాపిబ్రాహ్మణోయోనిమంత్రితః।కింకరోమిద్విజశ్రేష్ఠా ద్వాదశీచాతివర్తతే । బ్రాహ్మణోద్భోజనం పూర్వం ద్వాదశ్యామప్యతిక్రమఃఉభయోఃకిన్ను మేశ్రేయః

తద్వాదంతుద్విజో_త్తమాః । ధర్మజ్ఞాశ్చింతయామాసుః గౌర
వం లాఘవంతథా॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తములారా! వినుఁడు దూర్వాసుఁడు భోజనమునకు వచ్చెదననెను. నేనఙ్గీకరించితిని యిప్పటికిని రాలేదు ద్వాదశిపోవుచున్నది గనుక బ్రాహ్మణునికంటె పూర్వము భోజనముచేసినందున బ్రాహ్మణాతిక్రమణము ద్వాదశిలో పారణచేయకపోతే ద్వాదశ్యతిక్రమణమును గలుగును గనుక మీరు బలాబలములను విచారించి రెండింటిలోను యేదియుక్తమో చెప్పుడి.

శ్లో॥ ధర్మజ్ఞాశ్చింతయామాసు ర్గౌరవంలాఘవంతథా।
ద్వాదశ్యాశ్చతథాభోక్తు రతిథేర్బ్రాహ్మణస్యచ॥

తా॥ ఆమాటవిని ఆబ్రాహ్మణులుధర్మబుద్ధిలో ద్వాదశియొక్కయు అతిథిగా వచ్చిన బ్రాహ్మణునియొక్కయు గౌరవలాఘవములను విచారించి యిట్లనిరి.

బ్రాహ్మణాఊచుః॥ శ్లో॥ అగ్నిస్సర్వేషుభూతేషు గూఢోయంపరమే
శ్వరః। భుంక్తేచతుర్విధంసర్వ మన్నంస్వాదుక్షుధాతురః॥

తా॥ (బ్రాహ్మణులు పలుకుచున్నారు) సమస్తభూతలమందును అగ్నిరూపుడైన ఈశ్వరుడుండిభక్ష్యభోజ్యచోష్యలేహ్యరూపమైనఅన్నమునుభక్షించుచున్నాడు

శ్లో॥ ప్రాణవాయుప్రసాదేవ జఠరేప్రకటీకృతే। పవహ్నాసంజాయ
తేజంతోః। క్షుధాఅన్నాభికాంక్షితా। ప్రాణప్రణున్నోభగ
వాన్ జాఠరోత్రవిభావసుః।సంతాపంయత్కరోత్యేషా క్షుత్పి
పాసేతికీర్తితా।పానేనసహితస్తస్మాత్ వహ్నిస్సర్వమరా
ర్చితః। సర్వభూతస్థితోయస్మా త్తస్మాత్తంనిత్యమర్చయేత్॥

తా॥ ప్రాణవాయువువలన జఠరాగ్ని ప్రజ్వలితమగుచుండగా జంతువులు అన్నముకోరెడి ఆకలి కలుగుచుండును ప్రాణవాయువుచేత కొట్టబడిన జఠరాగ్ని సంతాపమును చేయుటరే క్షుత్పిపాసలనబడును కాఁబట్టి పానసహితముగా అగ్ని సర్వసుర పూజితుడగుచున్నాడు కాఁబట్టి సర్వభూతములందున్న అగ్నిని నిత్యముపూజింపవలెను

శ్లో॥ అథశ్వపాకంశూద్రంవా స్వస్యసద్మాగతంశుభం। అతిక్రమ్య
సభుంజీత గృహమేధ్యతిథింనిజం। కింపునర్బ్రాహ్మణంసాధు
ద్వర్ణానాంజన్మతోగురుం। అవజ్ఞాబ్రాహ్మణస్యేయ మతిథేః
పూర్వభోజనం।గృహస్థస్త్వతిథింకృత్వాస్వయమేవనిమంత్రితం॥

తా॥ కాఁబట్టి తనయింటికి వచ్చిన శూద్రునిగాని చండాలునిగాని విడిచి భుజింపరాదు సాక్షాత్పరబ్రహ్మస్వరూపుఁడైన బ్రాహ్మణుని విడిచి భుజింపరాదని చెప్ప వలసిన దేమున్నది గృహస్థుఁ డవశ్యముగా అతిథిని పిలిచి అతిథికంటె ముందుగా తాను భుజించిన యడల బ్రాహ్మణావమానమగును.

శ్లో॥ బ్రాహ్మణావజ్ఞయా పుంస స్సర్వమేవ వినశ్యతి।
ఆయుశ్శ్రీశ్చ యశో ధర్మః శ్రేయోఽస్యత్ మనసి స్థితం॥

తా॥ బ్రాహ్మణావమానముచేత ఆయువు, ఐశ్వర్యము, కీర్తి, ధర్మము, ఇవ న్నియు నశించును యిదియేమి అదియేమి మనస్సులోవుండే కోరికయు అనఁగా సంకల్పి తమంతయు నశించును.

శ్లో॥ బ్రాహ్మణాః కథితా స్సర్వా దేవతా నాకసంస్థితాః।
దేవతానామవజ్ఞానా త్సర్వం నామ వినశ్యతి॥

తా॥ బ్రాహ్మణులందఱు స్వర్గమందుండెడి దేవతలని చెప్పఁబడుదురు దేవ తలను తిరస్కరించుటచేత అంతయు నశించును.

శ్లో॥ బ్రాహ్మణా జాతిమాత్రేణ దేవత్వం లభతే ధ్రువమ్
విశేషశ్చ పరం సాధు ర్దూర్వాసస్యాతి తేజసః॥

తా॥ జాతిమాత్రముచేతనే బ్రాహ్మణులు దేవతలతో సమానులు. యీదూ ర్వాసుఁడు తపోవంతుఁడు యితని విషయమందు చెప్పవలసినది ఏమున్నది.

శ్లో॥ యద్యప్యేష నచావజ్ఞాం కురుతే నృపసత్తమ।
తథాపి ప్రథమం విప్రా ద్భోజనం న ప్రకీర్తితం॥

తా॥ ఓ రాజా! యీ బ్రాహ్మణుఁడు కోపము చేయక పోయినను బ్రాహ్మణుని కంటె ముందు భుజించఁ గూడదు.

శ్లో॥ బ్రాహ్మణస్యాపి సుమహా న్నస్యా దోషోఽయమనిమంత్రణే।
ద్వాదశ్యాం ప్రతిగృహ్యాపి తస్మిన్ కాలేత్వనాగమః॥

తా॥ ఈ బ్రాహ్మణునకున్ను ద్వాదశీపారణము వచ్చెదనని చెప్పి రాకుండుట అన్యాయమైయున్నది.

శ్లో॥ ద్వాదశీత్యాగత స్త్వత్ర శ్లాఘ్యోఽపి హరివాసరః।
హరేర్దినస్య సంత్యాగే ప్రాయశ్చిత్తం న విద్యతే॥

తా॥ ద్వాదశీపారణను విడిచితే ఏకాదశ్యుపవాసమునకు భంగము వచ్చును ఏకా దశీత్యాగమునకు ప్రాయశ్చిత్తములేదు.

శ్లో॥ అవజ్ఞాంచవిప్రస్య సమమేవద్వయంతతః ।
గౌరవంలాఘవత్వంనాత్ర పశ్యామశ్శాస్త్రదృష్టిభిః॥

తా॥ బ్రాహ్మణావజ్ఞన ప్రాయశ్చిత్తము లేదు కాబట్టి యీ రెండును సమానములు గానున్నవి యిందు గురుత్వము లఘుత్వము మాకెందును కనుబడియుండలేదు.

శ్లో॥ అనర్థస్సర్వదైవాత్రి భూయాంశ్చసముపస్థితః ।
ద్వాదశ్యాంపారణాత్యాగా త్యక్త్వాథ క్తిర్హరే స్తథా।
పారణేతుకృతేనూనం విప్రశ్శాపంప్రదాస్యతి॥

తా॥ ద్వాదశికాలమందు పారణచేయనియడల హరిభక్తికిలోపించును పారణ చేసితే దూర్వాసుడు శపించును యెట్లైనను అనర్థమురాక తప్పదు, అదియు కొద్దిది గాదు గొప్పకీడు గలుగును.

శ్లో॥ ఇతిసంచింత్యసకలా బ్రాహ్మణావేదవాదినః ।
రాజానమిదమూచుస్తే యథాతథ్యంసమాశ్రితాః॥

తా॥ బ్రాహ్మణులందఱు శాస్త్రములనుబట్టి యిట్లు న్యాయముగా విచారించి యథార్థము రాజుతో యిట్లనిరి.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే చతుర్వింశోధ్యాయ

స్సమాప్తః,

అథ పంచవింశోధ్యాయారంభః,

బ్రాహ్మణాఊచుః॥ శ్లో॥ రాజన్నుభయతఃపాశా రజ్జురేషాసమాగతా।
భవతోనరశార్దూల ఘోరాత్పాపాత్పురాకృతాత్ । వయం
ననిశ్చయంక్వాపి గచ్ఛామోనరపుంగవ । స్వబుద్ధ్యాతుసమా
లోక్య కురుత్వంతవనిశ్చయమ్॥

తా॥ (బ్రాహ్మణులు చెప్పుచున్నారు) అంబరీషమహారాజా! నీకిప్పుడు రెండు ప్రక్కలనుంచి కంఠపాశరజ్జువుప్రాప్తమైనది యిది నీపూర్వపాతకమువలన సంభవించినది యీవిషయమందు మేము నిశ్చయించుటకు సమర్థులముగాము. పారణను ఆపితివా హరిభక్తిలోపము గలుగును పారణచేయించితివా దూర్వాసుడుశాపమిచ్చును గనుక యెట్లైనను నీకు కీడురాకతప్పదు అందు దేనికి నీవు వప్పుకొందువో ఆలోచించుకొని నీవె నిశ్చయించుకొనుము.

శ్లో॥ ఇత్యుక్తో బ్రాహ్మణై రాజా తానాహస్వాత్మనిశ్చయం।
హరిభక్తిపరిత్యాగా ద్విప్రశాపోవరోద్విజాః॥

తా॥ బ్రాహ్మణులిట్లు చెప్పినమాటలను విని రాజు వారితో తననిశ్చయమును యిట్లని చెప్పుచున్నాడు ఓబ్రాహ్మణులారా! హరిభక్తిని విడుచుటకంటె బ్రాహ్మణశాపము కొంచము మంచిది.

శ్లో॥ అంభసా కేవలేనైన కరిష్యే వ్రతపారణం। ఆహుశ్చాబ్భక్షణం విప్రాహ్యశితంనాశితంచయత్। ఏవంకృతేనచావజ్ఞాబ్రాహ్మణస్యభవిష్యతి। ద్వాదశ్యాశ్చపరిత్యాగో బ్రాహ్మణానాం కథంచన। ఏవంకృతేనచేచ్ఛాపం దూర్వాసో మేనదాస్యతి। మమజన్మాంతరకృతం మహత్పాపం ప్రణశ్యతి॥

తా॥ నేనిప్పుడు కొంచము జలముచేత పారణచేసెదను యీజలపానము భక్షణమగును. అది భక్షణమగునని చెప్పియున్నారు యిచ్చట శ్రుత్యర్థ "బోధకప్రమాణము" (కర్తుంసాధ్యంయదానాలం ద్వాదశ్యాబ్భిస్తుపారయేత్। కృతాపపాశవత్పశ్చా ద్భుంజీత్యేత్యపరేజగురితి॥) కాబట్టి జలపారణముచేత ద్వాదశ్యతిక్రమణదోషమురాదు బ్రాహ్మణ తిరస్కారమున్నులేదు యిట్లుచేసిన యడల దూర్వాసుడు శపించడు నాజన్మాంతర పాతకము నశించును.

శ్లో॥ ఇతినిశ్చిత్యరాజర్షిః చక్రేనీరేణపారణం। తావత్తాసమయే నైవ దూర్వాసాభృశకోపనః। అంబరీషంమహారాజంలోచ నాభ్యాందహన్నివ। పశ్యన్నువాచవచన మిదంకర్ణవిభేదనం॥

తా॥ రాజిట్లు నిశ్చయించి జలముచేత పారణచేసెను, అంతలో దూర్వాస మహర్షివచ్చి అతికోపముతో నేత్రములతో దహించువాడువలె అంబరీష మహారాజును చూచి చెవులకు వినశక్యముగాని కఠినమైన వాక్యమిట్లు పలికెను.

శ్లో॥ భవతాపారణంరాజన్ అతిథింమాంవిహాయకిం। అశాస్త్రార్థ ధియంకృత్వా దుర్ధియాధర్మఘాతినా॥

తా॥ ఓరాజా! అతిథినిగావచ్చిన నన్ను విడిచి శాస్త్రమర్యాదను వదలి ధర్మభంగకారిణియైన దుర్బుద్ధితో నీవు ద్వాదశీపారణ చేసితివి.

శ్లో॥ అస్నాత్వాతుమలంభుంక్తే అదత్వాఘంతుకేవలం। యోనిమం త్ర్యాతిథింపూర్వం మోహాద్భుంక్తేతథోధమః। మలాశీసతు విజ్ఞేయః క్రిమివిష్ఠాగతోయథా। భుంజతేతేత్వఘంపాపా యే

పచంత్యాత్మకారణాత్ । అతిథ్యర్థంచపక్వం యో భుంజతే తే
త్వఘాదఘమ్॥

తా॥ స్నానమాచరించక భుజించువాడు మలభోజిఅగును, యితరులకు పెట్టక తాను వకడే భుజించిన పాపమును భుజించును, అతిథిని రమ్మని పిలిచి తాను ముందు భుజించినవాడు వానికంటె అధముడు, వాడుఅశుధ్ధములోనుండే పురుగువలె మలాశి యగును ఆత్మార్థము వంటచేసికొన్నవాడు పాపమునుభుజించును, అతిథికొరకై వండించి తానే భుజించినవాడు పాపముల పరంపరను భుజించును.

శ్లో॥ పక్వంవాప్యథవాపక్వం పత్రంపుష్పఫలంపయః। అద్యమానం
భవేదన్న మన్నప్రతినిధౌస్థితం॥

తా॥ అగ్ని పక్వమైనదిగాని పక్వముగానిదిగాని పత్రముగానిపుష్పముగాని ఫలముగాని పాలుగాని అన్నమునకు బదులుగా యేది భుజించబడునో అదిఅన్నమేయగును.

శ్లో॥ భవానన్నప్రతినిధిం కృత్వా పాపోతిదుష్టధీః ।
అదన్మాంసంపరిత్యజ్య హ్యతిథించనిమంత్రితం॥

తా॥ నీవు అంగీకృతుడవైన అతిథిని నన్ను వదలి దూషిబుధ్ధిగలవాడవై అన్న ప్రతినిధిని చేసినావు.

శ్లో॥ విప్రావజ్ఞాకరోమందః విష్ణుభక్తఃకథంభవాన్ ।
అవజ్ఞాంకురుతేనైవ బ్రాహ్మణానాంకదాచన॥

తా॥ బ్రాహ్మణతిరస్కారివైన నీవెట్లు హరిభక్తుడవగుదువు వోరి మందుడా? యెప్పుడైనను బ్రాహ్మణులను తిరస్కారము చేయవచ్చునా,

శ్లో॥ విష్ణుర్దేవంతవకథం తస్యభక్తికరోభవాన్ । భవతోనాస్తి
కావ్యత్ర బ్రాహ్మణేమధుసూదనె । భవాన్యతో బ్రాహ్మ
ణం మాంత్యక్త్వాభక్షితవాన్నృప॥

తా॥ నీకు హరిదేవుడు యెట్లగును ఆతనియందు నీభక్తియెట్టిది బ్రాహ్మణవిషయమందును, హరివిషయమందును, నీకంటెపాపాత్ముడు లేడు, అనగానీవుబ్రాహ్మణుడవైన నన్నువదలి భుజించితివి గాన బ్రాహ్మణతిరస్కారివైతివి బ్రాహ్మణతిరస్కారముతోనే బ్రాహ్మణప్రియుడైన హరినిగూడ తిరస్కరించినవాడవైతివని తాత్పర్యము.

శ్లో॥ యథాపురోధసస్స్వస్య నుదమోహాన్మహీపతే।
అవజ్ఞాస్యసితద్వన్మాం త్వమిహాజ్ఞాతవానపి॥

తా॥ రాజా? యిప్పుడు నన్ను తిరస్కరించుట గూడను చేత నీపురోహితుని తిరస్కరించి నట్లున్నదనెను.

శ్లో॥ ధర్మధ్వజో౽భవాన్ ధర్మ మర్యాదానాంవిభేదకః।
పాపాచారశకథంభూమౌ జాతో౽ధర్మాత్మనామిహ॥

తా॥ ఓరీ నీవు ధర్మాత్ముడని పేరుపెట్టుకుని ధర్మమార్గములను నశింపచేయుచున్నావు ఓరీ పాపాత్మా యీభూమియందు పుణ్యాత్ములపాలిటి నీవెందుకు ప్రాప్తమైతివి అనఁగా నీవు రాజువు గనుక పుణ్యాత్ములు నిన్నాశ్రయించవత్తురు నీవు దుర్మార్గుడవు గనుక వారిని బాధించెదవు కాఁబట్టి నీవు ధర్మకంటకుడవగుదువని తాత్పర్యము.

శ్లో॥ ఏవముక్తశ్చఋషిణాభీ రయాతంప్రణిపత్యచ।
మునింప్రసాదయామాస అంబరీషఇదంబ్రువన్॥

తా॥ దూర్వాసుఁడిట్లు పలుకఁగా విని అంబరీషుడు భయమొంది నమస్కరించి యిట్లని ప్రార్థించెను.

శ్లో॥ పాపో౽హంపాపకర్మాహం పాపచేతాశ్చసర్వదా।
భవంతంశరణంప్రాప్తః పాహిమాంమునిపుంగవ॥

తా॥ అయ్యా నేను పాపుడను, పాపకర్ముడను, పాపమానసుడను, నిన్నుశరణు వేడెదను నన్ను రక్షించుము అని కోరెను.

శ్లో॥ ధర్మమార్గవిమూఢంమాం సీదంతంపాపకర్దమే।
పాహిమాంకృపయావిప్ర శరణంత్వాంసమాగతం॥

తా॥ నేను ధర్మమార్గమును తెలియక పాపమను బురదయందుపడి దుఃఖించుచున్నాను నిన్ను శరణు వేడుచున్నాను నన్నురక్షించుము.

శ్లో॥ అహంక్షత్రియధర్మో౽స్మి పాపాజ్ఞానవిమోహితః।
భవాన్విప్రశ్శాంతిసారః తతో౽మాంపాహిసర్వదా॥

తా॥ నేను క్షత్రియుడను, జ్ఞానములేక పాపములను చేసితిని నీవు బ్రాహ్మణుడవు శాంతిరూపుడవు గనుక నన్ను యెల్లప్పుడు తప్పక రక్షించుము.

శ్లో॥ బ్రాహ్మణా స్తుక్షమావంతః దయాసారాభవాదృశాః।
మాదృశాన్పాపపంకేస్మిన్ పాంతుమగ్నాన్మహాధియః॥

తా॥ బ్రాహ్మణులు క్షమాయుక్తులై యుందురు మీవంటి మహాబుద్ధిమంతులు కృపావంతులై మావంటి పాపసముద్రమగ్నుల నుద్ధరించవలయును.

శ్లో॥ ఇత్యాదివాదినంకోపా ద్దూర్వాసాఃపాదసంస్థితం శిరస్యాతాడయద్భూపం వామపాదేననిర్ఘృణః। ప్రాతాడ్యభూమిపం

దూరే తస్మాత్ స్థిత్వా సదత్త్విదం । అబ్రవీచ్ఛాపదానాయ ప్రవృత్తో తీవకోపనః॥

తా॥ ఇట్లు పాదములమీఁదపడి ప్రార్థించుచున్న రాజును కఠినుఁడైన దూర్వాసుఁడు తనయొడమ కాలితో తన్ని దూరముగాపోయి నుంచుని మిక్కిలికోపముతో శాపమిచ్చుటకు ప్రయత్నించి యిట్లనియె.

శ్లో॥ నాహంకృపాళుహృదయో నచమాంభజ తేక్షమా।
అశాంతిసారసర్వస్వం దూర్వాసంసమవైహిమాం॥

తా॥ రాజా! నేను దయగలవాఁడనుగాను నాకు శాంతిలేదు శాంత్యభావమునకు ఆలయమైతిని గనుక దూర్వాసుఁడు శాంతిలేనివాఁడని తెలిసికొనుము.

శ్లో॥ అన్యే తేమునయోభూప కుపితాశ్శాంతిభాగినః। కుపితస్యనమే శాంతి రాసీదస్తిభవిష్యతి। అదత్వాదారుణంశాపం కోపహేతుందురాత్మని। ఇత్యుక్త్వాదత్తవాన్ శాపమంబరీషాయభూభుజే॥

తా॥ ఇతరమునీశ్వరులందఱు కోపితులై తిరిగి ప్రార్థించిన యెడల శాంతులగుదురు గాని నేను కోపితుఁడనైతినేని కోపమును తెప్పించినవానికి కఠినమైనశాపమివ్వక శాంతించువాఁడనుగాను యిట్లని పలికి అంబరీషునుద్దేశించి శాపమిచ్చెను.

శ్లో॥ మీనఃకూర్మోవరాహస్త్వం వామనోవికృతాననః। బ్రాహ్మణఃక్రూరకర్మాచ క్షత్రియోజ్ఞానవర్జితః రాజ్యానర్హఃక్షత్రియశ్చ దురాచారరతస్తథా। పాషండమార్గవేత్తాచ బ్రాహ్మణస్సద్విగర్హితః। బ్రాహ్మణోబ్రాహ్మణానాంచ ఘాతకో నిర్ఘృణస్తథా। ఇతి తేదశజన్మాని సంతుపండితమానినః॥

తా॥ ౧ మత్స్యము, ౨ కూర్మము, ౩ వరాహము, ౪ వామనుఁడు, ౫ వికృతముఖుఁడు, ౬ బ్రాహ్మణుఁడై క్రూరుఁడు, ౭ క్షత్రియుఁడై జ్ఞానశూన్యుఁడు, ౮ క్షత్రియుఁడై రాజ్యాధికారిగానివాఁడు, ౯ దురాచారుఁడు, పాషండమార్గవేదియు, ౧౦ బ్రాహ్మణుఁడై దయాశూన్యుఁడై, బ్రాహ్మణులను హింసించువాఁడు, నేను శాస్త్రార్థవేదిని గనుక విచారించి జలముతో పారణ బ్రాహ్మణునికంటే ముందు చేసితినని గర్వముతోనున్న నీకు యీపది జన్మలు వచ్చును, అనఁగా పదియందును గర్వమునుపొందతగినది, యొకటియులేదు గనుక గర్వించిన వానికి గర్వభంగకరములైన జన్మలనిచ్చితినని భావము.

శ్లో॥ పునశ్శాపంప్రదాస్యామి మామతిక్రమకారిణః। ఇత్యుక్త్వా వ్యాదితేవక్త్రే పునశ్శాప యుకోపినా। అంబరీషస్యహృదయే

శాంబ్రిహ్మణో మధుసూదనః । స్థితో భక్తప్రియశ్శ్రీమాన్ శర ణాగతవత్సలః । భక్తంసమవతుంతద్వై చ్ఛాపంవిప్రేణకీర్తి తం । సత్యంకర్తుంప్రజగ్రాహ స్వయంశాపంద్విజేరితం। పున శ్చాతిక్రమంకర్తుం ప్రవృత్తంబ్రాహ్మణోత్తమం। దృష్ట్వైవం శిక్షితుం దేవో వ్యసృజత్స్వసుదర్శనం॥

తా॥ ఇట్లు పది శాపములనుయిచ్చి నన్నవమానపరచినవానికి యింకాశాపమివ్వ వలయునని తలచి దూర్వాసుఁడు నోరు తెరచునంతలో అంబరీషునిహృదయమందున్న బ్రహ్మవేద్యుడును, భక్తిప్రియుడును, శరణాగతవత్సలుఁడును, ఆగుహరితనభక్తునిశాపా డుతలంపుతోను, బ్రాహ్మణునిమాటను సత్యముగా చేయవలయునను తలంపుతోనున్న దూర్వాసుఁడు యిచ్చిన పదిశాపములను తానుగ్రహించితిరిగిశాపమిచ్చుటకుప్రయత్నిం చిన బ్రాహ్మణుని అక్రమముతో తగినశిక్షవిధించవలయుననితలచితనచక్రమునుపంపెను

శ్లో॥ అథజ్వాలాశతానంత కోటిసూర్యసమప్రభం। వ్యాదితాస్యం ద్విజశ్చక్రం దృష్ట్వాభయముపాగతః। ప్రాణత్రాణాయసహ సా పలాయనపరో௨భవత్॥

తా॥ తరువాత ఆచక్రము కోటిసూర్యకాంతితో ప్రకాశించుచు జ్వాలలు మండుచుండగా నోరు తెఱచుకుని పైకివచ్చెను దానిని జూచి బ్రాహ్మణుడు భయ మొంది ప్రాణములను కాపాడుకునే తలంపుతో పరుగెత్తెను.

శ్లో॥ త్వమన్వగచ్ఛద్దుష్ప్రేక్ష్యం జ్వాలావ్యాప్తదిగంతరం। మహచ్చక్రంమునిస్సో௨పి పర్యగాద్వసుధామిమాం॥

తా॥ ఆచక్రముమండుచున్న జ్వాలలతో ముని వెంటబడెనుమునిభూమతనంతయుతిరిగెను.

శ్లో॥ సుదర్శనానుగతో దూర్వాసాఅఖిలంజగత్ । పర్యగాన్నైవకో௨ప్యాసీ ద్రక్షకస్తద్భయాదిహ॥

తా॥ దూర్వాసుఁడు చక్రముచేత భూచక్రమంతయు తిరిగించబడెను చక్రభయ ముచేత యెవ్వడును మునిని రక్షించువాడు లేకపోయెను.

శ్లో॥ శక్రాదయోలోకపాలాః వసిష్ఠాద్యాశ్చతాపసాః। పూర్వబ్రహ్మ ద్దయశ్చాపి శక్తాన్నాసన్హి కేచన। తాపసస్యమునీశస్య కోప సంక్రాంతదుర్ధియః।హరిభక్తావమానేనబభూవప్రాణసంకటం॥

తా॥ ఇంద్రాది దిక్పాలకులును, వసిష్ఠాదిమునీశ్వరులును, బ్రహ్మాదిదేవతలును దూర్వాసుని రక్షింపలేరైరి, ఇట్లు తపస్సుచేసుకొంటు కూర్చునే మునీశ్వరునకు కోపముచేత బుద్ధిని చెర్చుకుని హరిభక్తున కవమానము చేయుటచేత ప్రాణసంకటము తటస్థించెను.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే పంచవింశోధ్యాయ స్సమాప్తః.

---

## అథ షడ్వింశోధ్యాయారంభః.

శ్లో॥ అథాజగామవైకుంఠం విష్ణునాపరిపాలితం।
భూరాదినిఖిలాన్ లోకాన్ అటిత్వైవత్వరాన్వితః॥

తా॥ ఇట్లు దూర్వాసుఁడు భూలోకము మొదలైన సమస్తలోకములు తిరిగి శీఘ్రముగా హరి నిలయమైన వైకుంఠమునకు చేరెను.

దూర్వాసః॥ శ్లో॥ త్రాహిత్రాహిజగన్నాథ బ్రహ్మణ్యామధుసూదన।
కరాలధారతశ్చక్రా త్త్వదీయాద్వక్త్రసంభవాత్ ॥

తా॥ (దూర్వాసుఁడు వేడుకొనుచున్నాడు) జగన్నాథా బ్రాహ్మణప్రియా మధుసూదన, వక్త్రసంభవమైన యీచక్రముయొక్క ధారలు నాపైన పడకుండ రక్షింపుము రక్షింపుము,

శ్లో॥ ఇదంసుదుస్సహంవిష్ణో సూర్యకోటిసమప్రభం।
చక్రంత్వదీయందుర్ప్రేక్ష్యం హంతుంమామేతివార్యతాం॥

తా॥ ఓవిష్ణో సూర్యకోటిసమానకాంతిగల యీఘోరచక్రము నన్ను చంపుటకు వచ్చుచున్నది నివారించు స్వామీ.

శ్లో॥ మమపాపస్యజాతేయం శిక్షామధునిషూదన।
అంబరీషేమహాభక్తే త్వయిశాపస్యదీపినః॥

తా॥ నీభక్తుడైన అంబరీషునకు అన్యాయముగా శాపమిచ్చిన పాతకునకు నాకు యీశిక్ష తగియున్నది.

శ్లో॥ బ్రాహ్మణానాంసహస్రేషు యతోహమతిపాతకః।
తతోమామతిపాపంత్వం రక్షస్వేదంజనార్దన॥

తా॥ బ్రాహ్మణులు వేలు జనములోను నేను బహుపాతకుడను కాఁబట్టినన్ను రక్షింపుము.

శ్లో॥ బ్రాహ్మణస్యపదంవిష్ణో తవవక్షసితిష్ఠతి ।
యత స్త్వత్తోమ మహాత్మ్యాత తత్కృతంపాపంత్వమీశ్వర॥

తా॥ హరీ నీవక్షస్థలమందు బ్రాహ్మణుని పదము వుండలేదా భృగుమహాఋషి హరిని పాదముతో వక్షస్థలమందుతన్నెను కాఁబట్టినాపాతకము నీవుసహించవలయును.

శ్లో॥ ఏవంవదన్ స్వాంతముపాగతస్సన్ సాష్టాంగపాతం పురతఃపపాత।
స్వరక్షణాయైవవినీతచేతాస్త్రాహీతి వాక్యంబహుశోమురారేః॥

తా॥ యీప్రకారము విష్ణుమూర్తియందరి దూర్వాసమహాముని సాష్టాంగ నమస్కారముచేసినవాఁడై ఓస్వామీ నన్ను రక్షించుమని అనేకమారులుదూర్వాసుఁడు పలికిన వాఁడాయెను.

శ్లో॥ మునిందూర్వాససంవిష్ణు రిదమాహమహాసన్నివ । మునీశబ్రాహ్మణాద్దైవం మమనాస్త్యత్రసంశయః । భవాదృశావిశేషేణ సర్వదాతాపసోత్తమాః॥

తా॥ అంత హరి నవ్వుచు యిట్లనియె దూర్వాసా బ్రాహ్మణులు నాకు దేవతలు అనుమాట నిజమేను మీవంటివారు మిక్కిలి దేవతలే యగుదురు.

శ్లో॥ భగవన్ శంకరస్సాక్షాత్ భవాన్వై బ్రహ్మరూపధృత్ ।జ్వాలజ్జటాకలాపశ్చ భృకుటీకుటిలంముఖం । నిరీక్ష్యత్రిభువనే తవ కోనభయంగతః॥

తా॥ బ్రాహ్మణోత్తమా? నీవు సాక్షాత్ శంకరుడవు, బ్రహ్మస్వరూపుడవు, జటలతోఁగూడి భృకుటీకుటిలమైన నీముఖమునుచూచితే యెవ్వరికి భయము గలుగదు.

శ్లో॥ ప్రకృతేర్వికృతింనైవ ప్రయచ్ఛంతిభవాదృశాః। బ్రాహ్మణానామహంనైవ కరోమ్యప్రియమణ్వపి । కర్మణామనసావాచా తద్భవాన్వేత్తికిన్నుతత్ ॥

తా॥ మీవంటివారు స్వభావమునకు వికారమును గలుగనివ్వరుగదా నేనుమనోవాక్కాయములచేత బ్రాహ్మణుల కపకారము కొంచమైనను చేయను ఆసంగతి నీకు తెలిసినదే యున్నదిగదా.

శ్లో॥ దేవానామపివిప్రాణాం సాధూనాంచగవామపి ।
సుఖాయసర్వథా దేహాన్ ధారయామియుగేయుగే॥

తా॥ దేవతలకు బ్రాహ్మణులకు, సాధువులకు, గోవులకు, సుఖముకొఱకు ప్రతియుగమందు నేనవతరింతును.

శ్లో॥ భవతాతాపసశ్రేష్ఠ కృతంకర్మాతినిందితం।
అంబరీషస్యయచ్ఛాపో దత్తంకారణవర్జితం॥

తా॥ దూర్వాసా! నీవు సాధునిందితమైన కర్మాచరించితివి అంబరీషునకు కారణములేని శాపము నిచ్చితివి.

శ్లో॥ అంబరీషోనరపతిః కర్మణామనసాగిరా। అనిష్టంకురుతేనైవ శత్రోరపికదాచన। సర్వభూతేషుమాంపశ్యన్ స్థావరేషుచ రేషుచ। స్వధర్మనిరతోవిప్ర భవతాభర్త్సితోబహు॥

తా॥ అంబరీషుఁడు మనోవాక్కాయములచేత శత్రువునకు అపకారమును చేయడు సర్వభూతములందును నన్ను భావించుచు చరాచరములందంతటను నన్ను చూచుచుండును అట్టివానిని వృథాగా నీవు అనేకబాధలు పెట్టితివి యిది నీకు తగునా.

శ్లో॥ భవాన్నిమంత్రణంతస్య స్వీకృత్యాథభవాన్మహాన్।
నచైవాగమనంకాలే నైవానుజ్ఞాంచదత్తవాన్॥

తా॥ నీవు భోజనమునకు వచ్చెదనని చెప్పిపోయి కాలమునకు రాలేదు నీకు అనుష్ఠానమున్నయెడల అతనికి అనుజ్ఞయు నివ్వలేదు.

శ్లో॥ అంభసాకేవలేనైవ ద్వాదశీతేనసాధితా।
అంభసోభక్షణేతస్య కోదోషశ్చమహాత్మనః॥

తా॥ కేవలము జలమును పుచ్చుకొని ద్వాదశీపారణ ముఖ్యకాలమునకు చేసెను ఈ ఉదకపానమందేమి దోషమున్నది.

శ్లో॥ అనాహారేపియచ్ఛస్తం శుద్ధ్యర్థంవర్ణినాంసదా। అమునాపిచతత్పీతంపిపాసోపశమాయచ। తదాచభవతాకోపఃకృతో నచ్ఛిద్రవీక్షణాత్॥

తా॥ బ్రహ్మచార్యాదులకు ఆహారనిషిద్ధమందు యుదకపానము విహితమై యుండగా దాహశాంతికై అంబరీషుఁడు జలపానము చేసినందువలన యేమిదోషము జరిగినది నీకేది వంకదొరకక దానిని ఒకతప్పుగా చేసికొని శాపమిచ్చినావుగాని విచారించి తెలిసిదోషమా.

శ్లో॥ యదాశాస్త్రార్థసిద్ధ్యర్థం కృతమంభశ్చభక్షణం।
తదాతేకేనకోపస్స్యాత్ శాస్త్రమార్గానువర్తినః॥

తా॥ అదిగాక అతను శాస్త్రమును చక్కగా విచారించి ద్వాదశీ కాలమందు జలపానమాత్రమే చేసెను నీవును శాస్త్రవేత్తవేగదా నీకు కోపమునకు తగిన కారణమేదియో చెప్పుము.

శ్లో॥ ప్రసాద్యబహుధా రాజా భవంతమతికోపినం । అప్రసన్నేత్వయిగతే దూరంమాంశరణంగతః॥ స్వభూతంస్వస్యహృదయె అంతస్థాంబుజవాసినం । భీతస్త్వత్తోమహాభాగో బ్రాహ్మణాత్ బ్రాహ్మణప్రియః॥

తా॥ అప్పటికినిన్ను అనేక విధములుగా ప్రార్థించి నీవు కోపమును తగ్గించక తన్ని దూరముగా పోగానే బ్రాహ్మణప్రియుడైన రాజు బ్రాహ్మణుడవైన నీవలన భయమొంది తనహృదయాంతర్వాసియైన స్వయంభువునైన నన్ను శరణువేడెను.

శ్లో॥ తతోభోభవతాదత్తం శాపంకర్తుంనచాన్యథా యస్మాన్నామభూద్వచోసత్యం బ్రాహ్మణస్యాతితేజసః॥ అగృహ్ణాందశజన్మాఖ్యం తదారాధోన్నృపోత్తమే। భవేతిభవతాప్రోక్తం నాత్రశుణోన్న ప్రపసందనః॥

తా॥ అంతలోనీవు శాపమిచ్చితివి బ్రాహ్మణునిమాట అసత్యమై పోవునను తలంపుతో రాజు హృదయమందున్న నేను ఆపదిజన్మలను అంగీకరించితిని రాజు నీవు శాపమిచ్చుటనే యెరుగడు.

శ్లో॥ ఆర్తోమాంశరణంప్రాప్తో విప్రదుఃఖంమయాకృతం। ఇతిబుద్ధింసమాదాయ నిజపాపప్రశాంతయె । మదేకమానసోభూత్వా విసస్మారనిజంవపుః తత్కర్ణవివరాత్తస్య హృదయాంభోజసంస్థితః । భవేతివచనంశ్రుణ్వా అహంభక్తార్తినాశనః॥ భక్తంశాపంత్వయాదత్తం స్వస్వబుద్ధిమచిక్లుపం॥

తా॥ నీవు శాపమిచ్చు సమయమున రాజు అయ్యో బ్రాహ్మణాపకారముగలిగినదే ద్వాదశిని విడిచిన హరిభక్తిలోపించునను భయముతో జలపారణచేసితిని దానితో బ్రాహ్మణతిరస్కారమాయెగదా హరీ నన్నెట్లు కాపాడుదువని దీనుడై నన్ను శరణుజొచ్చి ధ్యాయండై మనస్సునువుంచి యితర విషయములను మఱచి తనశరీరమును కూడ యెరుగక యుండెను ఇట్లుండగా నీవుశాపమిచ్చినావు శాపమందు "నీవుమీనమ్ము, కూర్మము, మొదలైనవిగమ్ము" అని చెప్పితివి అప్పుడు భక్తబాధా నివారణపరుడనైన నేను అతనిహృదయమందు నివసించియుండి అ[illegible]వువలన నీవిచ్చినశాపమువలన వినుచు భక్తునికి అన్యాయముగా శాపముగలిగెను గదా దీనినియెట్లుచేతునని ఆలోచించితిని.

శ్లో॥ బ్రాహ్మణస్యవచస్సత్యం యదిస్యాన్నైవతద్వరం।మమభక్తస్యచానిష్ట మితిబుధ్యాద్విజోత్తమ । బ్రాహ్మణాయవచోమ

హ్యాం స్వభక్తాశ్చమయాసహ। విప్రశాపోపిమేనస్యాద్భక్తానా
మితిదర్శయన్। అహంశాపమముంవిప్ర తేనస్వీకృతవానిహ॥

తా॥ బ్రాహ్మణునిమాటను సత్యముగా చేసితినేని నాభక్తునకనిష్టముగలుగును శాపమును నివారించితినేని బ్రాహ్మణవచన మసత్యమగును కాఁబట్టి బ్రాహ్మణ వాక్యము సత్యమయ్యేలాగున్ను భక్తసంరక్షణమయ్యేలాగున్ను ఆలోచించి నీవిచ్చిన శాపములను నేను స్వీకరించితిని.

శ్లో॥ వ్యసనానిదురంతాని శోకమోహప్రదానిచ।
సర్వేషాంసర్వదావిప్ర భక్తానాంనాశయామ్యహం॥

తా॥ నాభక్తులకు గలిగిన మహాకష్టముల నన్నిటిని నేను హరింతును.

శ్లో॥ భక్తశ్చధర్మనిరత స్సర్వభూతసమోమమ।
విజ్ఞాయాపిత్వయాశాపో దత్తోనైధర్మవర్జితః॥

తా॥ నాభక్తుఁడు ధర్మాత్ముఁడు సమస్తభూతములందు సమబుద్ధిగలవాడు అట్టివిషయమును యెరింగియుండియు నీవు అధర్మిష్ఠుఁగా శాపమిచ్చితివి.

శ్లో॥ ధర్మానానావిధా వేదె విస్తృతానరజన్మనాం।
దేశకాలవయోవస్థా వర్ణాశ్రమవిభాగశః॥

తా॥ వేదములందు దేశమునుబట్టి కాలమననుసరించి వయస్సును ముఖ్యముగా చేసికొని జాతిని అవలంబించి ఆశ్రమములను విషయముగా చేసికొనియు మనుష్యులకు అనేకవిధ ధర్మములు చెప్పబడినవి.

శ్లో॥ పుంసస్త్రియశ్చకేచిత్తు నృజాతెరపికేచన।
నత్యాజ్యోనరజాతీనాం ధర్మస్సర్వైర్నృజన్మభిః॥

తా॥ పురుషునకు కొన్ని ధర్మములు, స్త్రీలకు కొన్నిధర్మములు, మనుష్యజాతి కంతకు కొన్నిధర్మములు చెప్పబడినవి, కాఁబట్టి మనుష్యజాతికి సామాన్యముగా చెప్ప బడిన ధర్మమును మనుష్యులందరు విడువగూడదు.

శ్లో॥ సర్వవేదేషుతేష్వేవ ధర్మఃపరముదీరితః। పక్షయోరుభ
యోర్యాధాం సర్వదాహ్యన్నవర్జనం। హరెశ్చవాసరే
ష్వేవ త్యాగేదోషోమహాన్స్మృతః॥

తా॥ రెండు పక్షములందును మనుష్యులకందరికిని యేకాదశినాడు భోజన మాచరించగూడదని వేదములందు పరమ ధర్మము విధించబడినది, అట్లుగాక భుజించిన యెడల దోషము చెప్పబడియున్నది.

శ్లో॥ ద్వాదశ్యతిక్రమేత త్స్యాద్దోషోమద్భక్తిఘాతకః। మద్భక్తి త్యాగతోభీతస్స్వయంచక్రేసపారణం। శాపా త్తస్యపరిత్యాగె దోషోమేనభవేదిహ। ఏవంవిచింత్యనృపతిః ప్రవృత్తోదండిత స్త్వయా॥

తా॥ ద్వాదశిని విడిచినను యేకాదశిని విడిచిన దోషముసంభవించును కాబట్టి నాభక్తిలోపించునను భయముతో వాడు జలపారణచేసెను, ఇట్లుండగా నీవు వృధాగా విచారించక శాపమిచ్చితివి.

శ్లో॥ పునశ్శాపప్రదానాయ ప్రవృత్తశ్చమయాపిచ। మాభూత్తవ వచోసత్యం తపోరాశేర్మహాత్మనః। వ్యాధితాస్యత్వయితతః చక్రంసంప్రేషితంమయా॥

తా॥ అంతట విరమించక తిరిగి శాపమిచ్చుటకు ప్రయత్నించి నీవు మారుతెరచునంతలో దూర్వాసునిమాటను అసత్యతాదశను పొందనివ్వపద్దని తలచి నేను చక్రమును పంపినాను అనగా శాపమిచ్చిన గ్రహించువారులేరుగాన శాపము వృధాయగునని తలచి శాపమునే నివారించగలభావముతో చక్రమును పంపితినని తాత్పర్యము.

శ్లో॥ తతోగచ్ఛన్నృపం బ్రహ్మన్ అతిదుఃఖసమన్వితం।
త్వత్కృతేసప్రసాదైర్వైవ స్వస్తితేతేభవిష్యతి॥

తా॥ కాబట్టి నీవు అంబరీషుని వద్దకు పోవుము వాడు నీనిమిత్తము దుఃఖాకులుడై యున్నాడు నీవచ్చుటికి వెళ్ళిన యడల నీకు క్షేమము గలుగును.

శ్లో॥ విప్రవర్యవిషాదంత్వం మాప్రజాకులపూజిత। అంబరీషేనర పతౌ శాపస్తవవరోమమ। భవితవ్యంమయారూపై రైస్తై రే వాతిసర్వథా॥

తా॥ బ్రాహ్మణోత్తమా! దుఃఖించకుము అంబరీషునివిషయమైనీవిచ్చినశాపము నాకు వరమాయెను నేను యీరూపములనే ధరింతును.

శ్లో॥ కల్పేస్మిన్ వర్తమానేవి జగతఃస్థితికారణాత్। అహంశంఖ వధార్థాయ రక్షణాయమనోరపి। మహామీనంభవిష్యామి ప్రలయేవాంతరేసతి॥

తా॥ నేను యీకల్పమందు ప్రళయమందు జగత్తుయొక్క స్థితికారణము కొరకు శంఖాసురుని సంహరించుటకును మనువును రక్షించుటకును పెద్దచేపనగుదును.

శ్లో॥ సురాసురాణాముదధిం మధ్నతాంమంధరాచలం।
కూర్మస్సంధారయిష్యామి స్వకీపృష్ఠే నిరాశిని॥

తా॥ దేవదానవులు సముద్రమును మథించు తఱిని సముద్రమందు మునిగిన మందర పర్వతము ధరించుటకు తాఁబేలు నగుదును.

శ్లో॥ హిరణ్యాక్షస్యనాశాయ భూమేరుద్ధరణాయచ।
వరాహోహంభవిష్యామి మహానీలాచలోపమః॥

తా॥ హిరణ్యాక్షుని సంహరించుటకును, భూమిని ఉద్ధరించుటకును, నల్లకొండతో సమానమైన పందినగుదు.

శ్లో॥ హిరణ్యకశిపుంహంతుం నృసింహోవికృతాననః।
భవిష్యామిక్రోధవహ్ని జ్వాలావ్యాప్తదిగంతరః॥

తా॥ హిరణ్యకశిపుని సంహరించుటకొరకు క్రోధజ్వాలలచేత దిగంతముల వ్యాపించు వికృతాననుడైన మనుష్యసింహమును అగుదును.

శ్లో॥ వామనోహంభవిష్యామి లోకత్రయజిగీషయా।
బలిబంధాయశక్రస్య హృతరాజ్యార్పణాయచ॥

తా॥ లోకత్రియమును జయించి బలిని బంధించి యింద్రునకు పోయిన రాజ్యమును యిచ్చుకొరకు పొట్టివాడ నగుదును.

శ్లో॥ జామదగ్న్యశ్చరామోహం క్రూరకర్మాద్విజోత్తమః।
భవిష్యామిక్షత్రియాణా మభవాయమహాబలః॥

తా॥ క్షత్రియనాశనము కొరకు మహాబలముతోగూడి క్రూరకర్మయుతుడనై పరశురాముడను పేరుగల బ్రాహ్మణుడ నగుదును.

శ్లో॥ రావణస్యవినాశార్థం రామోరాజీవలోచనః।
భవిష్యామినృపస్తస్మా దాత్మజ్ఞానవివర్జితః॥

తా॥ రావణుని సంహారముకొరకు ఆత్మజ్ఞానశూన్యుడనైన రాముడను రాజునగుదును.

శ్లో॥ పునశ్చయాదవేవంశే కృష్ణఃకమలలోచనః।
గోపీజారోభవిష్యామి జ్ఞానినాంధురిసంస్థితః॥

తా॥ యదువంశమందు ఆత్మజ్ఞానముగలిగియు గోపీకాముకుడనై రాజ్యములేని కృష్ణుడ నగుదును.

శ్లో॥ బుద్ధోనామదితేఃపుత్రః పాషండాద్యుపదేశకః।
కలికాలేభవిష్యామి పాపమోహాయకేవలం॥

తా॥ కలియుగమందు పాపమోహము కొఱకు బుద్ధుడను అగుటి నిమిత్తమై పాషండమార్గోపదేశి నగుదును.

శ్లో॥ కలేరంతేభవిష్యామి విప్రవిప్రారిఘాతుకః॥

తా॥ కలియుగాంతమందు శత్రుఘాతుకుడనైన బ్రాహ్మణుండ నగుదును.

శ్లో॥ ఇతిమె కళజన్మాని పాతితాని శ్రితానిచ।
సంస్మృతాన్యపిసర్వేషాం సద్యఃపాపౌఘహానిచ॥

తా॥ ఇట్లు నాకు పదిజన్మలుంగలుగును యివి వినువారికి పాతకనాశనములగును.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే షడ్వింశోధ్యాయ
స్సమాప్తః.

---

## అథ సప్తవింశోధ్యాయారంభః.

అత్రిః॥ శ్లో॥ ఇత్యుక్త్వాతంపునఃప్రాహ భగవాన్ పురుషోత్తమః।
స్వభక్తపాలనాధిక్యం ప్రశస్తంసన్నికుంభజ॥

తా॥ ఓఅగస్త్యమునీంద్రా! భగవంతుడైన పురుషోత్తముడిట్లు దూర్వాసునితో పలికి స్వభక్తపాలన దీక్షాతిశయమును ప్రకటించుచు యిట్లనియె.

శ్రీభగవానువాచ॥ శ్లో॥ ప్రాప్తాన్యేవత్వయావిప్ర శాపవ్యాజేనభూభుజే। దత్తానిమెపరంతోషం కుర్వంత్యత్రనసంశయః। అనేనచమే క్లేశ అతోహంబ్రాహ్మణోత్తమ। తవసత్యంతుదుర్వాణః వచనం వేదసమ్మితం। అన్యథాచేత్ బ్రాహ్మణస్యమర్యాదానైవవర్తతే। ఇమమేవపునశ్శాపం ప్రాప్స్యామ్యానందకారణం॥

తా॥ (భగవంతుండు చెప్పుచున్నాడు) దూర్వాసా! అంబరీషునిగురించియిచ్చిన శాపములు నాకు చాలసంతోషమును చేయుచున్నవి యీశాపజన్మలవల్ల నాకేమికష్టమును లేదు నీవచనము వేదతుల్యము గనుక దానిని సత్యముగా చేయవలెను అట్లుగాని యెడల బ్రాహ్మణ మర్యాదకు భంగమేకలుగును, అట్టిభంగము గలిగినంతలో నాకదియే శాపమగును గావున అట్టి యిబ్బందిలేక ఆనందము కలిగినది.

శ్లో॥ గచ్ఛశీఘ్రంతథైవాస్తె రాజాప్రాయోపవిష్టవత్।
ఆత్మానంనిందయన్నిత్యం బ్రాహ్మణైః పరివారితః॥

తా॥ రాజు ప్రాయోపవిష్టుఁడువలె బ్రాహ్మణపదిచేష్టితుఁడై పడియున్నాఁడు అడిగాక అయోధ్య బ్రాహ్మణాపకారియైనదిగదా యీతఁడని దుఃఖించుచున్నాఁడు కాబట్టి త్వరగా పొమ్ము.

శ్లో॥ ధిక్ భూపం దుష్టబుద్ధింతు విప్రోపద్రవకారిణం।
మన్నిమిత్తం యతిశ్చక్రం మునింతమనుధావతి॥

తా॥ రాజు యీప్రకారముగా చింతించి దుఃఖించుచున్నాఁడు యెట్లంటె నా మూలముగా చక్రము బ్రాహ్మణుని వెంటబడినది ఛీ ఛీ బ్రాహ్మణోపద్రవ కారకుఁడైన రాజేందుకు.

శ్లో॥ గవార్థే బ్రాహ్మణార్థేచ సద్యః ప్రాణాన్పరిత్యజేత్।
యస్మాద్రాజాహి నృపతిః యస్యముఖ్యం హిరక్షణం॥

తా॥ రాజు మనుష్యులను పాలించువాఁడు గనుకను రాజుకు ముఖ్యము ప్రజారక్షణము గనుకను రాజు గోవులకొరకును, బ్రాహ్మణులకొరకును, ప్రాణములు విడువవలెను

శ్లో॥ రాజాచతుర్విధాన్ జీవాన్ పాలయేత్సాధుచేష్టితాన్। నిగృ
హ్ణీయాత్పరాంస్తద్వత్ సర్వాన్బ్రాహ్మణవర్జితాన్॥

తా॥ రాజు స్వేదజ, అండజ, ఉద్భిజ్జ, జరాయుజములను నాలుగు విధములగు జీవములను సన్మార్గమందుంచి పాలించవలెను. అందులో అందరిని దండనమీద పాలించవలెను గాని బ్రాహ్మణులను విడువవలెను.

శ్లో॥ బ్రాహ్మణో బ్రాహ్మణైరేవ నిగ్రాహ్యో వేదవాదిభిః।
సత్యధర్మాదినిరతైః లోభదంభవివర్జితైః॥

తా॥ బ్రాహ్మణుని సత్యధర్మరతులును లోభదంభశూన్యులును అగు బ్రాహ్మణులె తప్పును తెలిసికొని దండించవలెను.

శ్లో॥ త్యాజ్యఏవభవేద్విప్రో విప్రాణామపిపాపకృత్। ప్రాయశ్చిత్త
మకుర్వాణః దండ్యస్తత్రతతఃపరం। వపనం ద్రవిణాదానం స్థాన
నిర్యాసనం తథా। క్రూరకార్యస్య విప్రస్య కార్యం నాజ్ఞాని నావరం॥

తా॥ బ్రాహ్మణుఁడు పాతకమునుచేసి ప్రాయశ్చిత్తము చేసుకొనని పక్షమందు అతనిని బ్రాహ్మణులు వపనము ధనమును హరించుట స్థానభ్రష్టత్వము మొదలైన దండనములచేత దండించవలెను.

శ్లో॥ బ్రాహ్మణో బ్రాహ్మణాదశ్చేత్ కురుతే హింసనం ఖలః।
తథాపి దండధారీతం నహన్యాచ్చ కదాచన॥

తా॥ బ్రాహ్మణుఁడు దుర్మార్గుఁడై హింసచేయుచున్నను వానిని రాజు దండింపఁగూడదు.

శ్లో॥ స్వకార్యాన్నిష్ఠురం వాపి కుర్వాణో రాజ్ఞాధర్మానుగామినా। నవధ్యాగత
శ్శస్త్రపాణి ర్బ్రాహ్మణస్యాతతాయినః॥

తా॥ రాజు ధర్మమార్గబుద్ధిగలవాఁడగుచు యెట్టివాఁడైనను బ్రాహ్మణునకుగాని తనకు
అపకారము చేయువానినిగాని శస్త్రప్రయోగ మాచరించతగదు.

శ్లో॥ భయలేశవిహీనశ్చ క్షాత్రకీర్తిముపాగతః। నాస్యస్మిన్ విప్ర
వధతో యతో దోషో మహాన్ స్మృతః॥

తా॥ బ్రాహ్మణేతరులందఱు భయములేక క్షాత్రకీర్తిని చూపవలయునుగాని
బ్రాహ్మణహింసమాత్రము చేయకూడదు.

శ్లో॥ యదర్థం హన్యతే విప్రో యేన వాపి సహన్యతే। స్వయం వాన్యే
నవాస్యాస్య బ్రహ్మహా స్మృతి దర్శనాత్॥

తా॥ తాను స్వయముగా బ్రాహ్మణుని చంపినను తననిమిత్తమై బ్రాహ్మ
ణుఁడు చంపబడినను అన్యుని చేత చంపించినను బ్రహ్మహత్య సంభవించునని ధర్మశా
స్త్రములందు చెప్పఁబడియున్నది.

శ్లో॥ ఆకృష్టస్తాడితో వాపి ధనై ర్వాపి వియోజితః। యముద్దిశ్య
త్యజేత్ప్రాణా న్సోపి బ్రాహ్మణఘాతుకః॥

తా॥ బ్రాహ్మణుఁడు లాగబడిగాని, కొట్టబడిగాని, ధనహీనుడుగా చేయబడి
గాని, యెవనినుద్దేశించి ప్రాణములు విడుచునో వాడును బ్రహ్మహంతకుఁడగును.

శ్లో॥ మదర్థమాగతం హ్యేతద్వ్యసనం ప్రాణహారకం। దుర్వాస
సో బ్రాహ్మణస్య తతో హం బ్రహ్మహా ధ్రువం॥

తా॥ దుర్వాసునకు ప్రాణహారకమైన కష్టము నామూలముగా గతిగెను గాన
కాఁబట్టి నేను బ్రాహ్మణహంతకుఁడనైతిని.

శ్లో॥ ఇత్యాదివచనాద్రాజా భృశం తిష్ఠతి దుఃఖితః। గచ్ఛ త్వంతత్ర
తేస్వస్తి భూభుజశ్చ భవిష్యతి॥

తా॥ దూర్వాసా అంబరీషుఁడే మొదలైన ప్రసంగముతో మిక్కిలి దుఃఖముతో
యున్నాఁడు కాఁబట్టి నీవచ్చటికి త్వరగాపొమ్ము నీకును రాజునకును కుశలమగును.

శ్లో॥ వైకుంఠస్యవచశ్శ్రుత్వా నమస్కృత్య త్వరాన్వితః। సార్థం
చ కేశినా నృపతిం ప్రత్యగా ద్బ్రాహ్మణై ర్వృతం॥

తా॥ ఇట్లు విష్ణువు చెప్పినమాటలను విని దూర్వాసుండు నమస్కరించి అప్పుడె చక్రముతోసహా బ్రాహ్మణపరివేష్టితుడైన రాజువద్దకు వచ్చెను.

శ్లో॥ తమాయాంతంసమాలోక్య మునింభాస్కరతేజసం। అంబరీషో నరపతి ర్నమస్కృత్యేదమబ్రవీత్॥

తా॥ ఇట్లు సూర్యకాంతితో వచ్చుచున్న దూర్వాసునిజూచి అంబరీష మహారాజులేచి నమస్కరించి చక్రముతో యిట్లని విన్నవించెను.

అంబరీషఉవాచ। శ్లో॥ క్షమ్యతామద్యభోచక్ర హంతుమార్తంనచార్హసి। పాలయాద్యనహంతవ్య మతిక్రూర్యేణకర్హిచిత్। త్రాహితివాదినంమాంచ బ్రాహ్మణంశరణాగతమ్।

తా॥ (అంబరీషుడు పలుకుచున్నాడు) ఓచక్రమా? నన్నుమన్నింపుము ఆర్తుని సంహరించుట న్యాయముగాదు గనుక బ్రాహ్మణుని రక్షించుము అతిక్రౌర్యముతో హింసించుటతగదురక్షించుమని వేడుచున్ననన్ను శరణాగతుడైనబ్రాహ్మణున్నిరక్షించుము

శ్లో॥ ఏవంవదన్మునింరాజా బాహుభ్యాంపరిషస్వజె। పశ్చాత్తం పృష్ఠతఃకృత్వా విక్రాంతస్తౌనృపస్స్వయం। విస్ఫారితధనుశ్చాసౌ నమ్ముఖోభయవర్జితః। అంబరీషఇదంవాక్య ముక్తవాంశ్చసుదర్శనం।

తా॥ అంబరీషుడిట్లు పలుకుచు దూర్వాసుని కౌగలించుకొని తరువాత అతనిని తన వెనుకకుత్రోసి తాను ముందునుంచుని భయములేక ధనువును ఝాడించి చక్రముతో యిట్లనిరెు.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే సప్తవింశోధ్యాయస్సమాప్తః.

అథ అష్టవింశోధ్యాయారంభః.

అంబరీషఉవాచ॥ శ్లో॥ తిష్ఠతిష్ఠనమస్తేస్తు సుదర్శనహరిప్రియ। బ్రాహ్మణోయంముదాత్రాహి నైనంహంతుంత్వమర్హసి।

తా॥ (అంబరీషుడు పలుకుచున్నాడు) ఓచక్రమా? ఆగు ఆగు నీకు నమస్కారము యీతడు బ్రాహ్మణుడు యితనిని చంపుట తగదు.

శ్లో॥ అహంజీవంతుదాస్యామి భవతెవధకారిణే। బ్రాహ్మణస్య వధంముంచ తూర్ణంయుద్ధస్వవామయా॥

తా॥ నీవు వధ కాఁబట్టియున్నంతలో నాశరీరమును యిచ్చెదను యీబ్రాహ్మ ణుని విడువుము లేనియడల నాతో యుద్ధముచేయుము.

శ్లో॥ యద్యపిత్వంహరేస్సాక్షా దవ్యాహతమిహాయుధం। యత స్త తోసిమేదైవం త్వయాయోత్స్యేతథాప్యహమ్॥

తా॥ నీవు హరియొక్క యాయుధము గనుక నాకుదైవముఅయితివి అయినప్ప టికి నీతో యుద్ధముచేయుదునుగాని నిన్ను బ్రతిమాలుట లేదు.

శ్లో॥ క్షత్రియస్యనమేయాచ్ఞా విహితాత్రిస్వయంభువా। వినాయు ద్ధంతత స్తహీన యాచ్యస్తేదైవమాత్మనః॥

తా॥ క్షత్రియునకు బ్రహ్మయుద్ధమని విధించెనుగాని యాచనను విధించలేదు అయినను నీవు నాకు దేవతవు గనుక యాచించవచ్చును.

శ్లో॥ జానేత్వాంనిఖిలైర్ముఖ్యై రజేయంచాత్మనోబలం। తథాపి పశ్యమేచక్ర బలంబాహుద్వయోత్థితమ్॥

తా॥ నీవు సమస్తభూతములకు అజేయుడవు యీమాటనాకు తెలుసునుగాని అయినను నాబాహుబలమును చూడుము.

శ్లో॥ మాంచత్వాముపిపశ్యంతు విష్ణునాసహితాస్సురాః। మయాని, పాతితంభూమౌ ముంచతేనతంద్విజం॥

తా॥ విష్ణ్వాదిదేవతలందఱు నీబలమును నాబలమును చూతురుగాక నిన్నిప్పుడు భూమియందుపడవైచెద అట్టియవస్థను జెందక యీతనిని విడువుము.

శ్లో॥ యదితేజీవనస్యేచ్ఛా రుచిర్యదిహరేఃకరే। తదాపాహివిముం చైనం విప్రంమాంశరణాగతమ్॥

తా॥ నీకు జీవించియుండి హరిహస్తమందు నివసించకోరికయున్న యడల నన్ను పాలించు శరణాగతుడైన యీబ్రాహ్మణుని విడువుము.

శ్లో॥ ఇతిస్తుత్వాతిసంతుష్ట ఆహేదంతంసుదర్శనం। అత స్తస్యైవరీ త్యార్థం కోపావిష్టఇవాసితః॥

తా॥ రాజిట్లు స్తుతించగా చక్రము సంతోషించి రాజును పరీక్షించవలయునను తలంపుతో కోపమువచ్చినవాడువలె నటించి యిట్లనియె.

సుదర్శనమువాచ॥ శ్లో॥ మయాహతంయాజ్ఞసేషే మధుంకైటభసం యుతం। అన్యేపిచతథాదైత్యా అజేయాస్సకలైస్సురైః॥

తా॥ (చక్రము చెప్పుచున్నది) రాజా? తెలుసునా మధుకైటభులను నేనుచంపి నాను దేవతలకు జయించుటకు శక్యముకానివారైన రాక్షసులను అనేకమందినిచంపినాను.

శ్లో॥ అస్యదూర్వాససఃకోపా ద్భ్రుకుటీకుటిలంముఖం । మాంవిహాయజగత్యస్మిన్ పురుషోవీక్షితుంక్షమః । సఏషోద్యమయానీతో దశామేతాంవినిందితాం । బ్రాహ్మంచశాంకరంతేజో బిభ్రత్సర్వైస్సుదుస్సహమ్॥

తా॥ యీదూర్వాసుడు కోపముతోగూడిన ముఖమును చూచుట కెవ్వడైన సమర్థుడున్నాడా యిట్టి దూర్వాసుడు శంకరబ్రహ్మలయొక్క తేజోధారియైనను యిప్పుడిట్టి అవస్థను నావలన జెందెనుగదా.

శ్లో॥ శంకరాత్తేజసోజాతం క్షత్రసంహారకాద్భువి । మత్తోధికం నతద్బ్రాహ్మ్యమతిక్రాంతంక్వచిత్ప్రభుః । క్షత్రతేజోయుతస్త్వల్పో ధర్షితో బ్రహ్మతేజసా । శక్తఃకింత్వంమయాయోద్ధుం తేజోద్వయవిరోధినా॥

తా॥ శంకరునివలన క్షత్రియసంహారకారకమైన తేజస్సుసంభవించినది ఆతేజస్సు నాకంటె అధికముకాదు, బ్రహ్మతేజస్సు నాకంటె అధికముగాదు అనియు నాచేత అనేక పర్యాయములు అతిక్రమించబడినది శంకరబ్రహ్మల తేజోధారియైన దూర్వాసుడే యిట్టి యవస్థను జెందినప్పుడు కేవల శంకర తేజస్సంభూత క్షత్రియతేజోవంతుడవైన నీవు నాతో యుద్ధమునకెట్లు సమర్థుడవగుదువు బ్రహ్మశంకరుల రెండు తేజస్సులు నాకు చాలనివి అయివున్నవి.

శ్లో॥ రాజన్బలవతాసంధిః కార్యస్స్వాత్కుశలార్థినా । సత్వం మౌర్ఖ్యముపాశ్రిత్య మాంయోద్ధుంకేనసంస్థితః॥

తా॥ రాజా క్షేమముకోరినవాడు బలవంతునితో సంధిచేయవలెనుయిట్లున్యాయ ముండగా నీవు మూర్ఖత్వమును అవలంబించి నాతో యుద్ధమునకు సన్నద్ధుడవెందుకైతివి.

శ్లో॥ హరిభక్తస్త్వమిత్యేత న్మత్వా తేతావతావనహం। సంభ్రమంయాహిశీఘ్రంత్వం మాప్రాణానత్రసంత్యజ॥

తా॥ నీవు హరిభక్తుడవని నేను నిన్ను యింతవరకు సహించినాను కాబట్టినీవు దూరముగా పొమ్ము ప్రాణములను వృథాగా పోగొట్టుకొనకుము.

శ్లో॥ ఇతిద్వచనంశ్రుత్వా కోపసంరక్తలోచనః । అంబరీషస్తతో వాక్యముక్తవాంస్తంసుదర్శనం॥

తా॥ ఇట్లు చక్రవాక్యమును విని అంబరీషుడు కన్నులెఱ్ఱచేసి చక్రముతో యిట్లనియె.

అంబరీషఉవాచ॥ శ్లో॥ సుదర్శనత్వమస్మాకం దేవస్యాప్యాయుధఃపరం। ఇతిమత్వామయాబ్రహ్మన్ శ్యతిథానాత్రికారితః॥

తా॥ (అంబరీషుఁడు చెప్పుచున్నాఁడు) చక్రమా! నీవు నాదేవునకు ఆయుధమైతివని నిన్ను బాణములచేత నూఱుఖండములుగా కొట్టలేదు.

శ్లో॥ ఇతఃపరంగౌరవంతె నూనంనాశంగమిష్యతి। క్షాత్రధర్మము పాశ్రిత్య బాహుసేయోమయాసహ బాణాన్మమచహస్తైతాన్ స్వాత్మగర్వవినాశకాన్। క్షాత్రంధర్మముపాశ్రిత్య యస్త్వం గర్వముపాగతః। నాహంవిప్రేషుదేవేషు స్త్రీషుజ్ఞాతిషుగోషునా। క్రూరస్త్వమిహదేవోఽసి తేనజీవసిమేపురః॥

తా॥ నీవు క్షత్రియధర్మమును అవలంబించి నాతో మాట్లాడుచున్నావు గనుక యికముందు నీగర్వముండబోదు నీగర్వమును, నశింపచేయు బాణములు నాహస్తమందున్నవి నేను బ్రాహ్మణులందును. దేవతలందును, స్త్రీలయందును, జ్ఞాతులందును, గోవులందును బాణములను వదలను నీవు క్రూరుఁడవైనను దేవుఁడవగుటచేతయుపేక్షించినాను.

శ్లో॥ దేవత్వంసంపరిత్యజ్య క్షాత్రేణపురతోమమ। స్థితోగృహాణమేబాణాన్ దుస్సహానగ్నిసన్నిభాన్। ఇత్యుక్త్వాథముమోచాస్య పాదయోరుభయోరపి। చతుర్వింశతిసంఖ్యాకాన్ బాణాన్ జ్వలనవర్చసః॥

తా॥ నీవు దేవత్వమును వదలుకుని క్షత్రియత్వముతోఁగూడి నాయెదుట నిలిచి అగ్నితోసమానమైన వేడిగల నాబాణములను సహించుచు చూతము, యిట్లని అంబరీషుఁడు యిరువది నాలుగు బాణములను యీచక్రపాదములమీద వదలెను.

శ్లో॥ సుదర్శనస్తతోదృష్ట్వా తస్యపౌరుషమద్భుతం। క్షాత్రంచ వరమప్రీత ఇదమాహహసన్నివ॥

తా॥ ఇట్లు క్షాత్రపౌరుషముతోఁగూడిన రాజునుచూచి చక్రమునవ్వుచు యిట్లనియె

సుదర్శనమువాచ॥ శ్లో॥ రాజన్ త్వత్తైవరక్షార్థం విష్ణునాప్రేరితోఽస్మ్యహం। విముక్తోయంమయావిప్ర స్త్వయశ్శరణాగతః॥

తా॥ (చక్రము చెప్పుచున్నది) రాజా నీసంరక్షణ నిమిత్తమె హరి నన్ను పంపె నాను నిన్ను శరణాగతుఁడైన బ్రాహ్మణుని విడిచితిని సుఖముగా యుండుము.

శ్లో॥ ఇత్యుక్త్వాసంపరిత్యజ్య ధనుర్బాణసమన్వితం। వపాతసహసా భూమౌ నమశ్చక్రే కృతాంజలిః॥

తా॥ ఇట్లు పలికి ధనుర్బాణములతో గూడియున్న రాజును కౌగలించుకొని భూమియందుపడి నమస్కారము చేసెను.

శ్లో॥ నృప స్తదాగతంచక్రం వినీతంశుంభసంభవ॥

తా॥ ఓ అగస్త్యా! రాజు అలావిధేయుడైన చక్రముతో యిట్లనిరిని.

శ్లో॥ క్వాహంక్రిమిషుసంసృతి మధ్యవర్తీ క్వత్వంహరే ర్దేవకరాంబుజస్థః । ఏవంవిజానన్నపితే పురస్తాద్యుద్ధార్థమాగాం తదిదంక్షమస్వ॥

తా॥ సంసారమధ్యమున సంచరించెడు పురుగునైన నేనెక్కడ హరియొక్క హస్తమందు ప్రకాశించెడి నీవెక్కడ ఇట్లు తెలిసియు నీతో యుద్ధమునకు సన్నద్ధుడనైన నాతప్పును క్షమించుము.

శ్లో॥ సావజ్ఞయా తేత్రసమాగతోహంయుద్ధాయసాత్త్వా ద్వ్యతులప్రవృత్తేః । క్రూరంనిజంక్షత్రియధర్మమేవం సంపాదయన్మే తదిదంక్షమస్వ॥

తా॥ నేను నిన్ను తిరస్కరించి విజృంభించి యుద్ధమునకాయుత్తపడితిని క్రూరమైన నాక్షత్రియస్వభావమిట్లు చేసినది గనుక క్షమించుము.

శ్లో॥ పక్షస్సితోయందివస శ్చతద్వత్సంగ్రామభూమి ర్మకరశ్చ మాసః । ఇచ్ఛన్మృతిం కేవలమాగతోహంత్వత్తస్మృతం కేవలమాత్మదైవం॥

తా॥ ఇది శుక్లపక్షము పగలు యుద్ధభూమి మకరమాసము యట్టిపుణ్యకాలమందు నాదేవుడవైన నీవలన మృతినిగోరియె యుద్ధమునకు వచ్చితిని భగవద్గీతాయాం శ్లో॥ అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల స్షణ్మాసా ఉత్తరాయణం। తత్రప్రయాతాగచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః॥ ఇతి ఉత్తరాయణమందు శుక్లపక్షమందు పగలుమృతినొందినవారు అర్చిరాది మార్గమునపోయి బ్రహ్మపదముచేరుదురు. కార్తికశుక్ల ద్వాదశినాడు వెళ్ళిన దూర్వాసుడు మాఘమాసమునకు తిరిగివచ్చెను.

శ్లో॥ జ్వాలాకరాళంనిఖిలై రసహ్యందైత్యేన్ద్రదేవై రవిరూపమేతత్ । సేహేవరాకఃకథమద్యచాహం విద్యుచ్ఛటాదప్యధికాత్మకాంతి॥

తా॥ జ్వాలలచేత భయంకరమును దేవదానవుల కసహ్యమును నూరు మెరుపులకంటె అధికమైన కాంతిగలదియు అయిననీరూపమునుగర్వుతో సమానుడనైన నేనెట్లువహింతును.

శ్లో॥ బింబం రవేరగ్నిసహస్రయుక్తమానన్దకాకోటిరపిత్వదస్త్రః।
యుద్ధ్వా వధార్తైన భవే కథంచిద్రూపం పరం తేఽఖిలమర్దకస్య॥

తా॥ సహస్రాగ్నియుక్తమైన రవిబింబమువలె సహస్రారములనుధరించునటువంటిన్ని సమస్తసంహారకమైనటువంటిన్ని నీరూపముతో యుద్ధముచేయు నేనెట్లుశక్తుడనగుదును.

శ్లో॥ దంష్ట్రాకరాళంవదనం త్వదీయంవహ్నిర్వ్యముత్సృజ్యతపవదిగ్భ్యః। దంష్ట్రాంచశక్తః కతమోఽపివీరో దేవాసురాణామధవాపరోవా॥

తా॥ కోరలతోగూడి భయంకరమును దశదిక్కులందు అగ్నులను బయలువెడలుచు చున్నటువంటి నీయొక్క దంతపుదెబ్బను దేవుడుగాని రాక్షసుడుగాని యింకెవ్వడుగాని సహించగలడు.

శ్లో॥ యద్యత్రవిద్యుద్రవిరశ్మిమాలాభవేయురేకత్రకరాలరూపాః।
తథాపితేతేజసినావగమ్యాః సర్వస్యతేజోభిభవేపరేశ॥

తా॥ మెఱుపులు సూర్యుని కిరణజాలములును మొత్తములై భయంకరాకారములను ధరించి వచ్చినను నీతేజస్సును తిరస్కరించలేవు.

శ్లో॥ భవంతమాశ్రిత్యసదాకరాళంవిష్ణుస్త్రిలోకేస్థితయేప్రవృత్తః।
నజీయతేకైరపిభూరిసత్త్వైర్దేవైఃపరైర్వారిపుతాంప్రయాతైః॥

తా॥ విష్ణువు భయంకరాకారమైన నిన్నాశ్రయించి మూడులోకములనుపాలించుచున్నాడు నీతోవిరోధించిన యడల దేవతలుగాని దానవులుగాని అన్యులుగాని నిన్ను జయించలేరు.

శ్లో॥ నమోఽస్తుతేదైత్యవినాశకాయ తథైవభక్తస్యచరక్షణాయ।
విష్ణోరనంతద్యుతిదీపితాయ ప్రాణప్రయాణార్తిహరాయమేఽస్తు॥

తా॥ దైత్యులను చంపుదానవును భక్తులను పాలించుదానవును విష్ణువుయొక్క కాంతిచేత ప్రకాశించుదానవును ప్రాణగమనకష్టమును హరించుదానవును అగు నీకు నమస్కారము.

శ్లో॥ ఇతిస్తువంతంరాజానం భూమానిపతితంతథా। ఉత్థాయప్రేరయామాస స్వస్తితేస్త్వితికీర్తయన్॥

తా॥ ఇట్లు స్తుతించి భూమియందు నమస్కారము చేయుచున్న రాజును లేవదీసి నీకు క్షేమమగుగాకయని చక్రము పలికెను.

అ॥శ్రీ॥ శ్లో॥ ఇదంసుదర్శనస్తోత్రం త్రిసంధ్యంయఃపఠేచ్ఛుచిః। సర్వాపద్భ్యోవిముచ్యేత చిరంసుఖమవాప్నుయాత్॥

తా॥ ఈచక్రిస్తోత్రమును గూర్చి [illegible] పఠించువాడు అపమృత్యువుఁజెందక చిరతరసుఖములను బొందును.

శ్లో॥ యశ్శృణోతీదమధ్యాయం [illegible] ద్వామానవఃకలౌ।
సనర్వత్రసుఖంప్రాప్య తతోయాతిశుభాంగతిం॥

తా॥ కలియుగమందీ యధ్యాయమును యొకమారైనను వినువారు అనేకభోగములు పొంది అంతమందు మోక్షమొందును.

ఇతి శ్రీస్కాందపురాణే కార్తీకమాహాత్మ్యే అష్టవింశోధ్యాయ స్సమాప్తః.

---

అథ ఏకోన త్రింశోధ్యాయారంభః.

అత్రిః॥ శ్లో॥ మదర్శనస్స్వయంచాగా దంతర్ధాంతస్యపశ్యతః॥

తా॥ రాజు చూచుచుండగానే చక్రమంతర్ధానమొందెను.

శ్లో॥ అంతర్ధానంగతేతస్మిన్విష్ణుచక్రేసుదర్శనే। రాజాతస్మైనమ స్కృత్య బహుభక్తిసమన్వితః। ఏవం దేశిరసాపశ్చాద్దూర్వా సంచాప్యకల్మషం। ఆహచైతత్ప్రహృష్టాత్మా మునింభక్తి సమన్వితః। స్వశిరఃపాదయోస్తస్యకృత్వాథస్థాన్నుపుంగవః॥

తా॥ సుదర్శనమను చక్రము అంతర్ధానము బొందినతరువాత అంబరీషుడు భక్తితో దూర్వాసునకు నమస్కరించి తరువాత శిరస్సుతో వందన మాచరించి భక్తిచేత పులకాంకితుడై తనశిరమును మునిపాదములపైన బడవేసి యిట్లని విన్నవించెను.

శ్లో॥ పాపినంపాపపంకేస్మిన్ సీదంతంగృహమేధినం।
మాంసముద్ధరవిప్రేంద్ర గృహాణాన్నంగృహేమమ॥

తా॥ బ్రాహ్మణోత్తమా! నేను మహాపాపిని పాపపంకమందు మునిగియుండికష్టించుచున్నాను కాబట్టి గృహస్థునైన నాయింట్లో అన్నమును భుజించి నన్నుద్ధరించుము.

శ్లో॥ కృపావతాద్యభవతా రక్షితోస్మినసంశయః।
పునరాగమనంయస్మా దధునామెగృహేకృతం॥

తా॥ నీవు నాయందు దయవుంచి తిరిగి నాయింటికివచ్చి నన్ను రక్షించినావు.

శ్లో॥ కానామలోకతోభీతి ర్జగతోభయదాయినః।
భయవ్యాజాత్పునశ్చాగా ద్రక్షితుం కేవలంహిమాం॥

తా॥ మూడులోకములందు భయమును కలిగించు నీకు భయమెక్కడిది? భయమును మీవలన నన్ను రక్షించుటకు నీవు నాయింటికి వచ్చినావు.

శ్లో॥ పునర్దర్శనదానేన స్వాత్మనాభయదానతః।
ప్రాణదానంకృతంతద్వ త్పరలోకస్యరక్షణమ్॥

తా॥ నీవు తిరిగి వచ్చుటచేత నేను బ్రతికినాను నాకు పరలోకమును సిద్ధించును కాఁబట్టి త్వద్దర్శన దానముతో నాకభయదానమును దానితో ప్రాణదానమును దానితో పరలోకదానమును సంభవించినది.

శ్లో॥ ఇతిబ్రువాణంరాజానం బాహుభ్యాంమునిసత్తమః।
సంప్రహృష్టేన మనసా సముత్థాప్యేదమబ్రవీత్॥

తా॥ ఇట్లు విన్నవించుచున్న రాజును తనబాహువులతో లేవనెత్తి దూర్వాస మహాముని ఆనందముతో యిట్లనియె.

దూర్వాసః॥ శ్లో॥ ప్రాణానాంరక్షకశ్శాస్త్రే పితేతిపరికీర్తితః।
భవతారక్షితాఃప్రాణాః మమతేనపితాభవాన్॥

తా॥ రాజా! ప్రాణములను రక్షించువాఁడు తండ్రియని చెప్పఁబడును, యిప్పుడు నీచేత నాప్రాణములు రక్షింపఁబడినవి గనుక నాకు తండ్రివి నీవేను.

శ్లో॥ మయాకృతేనమస్కారే భవాన్దుఃఖముపావ్రజేత్।
పితామమతతోనాహం నమస్కారంకరోమి తే॥

తా॥ నేనీకిప్పుడు నమస్కారముచేసిన యెడల నీవు దుఃఖించెదవు తండ్రికి కష్టముగలిగెడి వ్యాపారము చేయగూడదు గాన నీకు నమస్కారము చేయను.

శ్లో॥ మయాపినుమహాక్లేశో బ్రహ్మణ్యాస్యకృతోనృప।
తత్ఫలంమమహాజ్జాతం మమనాస్త్యత్రసంశయః।
ఫలంచతస్యపాపస్య సంప్రాప్తమనివారితం।
భవతానరశార్దూల బ్రహ్మణ్యేనకృపావతా॥

తా॥ బ్రాహ్మణ్యుఁడైన నేను నీకు గొప్పకష్టమును కలిగించితిని దానికి ఫలమును అనుభవించితిని, చివరకు నీవు దయతో ఆకష్టమును నివారించితివి.

శ్లో॥ భోక్ష్యేచభవతోగేహే మహారాజత్వయాసహ।
ఇత్యుక్త్వాభోజనంచక్రే సమునిర్భూభుజాసమం।
అంబరీషేణధర్మజ్ఞో ధర్మజ్ఞేనకృపావతా॥

తా॥ రాజా నీతో కూడా భుజించెదనని దూర్వాసుఁడు ధర్మబుద్ధిగలవాఁడై ధర్మవేత్తయైన అంబరీషునితో సహా భుజించెను.

శ్లో॥ సాక్షాచ్ఛివస్సదూర్వాసః వైష్ణవస్యమహాత్మనః।
తస్యభక్తిపరీక్షార్థం గత్వాతమభినంద్యచ।
అనుజ్ఞాతోంబరీషేణ స్వాలయంప్రయయౌమునిః॥

తా॥ సాక్షాత్ శివరూపుఁడైన దూర్వాసుఁడు విష్ణుభక్తునియొక్క మాహాత్మ్యమును పరీక్షించగోరివచ్చి ఇట్లుపరీక్షించి సంతోషించి ఆజ్ఞాపితుడైస్వాశ్రమమునకువెళ్లెను

శ్లో॥ తస్మాద్దూర్జేమునిశ్రేష్ఠ ద్వాదశీహరిబోధినీ।
సమస్తదానఫలదా సర్వతీర్థఫలప్రదా।
సర్వేషామేవయజ్ఞానాం ఫలదాహరిబోధినీ॥

తా॥ కాఁబట్టి కార్తికమాసమందు హరిబోధినీ ద్వాదశీ సమస్తదానఫలప్రదము, సమస్తతీర్థఫలప్రదము, సమస్తయజ్ఞఫలప్రదమగును.

శ్లో॥ యశ్శుక్లైకాదశీంపుణ్యాం కార్తికేమునిసత్తమ। ఉపోష్యజాగరంకృత్వా ద్వాదశ్యాంబ్రాహ్మణైస్సహ । కృత్వాదానానియోభక్త్యా పారణంతుసమాచరేత్ । నసద్యోముచ్యతేనూనం పాపైర్నిష్కృతివర్జితైః॥

తా॥ కార్తికమాసమందు శుక్లైకాదశినాడుపవాసమాచరించి జాగరముండిద్వాదశినాడుదానములిచ్చిబ్రాహ్మణులతో కలిసిపారణచేయువాడుమహాపాతకముక్తుడగును

శ్లో॥ యదిస్వల్పాభవేత్పుణ్యా ద్వాదశీవిష్ణువల్లభా।
నాతిక్రమ్యాహరేర్భక్తైర్వైష్ణవైర్మోక్షకాంక్షిభిః॥

తా॥ మోక్షముగోరిన విష్ణుభక్తులు ద్వాదశి స్వల్పముగా నున్నప్పుడు దానిని విడువక ఆలోగానే పారణచేయవలయును.

శ్లో॥ తత్రాపికార్తికేపుణ్యా ద్వాదశీహరిబోధినీ।
నాతిక్రమ్యామునిశ్రేష్ఠ సర్వథానాత్రసంశయః।
కార్తికేశుక్లద్వాదశ్యాం యత్కృతంతన్మహాత్ఫలం॥

తా॥ అందులో కార్తికశుక్లద్వాదశిని మిక్కిలి పుణ్యప్రదము గనుక దానిని యెంతమాత్రము విడువరాదు కార్తికశుక్లద్వాదశియందు చేసిన పుణ్యము స్వల్పమైనను అనంతఫలప్రదము.

శ్లో: యఇదంపుణ్యమాఖ్యానం శ్రుణోతిశ్రద్ధయాన్వితః।
సర్వాఘౌఘవినిర్ముక్తః పుత్రపౌత్రసమన్వితః।
భుంక్త్వాభోగాననేకాంశ్చ తతోయాతిపరాంగతిమ్॥

తా॥ యీపుణ్యకథను వినువారు పాపవిముక్తులై పుత్రపౌత్రసమేతులై అనేక భోగముల ననుభవించి అంతమందు పరమపదము నొందుదురు.

**ఇతి శ్రీస్కాందపురాణే కార్తికమాహాత్మ్యే ఏకోనత్రింశోధ్యాయస్సమాప్తః,**

---

## అథ త్రింశాధ్యాయారంభః,

ఋషయఊచుః॥ శ్లో॥ సూతనఃకథితంపుణ్యం మాహాత్మ్యంమాధవస్యచ
భూయోవయంశ్రోతుకామాః కార్తికస్యవ్రతస్యచ॥

తా॥ (ఋషులడుగుచున్నారు) ఓసూతమహర్షీ ! మాకు పుణ్యమైనహరిమాహాత్మ్యమును చెప్పితివి యింకా కార్తికమాహాత్మ్యమును వినగోరితిమి.

శ్లో॥ కలౌకల్మషచిత్తానాం తథారాగాత్మయాయినాం।
సంసారాంబుధిమగ్నానా మనాయాసేనకాగతిః॥

తా॥ కలియుగమందు కలుషమానసులై రాగాదులకు లోబడియుండి సంసార సముద్రమందు మునిగియున్నవారికి అనాయాసముగా పుణ్యము లభించెడిది యేది.

శ్లో॥ కోధర్మస్సర్వధర్మాణాం అధికోమోక్షసాధనః।
కోదేవస్సర్వదేవేషు గురుర్గురుఫలప్రదః॥

తా॥ ధర్మములలో యెక్కువ ధర్మమేది దేనివలన మోక్షము సిద్ధించును దేవతలలోపల యెక్కువ దేవుడెవ్వఁడు.

శ్లో॥ కేనదూరాయతేమోహః కర్మణామునిసత్తమ।
మానవామందమతయో మృత్యుపాశేనియంత్రితాః॥
జడాత్మానఃకలౌతేషాం అనాయాసేనకాగతిః।
ఏతత్సర్వంయథాన్యచ్చ బ్రూహిగోవిందసత్కథాం॥

తా॥ యేకర్మచేత మోహము నశించును కలియుగమానవులు మందమతులు జడులు మృత్యుపీడితులును అగుదురు వారి కనాయాసముగా మోక్షముదొరికెడి యుపాయమును చెప్పుము యింకాయితరమైన హరికథను చెప్పుము.

శ్రీసూతః॥ శ్లో॥ మునయస్సాధుపృష్టోహం భవద్భిర్విష్ణుకీర్తనం।
సంస్మారితంజగద్భద్రం సర్వలోకసుఖావహం॥

తా॥ (సూతుఁడు చెప్పుచున్నాఁడు) మునీశ్వరులారా! మీరడిగిన ప్రశ్న చాలా బాగున్నది, మంగళకరమైన హరికీర్తన స్మృతికివచ్చినది కాఁబట్టి సర్వసుఖకరమైన దానిని చెప్పెదను వినుఁడు.

శ్లో॥ భవద్భిర్యత్కృతఃప్రశ్నో మర్త్యానామల్పమేధసాం తన్నిరాణాయకల్పోత్ర శ్రోతౄనందకరఃపరః । శ్రుతంహితాయ జంతూనాం లోకోపహితకారకః। లోకోపకారిణోయూయం క్రతుభిఃభూరిదక్షిణైః। యత్ఫలంపుణ్యతీర్థాది స్నానదానాది కర్మభిః। తత్ఫలంయాంతివిప్రేంద్రా స్సద్భిర్నాత్రసంశయః॥

తా॥ మీరు అల్పబుద్ధులైన జనులకు మోక్షోపాయమును చెప్పుమని గోరితిరి ఈప్రశ్న లోకోపకారము కొరకై యడుగుటచేత నాకుచాలా ఆనందదాయకమైనది అనేకయాగములు చేసియు అనేక పుణ్యతీర్థములందు స్నానాదికమాచరించియు యేఫలము పొందెదరో ఆఫలము యీలాటి మంచిమాటలచేతి లభ్యమగును.

శ్లో॥ శృణుధ్వమృషయోనూనం ఊర్జవ్రతస్యోదితంఫలం। మురారి ప్రీతిసంబోధ కారణంకార్తికవ్రతం। సారంసారతమంవక్ష్యే సర్వశాస్త్రేషుసత్తమాః। బహ్వాత్రఫలమాఖ్యాతుం నసా కల్యాత్కుమంత్కుమః॥

తా॥ మునీశ్వరులారా! వినుఁడు కార్తీకఫలము వేదోక్తమైనది అనఁగా కార్తికమందు వేదోక్తఫలమును బొందెదరవి భావము కార్తీకవ్రతము హరికిఆనంద కారణము సర్వశాస్త్రములను సంపూర్ణముగా చెప్పుటకు నేనుసమర్థుఁడనుగాను కాలము చాలదు కాఁబట్టి శాస్త్రసారములలో సారమును చెప్పెదను వినుఁడు.

శ్లో॥ సంక్షేపాదభిధాస్యామి కైటభారికథాంద్విజాః । కైటభారి కథాసక్తాః తరంతిభవసాగరం । నిర్గచ్ఛత్యాశుకంఘోరం నిత రాంనిరయాస్పదమ్॥

తా॥ శ్రీహరికథను సంగ్రహముగా చెప్పెదను వినుఁడు శ్రీహరికథాసక్తులు ఘోరమైన నరకముల పాల్పడక సంసారసముద్రమునుంచి తరింతురు.

శ్లో॥ కార్తికేకేశవంభక్త్యా తులాసంస్థేదివాకరే। స్నానంవిష్ణ్వర్చ నందానం దీపప్రజ్వలనంనిశి । నరకాత్తాన్విముచ్యేత వృజి నైరాజితైర్జనాత్॥

తా॥ కార్తికమందు హరిని పూజించి స్నానము దానము, ఆలయములందు రాత్రిదీపములు వెలిగించుటను చేయువారు అనేక పాతకములనుండి శీఘ్రముగా ముక్తులగుదురు సందియము లేదు.

శ్లో॥ తులారాశింగతే సూర్యే తదారభ్యానురాగతః। ప్రాతఃప్రతిదినే మాస మేకం విష్ణుపరాయణః। యఆచరేద్వ్రతమిదం జీవన్ముక్తస్స ఉచ్యతే।

తా॥ సూర్యుడు తులారాశిని పొందినది మొదలు ముప్పది దినములు కార్తికవ్రతమును చేయవలెను. ఆలా చేయువాడు జీవన్ముక్తుడగును.

శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియోవాపి వైశ్యశ్శూద్రః స్త్రియోపివా। నకార్తికవ్రతమిద మాచరంతి నరాధమాః। తేయాంత్యంధతమం సత్యం సకులై రపి నసంశయః॥

తా॥ బ్రాహ్మణులుగాని, క్షత్రియులుగాని, వైశ్యులుగాని, శూద్రులుగాని, స్త్రీలుగాని, కార్తికవ్రతమును చేయనియెడల తమ కులజులతో సహా అంధతమిస్ర నరకమును బొందుదురు సంశయము లేదు.

శ్లో॥ కార్తికం ప్రాప్య కావేరీం సలిలే యోనిమజ్జతి। సకేశవపురం యాతి స్తూయమానోఽమరాదిభిః॥

తా॥ కార్తికమాసమందు కావేరీజలమందు స్నానమాచరించువారు దేవతలచేత కొనియాడబడి హరిలోకమును పొందుదురు.

శ్లో॥ కార్తికే మాసి సంప్రాప్తే స్నాత్వా సంపూజ్య కేశవం। సపుమాన్యాతి వైకుంఠం మానవో ముక్తకిల్బిషః॥

తా॥ కార్తికమాసమందు స్నానముచేసి హరిని పూజించు మానవుడు గతపాపుడై వైకుంఠమును జేరును.

శ్లో॥ యేనాచరంతి విప్రేంద్రాః కార్తికోక్తం వ్రతం శుభం। చండాలయోనిం తేయాంతి జన్మసాహస్రకేషు చ।

తా॥ మునీశ్వరులారా! కార్తికవ్రతమును చేయనివారు వేయి జన్మములందు చండాలులై పుట్టుదురు.

శ్లో॥ కీర్తితః కార్తికః పుణ్యః సర్వమాసోత్తమోత్తమః। సర్వపాపప్రహరణం కార్తికస్య వ్రతోత్తమం। విష్ణుప్రీతికరం పుణ్యం దుర్లభం త్వకృతాత్మనాం॥

తా॥ కార్తీకమాసము పుణ్యకరము సమస్తమాసములందు శ్రేష్ఠము కార్తీక వ్రతము హరిప్రీతిదాయకము సమస్తపాతకహరము దుష్టాత్ములకు అలభ్యము.

శ్లో॥ యఃకార్తికే తులాసంస్థే మార్తాండే మానవఃకలౌ । స్నానం దానార్చనంహోమం పరిచర్యామధుద్విషః । సనరఃసర్వ దుఃఖేభ్యః విముక్తోఽమృతమశ్నుతే॥

తా॥ తులయందు రవియుండగా కార్తీకమాసమందు స్నానమును, దానమును, పూజను, హోమమును, హరిసేవను, చేయువారు సమస్తదుఃఖముక్తులై మోక్షమొందుదురు

శ్లో॥ దీపదానంకాంస్యదానం దీపప్రజ్వాలనంహరేః । ధాన్యంఫలం ధనంసద్మ అక్షయంకార్తికవ్రతే।

తా॥ కార్తీకమాసమందు దీపదానము, కంచుపాత్రదానము, దీపారాధనము, ధాన్యము, ఫలము, ధనము, గృహదానము, అనంతఫలప్రదములు.

శ్లో॥ ఆఢ్యోవాపిదరిద్రోవా యఃప్రీత్యాశార్ఙ్గధన్వినః । ఊర్జమాసిమునిశ్రేష్ఠాః కథాశ్రావ్యామహత్ఫలం॥

తా॥ ధనికుడుగాని, దరిద్రుడుగాని, హరిప్రీతికొఱకు కార్తీక మాసమందు కథను విన్నయడల అనంతఫలము నొందును.

శ్లో॥ సర్వపాపప్రశమనం సర్వసంపత్సుఖావహం । సర్వోత్కృష్టఫలమితి మాహాత్మ్యంకార్తికస్యచ॥

తా॥ కార్తీకమాహాత్మ్యమును సర్వపాపములను నశింపచేయును, సమస్తసంపత్తులను గలుగజేయును, అన్నిపుణ్యములకంటెను అధికము.

శ్లో॥ ఇదంయశ్శృణుతేపుణ్య మధ్యాయంమాధవప్రియం। ముఖంచైవసమాసాద్య పశ్చాద్యాతిపరంసుఖమ్॥

ఇతి శ్రీస్కాంద మహాపురాణే కార్తీకమాహాత్మ్యే

ఫలస్తుతిర్నామ త్రింశోధ్యాయః

సమాప్తః.

గ్రంథము సంపూర్ణము.

# ప్రకటన.

| | |
|---|---|
| సిద్ధాంతరహస్యం | 2-0-0 |
| ప్రత్యబ్ధఫల పంచాగసరళి 218 పుటలుగల సిద్ధాంత గ్రంథము పంచాంగము గణించువారికిని ప్రాముఖ్యము టీకా తాత్పర్య ఉదహారణ సహితము ప్రతి 1 కి | 3-0-0 |
| ముహూర్తదర్పణము (తా-స) 1 దర్పణము, 2 దీపిక, 3 గ్రహసమయము లిందుగలవు ప్రాచీనగ్రంథము | 0-12-0 |
| ముహూర్త చింతామణి తాత్పర్యసహితము (అచ్చులో) | 1-8-0 |
| ముహూర్త ప్రదర్శిని ప్రాచీనఫలగ్రంథము (తా-స) | 1-4-0 |
| ముహూర్త చంద్రిక (లేక విద్యామాధవీయము) గుణదోషములు, పరిహారము చక్కగ విశదీకరించి ముద్రించితిమి | 0-8-0 |
| జాతకదీపము తాత్పర్యసహితము | 0-2-0 |
| పూర్వకాలామృతము పదవిభాగ టీకాతాత్పర్యసహితము | 2-0-0 |
| జాతకచంద్రిక గోపాలరత్నాకరం | 0-8-0 |
| మూలానక్షత్ర త్యాజ్యదర్శిని | 0-2-0 |
| జ్యోతిష అక్షరాభ్యాసము, వచనము | 0-3-0 |
| సిద్ధాంత గ్రహలాఘవము పదవిభాగ టీకాతాత్పర్య ఉదాహరణసహితము రెండవకూర్పు అచ్చుఅగుచున్నది | 1-8-0 |
| వర్షఫలప్రదర్శిని (దీనినే కొందరు పుష్పబంధమందురు) | 0-8-0 |
| వనమాలానామక వర్షఫణి | 0-2-0 |
| తిలకఫలమంజరి పుట్టుమచ్చలఫలము రాశ్యాదిఫలనిర్ణయం | 0-2-0 |
| ఉత్తరకాలామృతము (అచ్చులో) | 2-0-0 |
| [illegible]జ్ఞకర్ణామృతము | 1-8-0 |

# పురాణగ్రంథములు.

| | |
|---|---|
| వైశాఖమాహాత్మ్యము - స్కాందాంతర్గతము, తాత్పర్య సహితము ప్రతి 1 కి | 2-0-0 |
| శ్రావణమాస మాహాత్మ్యము (తా-స) శ్రావణమాస వ్రతముల ధర్మము లిందుగలవు ప్రతి 1 కి | 1-0-0 |
| కార్తీకపురాణము- పాద్మాంతర్గతము, (తా-స) | 1-4-0 |
| కార్తీకపురాణము- స్కాందాంతర్గతము, అనేక ధర్మము లుండును | 1-8-0 |
| మాఘమాస మాహాత్మ్యము- స్కాందాంతర్గతము | 2-0-0 |
| గరుడపురాణము - ఆంధ్రతాత్పర్య సహితము దహనము మొదలు ద్వాదశాహస్సువఱకుండు సమస్త దాన ధర్మ విషయములుండును మంచి ప్రతి 1 కి | 1-8-0 |
| ధనుర్మాస మాహాత్మ్యము చిన్నప్రతి | 0-4-0 |
| శివపురాణము తాత్పర్యసహితము | 0-10-0 |
| ఏకాదశీ మాహాత్మ్యము- ద్వాదశీ అన్నదాన మాహాత్మ్యము ఆంధ్రతాత్పర్య సహితముగూడ గలదు | 0-4-0 |
| తులసీపత్ర మాహాత్మ్యము - తాత్పర్యసహితము తయారగుచున్నది | 1-4-0 |
| శివరాత్రి మాహాత్మ్యము (తా-స) | 0-12-0 |
| మహావాక్య రత్నావళి - గొప్ప వేదాంతగ్రంథము ప్రమాణము ప్రతిపదార్థము (తా-స) | 1-8-0 |
| ముహూర్తమార్తాండము, ముహూర్తభాగములలో అగ్రగణ్యమైన జ్యోతిషశాస్త్రము సాంప్రదాయము శ్లోకము, వ్యాఖ్యానము ఆంధ్ర తాత్పర్యసహితము (అ) | 2-[illegible] |

వలయువారు:—

చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిగారి పెర [illegible]గలరు

ఆర్యానందప్రెస్ బందరు-బచ్చుపేట,

మచిలీపట్టణం.